సాహిత్య

# ప్రస్థానం



అక్టోబరు-డిసెంబరు 2004

వెల:రు.10

సాహితీ స్రవంతి

శాంతి నీకు, శాంతి నాకు, శాంతి శాంతి
ఇప్పుడే పుడమి మీద పడ్డ పసిగందుకు శాంతి
రాలే నక్షత్రాలకు, కూలేయోధులకు శాంతి!
పండి తలలొంచిన పంటలకు, ప్రమోదాలకు ప్రశాంత శాంతి!
మహానగరాలకు, మహోన్నత చిత్రశిల్ప సౌందర్యశిఖరాలకు శాంతి!
నీవు పోగు చేసుకున్న ఆశారాశులకు, ఆకాంక్షలకు శాంతి!

CI



డిసెంబర్ 17-19 హైదరాబాద్‌లో యుద్ధ వ్యతిరేక అసెంబ్లీ

చిత్రం : మోహన్

ప్రస్థానం PRSVMO2A114
అక్టోబరు-డిసెంబరు 2004
సంపుటి :1 సంచిక : 1

# మరో మజిలీ

ఈ సంచికతో ప్రస్థానం రెండేళ్లు పూర్తి చేసుకుంది. ఆదరిస్తున్న పాఠకులకు, రచయితలకు, శ్రేయోభిలాషులకు ఈ సందర్భంగా కృతజ్ఞతలు.

ప్రస్థానం ఇంకా బాగా రావాలని, తమకు బాగా చేరాలని వారు కోరుకుంటున్నారు. అది న్యాయమే కూడా. ఇంతవరకూ ఇచ్చిన తోడ్పాటుకు ధన్యవాదాలు తెల్పుతూనే వారి ఆకాంక్షల మేరకు అవసరాల మేరకు అభివృద్ధి చేసేందుకు కృషి కొనసాగిస్తామని హామీ ఇస్తున్నాం.

ప్రస్థానం సమస్యలు కేవలం ఆర్థిక వనరులే కాదు. సాహిత్య లోకంలోనూ, సాహిత్యోద్యమాలలోనూ చాలా కాలంగా పాతుకుపోయిన కొన్ని పొరబాటు భావనలు విశాలమైన,వినూత్నమైన కృషికి ఆటంకాలవుతున్నాయి. ఇలాటి పత్రికలు నడపడానికి అవసరమైన రచనలు రావడం కష్టమనే మాటను గతంలోలాగే ఇప్పుడూ మేము ఒప్పుకోవడం లేదు. కాని అనేక మంది రచయితలలో ఇందుకు సంబంధించిన స్పష్టత లేని మాట నిజం.

సాహిత్యం అంటే తమ రచనలు రావడం లేదా తమకు నచ్చిన వారి రచనలు పొగడడం మాత్రమేనని చాలా మంది భావిస్తున్నారు. అలా కోరుకోవడంలో పొరబాటేమీ లేదు. కాని దానికి ఒక పరిమితి వుండాలి. సాహిత్య సంస్థలు కూడా తమపై విమర్శను ఎదుర్కోవడమే సాహిత్య విమర్శ పరమార్థమని, అది లేకపోతే దేన్నయినా సహించ వచ్చునని భావించడమూ పొరబాటవుతుంది.

తెలుగులో మంచి విమర్శకులు లేరని తరచూ వినిపించే మాట. ఇలాటి అభిప్రాయం కలగడానికి ప్రధాన కారణం పై పాక్షిక ధోరణులే. ఏ మేరకు వాటిని దూరం చేసుకుని సమతుల్యమైన విమర్శనా దృక్పథాన్ని పెంపొందిస్తామనేదానిపైనే అర్థవంతమైన సాహిత్య చర్చ ఆధారపడి వుంటుంది. అలాటి స్ఫూర్తితో ప్రస్థానం సాహిత్య వికాసానికి, సామాజిక చైతన్యానికి పునరంకితమవుతున్నది.

ఇందుకు సంబంధించిన ప్రస్థానం అనుభవాలను రాబోయే సంచికలో వివరంగా ప్రస్తావించుకుందాం. దాంతోపాటే రావలసిన మార్పులు చేర్పులు మాట్లాడుకుందాం.

ముఖచిత్రం : ముక్తవరపు వసంత కుమారి
లోపలి చిత్రాలు : జె. వెంకటేష్, అక్బర్, ప్రభాకర్, శేఖర్

## ఈ సంచికలో...



సంపాదకుడు
తెలకపల్లి రవి
ముద్రాపకులు, ప్రచురణకర్త
వి. కృష్ణయ్య
మేనేజర్
కె. లక్ష్మయ్య

అడ్రస్ : సాహిత్య ప్రస్థానం
1-1-187/1/2,
వివేక్‌నగర్, చిక్కడపల్లి,
హైదరాబాద్-500 020
ఫోన్లు : 27660013, 27635136



# నాకు నా ఏరు కావాలి

గంటేడ గౌరు నాయుడు

నాకు నా ఏరు కావాలి
అమృతపూర్ణ... నా తల్లి నాగావళి, నావూరి పాపిటిసేరు కావాలి
నన్ను తన వొడిలో కూర్చోబెట్టుకుని
తేదీలను కలపడానికి మగ్గంలో కండెలా తిరుగుతూ
ఓడ నేసే జలవస్త్రం కావాలి

పుస్తకాల సంచీ... కేరేజీ... రెండూ రెండు చేతుల్లో పట్టి నీట్లో అడుగెడితే
నోట్లో నీళ్ళు పడకుండా నా నడుంపట్టి అవతలి వొడ్డుకు నన్ను
ఒడుపుగా నడిపించిన జలహస్తం కావాలి.

అంతెత్తు నుండి ధభాలున దూకి బుడుంగున మునిగి నీటి అడుగుకు
చేరిన నన్ను పైకి తేల్చి ఆనందాల ఓలలాడించిన జలడోల కావాలి.

చినుకుల మునివేళ్ళతో అలల తీగలు మీటి శ్రావణ మేఘాలతో
గొంతుకలిపే
లయలహరుల జలగీతం కావాలి

నాకు నా ఏరు కావాలి
నా ఏటి వొడ్డు వెదురు వనాల వేణుగానాల హోరుకావాలి

నాతో పోట్లాటకుదిగి... నన్ను తల కిందులు చేసి
అలసిన నన్ను చూసి పరిహసించినదే
నా మునుగీత.. .లోయీత.. బారీతలకు మెచ్చి
నువ్వు నదిని జయించావురా' అని భుజం తట్టే అలనేస్తం కావాలి

అల్లంత దూరంలో నన్ను చూసి ఉప్పొంగి
నిలువెల్లా అల్లుకుని కెరటాల వొంపులతో
నన్నుక్కిరిబిక్కిరి చేసే జలకన్య కావాలి

నాకు నా ఏరు కావాలి
నా పూల కెరటాల తేరు కావాలి

ఎండిన మోడుల్ని... దుక్కల్ని... దూలాల్నీ
అలవోకగా మోసుకొచ్చి
ఏడాదికి సరిపడే వంట కలపను అందించి...
ఏపూట కాపూట
పులుసుతోనో... ఇగురుతోనో ముద్ద దిగడానికి జలపుష్పాలనిచ్చీ...
మడిలోకి ఎగిసిపడి
వరిదుబ్బుల్లో వొండుమట్టి సారంనింపీ
పాల కంకులమీద మా పేర్లు రాసే జలదేవత కావాలి
గుండెను ఆయిలింజను చేసి
నీటి జుట్టుపట్టి మడిలోకి యీడ్చుకొచ్చినా
మా బావును పచ్చని నవ్వులతో పలకరించి
మా దోసిళ్ళలో మెతుకుల ముత్యాలు కురిపించిన సుజలహాసిని కావాలి.

గడపగడపలో వేకువముగ్గై
కడవ కడవలో నిండిన వెలుగై
కండకండలోపండిన చెమటై
గుండె గుండెకు నెత్తుటి ధారై
ప్రవహించి... ప్రసరించి ఊరికి ఊపిరైన జలశ్వాస కావాలి
నాకు నా ఏరు కావాలి
నా హరిత ప్రవాహాల వరిచేలనారు కావాలి
నేలబుగ్గినెత్తికెత్తుకున్న మట్టి దేహాలను
అలల నాలుకల్తోనాకి శుభ్రపరిచే గోమాత నా ఏరు
పురాణం గురువుగారినీ... డప్పుగురవడినీ
ఒకేసారి తన చేతుల్తో శిరఃస్నానం చేయించే
తేడా లెరుగని తల్లి నా ఏరు.
నన్ను మనిషిని చేసింది ఏరు
నన్ను నదిని చేసి నడిపించింది ఏరు
నా ఏరు నాకు కావాలిప్పుడు



నా ఏరు. ఏటేటా ఎక్కడెక్కడో తప్పిపోయినప్పుడల్లా
ఎండిన ఇసుక మేటనై... ఏడ్చియేడ్చి
మబ్బుల్ని బతిమాలి నానదిని బతికించుకోవడం ఎలా మరిచిపోగలను!
నా ఏటినెవరో ఎత్తుకు పోతున్నారిప్పుడు
నేనో ముంపు గ్రామమై మూలుగుతుంటే
నన్ను సన్న వస్త్రం చేసి
పరిహారాల పరింకంపల మీద ఆరేస్తున్నారు
నాకు నా ఏరు కావాలిప్పుడు
బలదేవుని అనురాగ ధార.. నాటి నాగేటి చాలు కావాలిప్పుడు
నామడి చెక్కలను మూగజీవాలను చేసి గుటుక్కున మింగి
భుక్తాయాసంతో కదలలేని నిలవనీటి కొండ చిలువ కాదు
నాలో చైతన్యం నింపి నెత్తుటిని పరుగులెత్తించే...
నా తల్లి చలనచేతుల స్పర్శ కావాలి

అమృతపూర్ణ నాగావళి... మధుకుల్యాలాంగుల్యా...
నా గ్రామ దేవత శిరసుమీద సుజలపూర్ణ స్వర్ణకలశం కావాలి
నాకు నా ఏరు కావాలి
నా ఏటిపాట కావాలి.
**(మా గ్రామాలను ముంపునకు గురిచేసి మా ఏటి నీరు మాకు అందకుండా పోతుందని తెలిసి)**

# సాహిత్యంలో వస్తు - శిల్పాలు

**సాహిత్యంలో వ్యక్తమయ్యే ప్రధాన భావాన్ని వస్తువనవచ్చు. రచయిత సాహిత్యంలో వివరించిన ఆశయాన్ని వస్తువుగా చెప్పవచ్చు. ఆ వస్తువు ఏ రూపంలో అభివ్యక్తం అవుతుందో ఆ రూపాన్ని శిల్పం అంటారు. ప్రక్రియ, భావ ప్రతిమలు, భాష శిల్పంలో ముఖ్యమైన అంగాలు. భాష భావ ప్రతిమలుగా రూపొంది మొత్తం అనుభూతికి, అనుశీలనకు అంటే స్వయం సమగ్రమైన రూపంగా వ్యక్తం కావటం ప్రక్రియ. పురాణం, నాటకం, ప్రబంధం, నవల, కథ, గేయం మొదలైనవి ప్రక్రియలు. జీవితంలో అనుభవానికి దృశ్య నిర్మాణం చేయటం భావప్రతిమ.**



**త్రిపురనేని మధుసూదనరావు**

ఏ విషయంలో అయినా ప్రకటనలు చేయటం మంచిది కాదు. అది శాస్త్రీయ వివరణకు దోహదం చేయదు. సాహిత్యంలో తప్పుడు సిద్ధాంతాలు చేసే అవకాశం చాలా ఎక్కువ. అధ్యయనం చేసే శాస్త్రీయ పద్ధతి అలవాటులో లేకపోవడమే బహుశా ఈ గందరగోళానికి కారణం.

సాహిత్యాన్ని సృష్టించటం సాహిత్యాన్ని వివరించడం కంటే సులభంగా కనిపిస్తోంది. సమాజ చరిత్ర ఆరంభమయినప్పటి నుంచి, ఆ చరిత్రలో భాగంగా సాహిత్యం వుండనే వుంది. వాస్తవానికి సాహిత్యానికి ప్రత్యేకమైన స్వతంత్ర ప్రతిపత్తిగల చరిత్ర వుండదు, ప్రజల చరిత్రలో అది ఒక చైతన్య కార్యకలాపం. అందుకనే సాహిత్య స్వరూప, స్వభావాలను సమాజ పరిణామం వెలుగులోనే పరిశీలించవలసి వుంది. చారిత్రకత ఆధారంగానే పరిశోధించవలసి వుంది.

**వస్తువు శిల్పం**

సాహిత్యంలో మౌలిక సమస్య వస్తు-శిల్పాలకున్న సంబంధం. ప్రాచీన యుగాల నుంచీ ఆ యుగాల పరిధిలో అనేక మంది ఈ విషయాన్ని గూర్చి అభిప్రాయాలను ప్రకటించారు. అన్నింటిలాగానే ఈ విషయంలోనూ వర్గ స్వభావమే పునాదిగా వుంది. ప్రపంచంలో ప్రతిదానికీ ఏదో ఒక రూపం వుంది. పదార్థాల్లో సారాంశం వస్తువే అయినా అది రూపంతోనే అస్తిత్వంలో వుంటుంది. రూపాన్ని ఆశ్రయించుకునే వస్తువు వ్యక్తం అవుతుంది. సమాజ జీవితంలో వచ్చే ప్రతి చిన్న మార్పూ వస్తువులో మార్పును తెస్తుంది కాని రూపంలో కొన్ని అతి ముఖ్యమైన చారిత్రక సందర్భాల్లోనే మార్పు కనిపిస్తుంది. జీవితానుభవంలో కొత్తశక్తులు కొత్త రూపాలను అభివృద్ధి చేస్తాయి. సాధారణంగా అభివృద్ధి క్రమంలో వస్తువే రూపాన్ని నిర్ణయిస్తుంది. రూపం వస్తువును నిబద్ధించే సందర్భాలు కూడా వుంటాయి.

సాహిత్యంలో వస్తు - శిల్పాలు అంటే అర్థం ఏమిటి? వాటి పరస్పర సంబంధం ఏమిటి? సాహిత్యంలో వ్యక్తమయ్యే ప్రధాన భావాన్ని వస్తువనవచ్చు. రచయిత సాహిత్యంలో వివరించిన ఆశయాన్ని వస్తువుగా చెప్పవచ్చు. ఆ వస్తువు ఏ రూపంలో అభివ్యక్తం అవుతుందో ఆ రూపాన్ని శిల్పం అంటారు. ప్రక్రియ, భావ ప్రతిమలు, భాష శిల్పంలో ముఖ్యమైన అంగాలు. భాష భావ ప్రతిమలుగా రూపొంది మొత్తం అనుభూతికి, అనుశీలనకు అంటే స్వయం సమగ్రమైన రూపంగా వ్యక్తం కావటం ప్రక్రియ. పురాణం, నాటకం, ప్రబంధం, నవల, కథ, గేయం మొదలైనవి ప్రక్రియలు. జీవితంలో అనుభవానికి దృశ్య నిర్మాణం చేయటం భావప్రతిమ. అసలు సాహిత్యం అంటే 'భావప్రతిమల్లో ఆలోచించటం'గా నిర్వచించిన వాళ్ళు వున్నారు. భాష సాహిత్యానికి జాతీయ రూపాన్ని ఇస్తుంది. ప్రధానంగా ఈ మూడు అంశాల్ని కలిపే శిల్పం అంటాం. ఈ వస్తు, శిల్పాల్లో ఏది ముఖ్యం? వస్తువు నిర్ణయాత్మకమైన పాత్ర నిర్వహిస్తుంది. కాబట్టి వస్తువే ప్రధానమైన అంశం.

కళారంగంలో శిల్పవాదులూ వస్తువాదులూ ఆదిమ కాలం నుంచీ వున్నారు. అంటే, సాహిత్యంలో శిల్పమే ప్రధానమని వాదించే వాళ్ళూ, సాహిత్యంలో వస్తువే ప్రధానమని వాదించే వాళ్ళూ వున్నారని అర్థం. ఫ్యూడల్ సాహితీపరులు, కళా నిపుణులు శిల్పవాదులుగా ప్రసిద్ధిపొందారు. ఆ యుగాల్లో వివిధ దేశాల్లో పండితుల అభిప్రాయాలను పరిశీలిస్తే వాటిలో వర్గస్వభావాన్ని సులభంగానే విశ్లేషించవచ్చు. ప్రక్రియకు, భాషకు ఎంత ప్రాధాన్యం ఇచ్చినట్టు పైకి కనిపించినా, ఫ్యూడల్ కళానిపుణుల వాదాల్లో కూడా వస్తు ప్రాధాన్యాన్ని మనం గమనించవచ్చును.

**శ్రమ కళ**

ఇతర విషయాల్లాగానే సాహిత్యం కూడా సామాజిక అవసరాల నుంచే పుట్టింది. భాషలాగా, భాషకు ఉన్నత రూపమైన సాహిత్యం కూడా శ్రమ నుంచీ శ్రమలోనే, శ్రమతోపాటే పుట్టి పెరిగింది. ప్రకృతిలో, సమాజంతో ఆవేశంతో కూడిన సంబంధాల ఫలితమే సాహిత్యం. అంటే, సాహిత్యం మానవీయమైన ఒక చైతన్య రూపం. ఉత్పత్తి సాధనాల మీద, పనిముట్ల మీద వాటిని వుపయోగం చేసే సామూహిక శ్రమ మీదా మనిషి అనుభూతితో కూడిన సంబంధం పెట్టుకున్నప్పుడు సాహిత్యరూపాలు ఏర్పడ్డాయి. ఆత్మరక్షణ, ఆహార సంపాదనల నుంచీ ఆరంభమైన సాంఘిక జీవనక్రమం సాహిత్యంలో వస్తువైంది. శ్రమకు పూర్వం మనిషి వూహల్లోని శ్రమఫలితం, సాహిత్య వస్తువును వూహించటానికి పునాది అయింది. మనిషిలో ఎప్పుడైతే ఇతర మనుషులతో కలిసి నిర్మాణ కౌశలం ఆరంభం అయిందో, అప్పుడే సాహిత్యంలో వస్తు, శిల్పాలు ఏర్పడ్డాయి. శిల్పంలో ముఖ్యాంశమైన భాష శ్రమనుంచే పుట్టి మానవ సంపర్కాన్ని క్రమబద్ధం చేసింది. ఆదిమ మానవుల్లో చేపలు పట్టటం, వేటాడటం. పశువుల పెంపకం మొదలైన శ్రమ క్రమాల్లోనే వస్తు, రూపాల అంతర్గత గాఢ సంబంధాన్ని మనం గ్రహించవచ్చు. శ్రమ కంటే ముందే ఆ శ్రమ మూలంగా తాము సాధించదలచిన ఫలితాన్ని గురించి మనిషికి ఊహలు, అభిప్రాయాలు వున్నాయి. కాబట్టి వస్తువు మౌలికాంశం. వస్తువు తనకు అనుగుణ్యమైన రూపాన్ని పొందుతుంది.

**ఆదిమ సమాజం**

ఆదిమ యుగాల్లో సాహిత్యం మనకు అందుబాటులోలేదు. చారిత్రక పరిణామాన్ని శాస్త్రీయంగా పరిశీలించటం ద్వారా ఆదిమ సమాజ కళారూపాలకు గూర్చి కొంత

వూహించటం సాధ్యం కావచ్చును. స్పష్టంగా రూపొందిన పనిముట్లు, సాధనాలు లేవు కాబట్టి ఆదిమ మానవుల శ్రమ సామూహిక మానవశ్రమే. జట్లుగా, గుంపులుగా ఆహార సంపాదన చేసి అందరూ అనుభవించే యుగం కాబట్టి ఆనాటి సాహిత్యం అనబడే మాజిక్ (మాయ) బృంద నృత్యాల్లో, వాళ్ళు వుచ్చరించే ధ్వనుల్లో, ఒక సామూహికత ఉండేది. వస్తువులో, శిల్పంలో కూడా సామూహికత్వం అప్పుడు ఒక ప్రధాన లక్షణంగా వుండేది. వాళ్ళ భౌతిక జీవితం చాలా పరిమితం కాబట్టి భావరంగం పరిమితమే. శబ్దకోశమూ పరిమితమే. అయితే వస్తు శిల్పాల మధ్య ఐక్యత పటిష్టంగా వుండే అవకాశం చాలా ఎక్కువ.

**వర్గ సమాజం**

ఇప్పుడు మనకు అందుబాటులో వున్న సాహిత్యం అంతా దాదాపు వర్గ సాహిత్యమే. అంటే వర్గాలుగా విభజింపబడిన సమాజ జీవితం నుంచి పుట్టిన సాహిత్యమే. కాబట్టే సాహిత్యాన్ని వర్గదృష్టితో పరిశీలించవలసిన ఆవశ్యకత వుంది. వస్తు విశ్లేషణ చేస్తే నిర్దిష్ట రచన ఏ వర్గ జీవితాన్ని ప్రతిబింబిస్తోంది అనేది తేల్చుకోవచ్చును. సాధారణంగా ఏ యుగంలో అయినా భౌతిక విషయాల మీద, అంటే స్థూలంగా ఉత్పత్తి సాధనాల మీద ఏ వర్గానికి అధికారం వుంటుందో బౌద్ధిక విషయాల మీద కూడా ఆ వర్గానికే అధికారం వుంటుంది. అధికారవర్గ భావాలే యుగ విశిష్ట భావాలుగా గణించబడతాయి. శిల్పం వస్తువును అనుసరించేదే కాబట్టి ప్రక్రియ, భావ ప్రతిమలు చాలా వరకు అధికారవర్గ బాహ్య స్వరూపాన్ని ఆశ్రయించే వుంటాయి. భాష వరకు పదబంధాల్లోనూ, యాసలోనూ అధికారవర్గానికి సంబంధించి వుంటుంది. సాహిత్యం సామాజిక జీవితానికిగల వుపరితలంలో ఒకానొక అంశం కాబట్టి స్పష్టమైన వర్గ విశ్లేషణ అన్ని సందర్భాల్లోనూ సాధ్యం గాకపోవచ్చును. రచయిత మొత్తం జీవితాన్ని, అంటే, సమకాలిక జీవితాన్ని చిత్రణ చేసినట్లు కనిపించినా, ప్రధానంగా రచయిత ఏదో ఒక వర్గానికి అనేక సందర్భాల్లో పాలకవర్గానికి ప్రాతినిధ్యం వహిస్తాడు. వర్గాతీతమైన కళ అంటూ వుండదు. సమాజంలో ఒక చారిత్రక దశ మారినప్పుడు, తక్షణం వుపరితలంలో వున్న సాహిత్యం మారిపోదు. ఉత్పత్తి శక్తిలో మార్పు వస్తే వుత్పత్తి సంబంధాలు మారతాయి. ఆ తర్వాత క్రమంగా సాహిత్యాది వుపరితల అంశాల్లో మార్పు వస్తుంది. అలాగే రచనలో ప్రధానభావం చారిత్రక దశకు పరిమితంగా, అధికారవర్గ ప్రతిబింబంగా వున్నా, అంతకు పూర్వ సమాజంలోని అనేక విషయాలు తిరోగామి, వురోగామి భావాలు రచనల్లో చోటు చేసుకుంటాయి. రాబోయే చారిత్రక దశను కాల్పనిక ఆవేశంతో చిత్రించటం కూడా జరుగుతుంది. ఏ యుగంలోనయినా, మౌలికమైన మార్పును కోరే భావాలు ప్రమాదకరమైన భావాలుగా అధికారవర్గాలచేత పరిగణించబడతాయి. రచనలో వస్తువును పరిశీలించేటప్పుడు ఈ విషయాలన్నిటిని దృష్టిలో వుంచుకోవాలి.

**సమాజంలో ఒక చారిత్రక దశ మారినప్పుడు, తక్షణం వుపరితలంలో వున్న సాహిత్యం మారిపోదు. ఉత్పత్తి శక్తిలో మార్పు వచ్చిన వుత్పత్తి సంబంధాలు మారతాయి. ఆ తర్వాత క్రమంగా సాహిత్యాది వుపరితల అంశాల్లో మార్పు వస్తుంది. అలాగే రచనలో ప్రధానభావం చారిత్రక దశకు పరిమితంగా, అధికారవర్గ ప్రతిబింబంగా వున్నా, అంతకు పూర్వ సమాజంలోని అనేక విషయాలు తిరోగామి, పురోగామి భావాలు రచనల్లో చోటు చేసుకుంటాయి. రాబోయే చారిత్రక దశను కాల్పనిక ఆవేశంతో చిత్రించటం కూడా జరుగుతుంది.**

ప్రతి యుగం, మానవ విజ్ఞాన అభివృద్ధితోబాటు, అవాస్తవమైన భ్రమాజనితమైన మూఢ భావాలను కూడా అభివృద్ధి చేస్తుంది. వర్గ సమాజ ఆరంభదశల్లో పనిముట్లు, వుత్పత్తి సాధనాలు అభివృద్ధి కావటంతో పురాణంవంటి ప్రక్రియలు పుట్టాయి. బానిస, అర్ధబానిస సమాజ జీవితంలో రుణ, ధనాంశాలు ఈ ప్రక్రియల్లో చాలా వున్నతంగా చిత్రించబడ్డాయి. జీవితాన్ని గూర్చి, ప్రకృతిని గూర్చి సరైన, అంటే, శాస్త్రీయమైన భావాలతోబాటు, జీవితాన్ని గూర్చి, ప్రకృతిని గూర్చి అహేతుకమైన అద్భుతాలను కూడా బహుళంగా చిత్రించటం జరిగింది. విశాలమైన భూమి సాగులోకి రావటం, బానిస యజమానులు, అర్ధబానిసల యజమానులు నియతబృందంగా స్థిరం కావటంతో, సమాజ ఆరంభదశల వాస్తవికత అద్భుతాలతో పురాణం వంటి ప్రక్రియలో వివరించటం జరిగింది. దేవుళ్ళు, దేవతలు, రాజులు, పురోహితులు, చిల్లర దేవుళ్ళు, పరలోకాలు, జన్మలు, కర్మలు, ఆత్మలు మొదలైన 'భ్రమ'లన్నీ బానిస, అర్ధబానిస చారిత్రక దశల జీవిత వివరణలే. సమాజ ఆరంభాల్లోని మానవ విజయాలు పురాణాల్లో వస్తువుకాగా, మానవ భ్రమలు పురాణ ప్రక్రియ.

**భూస్వామ్య యుగం**

సాహిత్యం ప్రధానంగా అర్ధబానిస యుగం అనబడే ఫ్యూడల్ యుగాల్లో బాగా అభివృద్ధి పొందింది. పాలక వర్గాల జీవిత విధానం, వాళ్ళ జీవిత వైరుధ్యాలు ప్రధాన వస్తువుగా రూపొందింది. పాలకవర్గాన్ని సర్వగుణ సంపన్నమైన నాయకత్వంగా సాహిత్యం కీర్తించింది. దీర్ఘకావ్యాలు, నాటకాలు ఈ యుగాల్లో ప్రధాన ప్రక్రియలుగా వున్నాయి. శిల్పవాదాన్ని కూడా ఫ్యూడల్ కళానిపుణులే విస్తృతంగా ప్రచారం చేశారు. రాజులు, భూస్వాములు, పురోహితుల వైభోగజీవితం, ఈ పాలక వర్గాల మధ్య వైరుధ్యాలు, ఫ్యూడల్‌యుగ సాహిత్యవస్తువైంది. రైతాంగం, చేతిపని వాళ్ళు ఎక్కడో కొన్ని సందర్భాల్లో మూర్తిగా అధీనులుగా వర్ణించబడ్డారు. పాలకవర్గ విధేయులుగా ప్రభుభక్తి పరాయణులుగా చిత్రింపబడ్డారు. రాజుల అధికార దర్పాన్ని, దర్జా జీవితాన్ని, రాజవీధుల సౌందర్యాన్ని, కోటల్ని, అంతఃపురాల్ని విశాల పృథ్వీ అధికారాన్ని స్ఫురింపచేసే శిల్పంలోనే, ఆనాటి సాహిత్య రూపాలు మలిచారు. నాటకాల్లో కూడా ఆస్థానాల్లో ప్రదర్శించటానికి అనువైనట్లుగానే వస్తు చిత్రణ జరిగింది. పాలకవర్గాల మధ్య వైరుధ్యాన్ని విషాదాంత నాటకాల్లో మంచికీ చిన్న బలహీనతలకీ మధ్య ఘర్షణగానే చిత్రించారు. కులీనులే, సంప్రదాయ వ్యక్తులే ప్రధాన పాత్రలుగా, అంటే, ప్రధాన జీవిత భాగాలుగా నిర్మించబడ్డారు. వినేది, చూసేది సంతోషించేది, కులీనులే, రాజబంధువులే కాబట్టి పరమ విశ్రాంతి వాళ్ళకే సాధ్యం కాబట్టి సుదీర్ఘ కావ్యాలు, విపుల నాటకాలు వచ్చాయి. రసానుభూతి అన్నా చిత్త ప్రక్షాళనం అన్నా వర్గ విధేయతా వాదమే.

**పెట్టుబడిదారీ యుగం**

ఫ్యూడల్ విధానం స్థానంలో పెట్టుబడిదారీ విధానం వచ్చేప్పటికి ప్రపంచం అంతటా ఆధునిక సాహిత్యం అనేది ఆరంభమయింది. అర్ధబానిస వర్గాలకు వ్యతిరేకంగా బూర్జువాలు స్వేచ్ఛ, స్వాతంత్ర్యం,

సౌభ్రాతృత్వంలాంటి ప్రజాస్వామ్య నినాదాలు యిచ్చారు. మతానికి వ్యతిరేకంగా శాస్త్ర విజ్ఞానాన్ని అభివృద్ధి చేశారు. పారిశ్రామిక విప్లవం జీవితానుభవాన్ని మార్చివేసింది. వస్తు, శిల్పాల్లో కూడా గుణాత్మకమైన మార్పు వచ్చింది. మానవతావాదం, వ్యక్తి స్వేచ్ఛ మొదలైన ఆదర్శాలు ప్రధాన వస్తువులైనాయి. శాస్త్రప్రభావంతో ప్రతీకవాదం (సింబాలిజం) లాంటి నూతన వుద్యమాలు వచ్చాయి. ఇటలీ, జర్మనీ, ఆధునిక కవిత్వానికి నాంది పలికాయి. ఒక అంతర్జాతీయ స్పృహ రచయితల్లో పెరిగింది. వస్తువులో మౌలికమైన మార్పుకొట్టవచ్చినట్టు కనిపించింది. ఉత్పత్తి సాధనాల్లో సంకీర్ణత పెరిగి వుత్పత్తి క్రమం విస్తృతమవుతుంది. ఉత్పత్తిలో, జీవితంలో వేగం పెరుగుతుంది. జన సంబంధాలు విశాలమై అత్యధిక జనాభాను క్రియాశీలం చేస్తాయి. ఇదంతా శిల్పాన్ని ప్రభావితం చేసింది. నవల, కథానిక, సినిమా, రేడియో, టెలివిజన్లకు అనువైన సాహిత్య కళారూపాలు, కొత్తశిల్పాలు ఆవిర్భవించాయి. సగటు పాఠకుల సంఖ్య పెరిగి ఆవేశ సంబంధాల స్థానంలో 'ఆలోచన' రాజ్యాధికారాన్ని ప్రకటించుకుంది. అందుకే 'వచనయుగం' ఆరంభమయింది. చివరకు కవితను కూడా ప్రభావితం చేసి వచన కవిత అనే ప్రజాస్వామ్యరూప మేర్పడింది.

వస్తు, శిల్పాల్లో కీలకమైన అంశం వస్తువే అని అనుకున్నాం. సమాజంలో ఏ చిన్న మార్పునయినా సాహిత్యంలో వస్తువు 'రికార్డు' చేస్తుంది. అలాగే జీవిత విధానం మార్పుకు అభిముఖం అవుతున్నప్పుడు, వస్తువులో గణనీయమైన మార్పులు వస్తాయి. వస్తువుల్లో వచ్చినంత ఖచ్చితంగా శిల్పాల్లో మార్పులు రావు. ఉత్పత్తి సంబంధాల్లో తీవ్రమైన మార్పువచ్చినప్పుడే శిల్పాల్లో మార్పు వస్తుంది. ఉత్పత్తి సాధనాలు కొత్తవి ఏర్పడినపుడు నూతన ప్రక్రియలు ఏర్పడే అవకాశం వుంది. సామాజిక జీవితం మారినా చాలా కాలం వరకు సాహిత్యంలో పాత శిల్పాలు కొనసాగుతూనే వుంటాయి. పాత వుత్పత్తి సాధనాలు వున్నట్టే ఒకే పాత శిల్పంలో కొంత మేరకు వివిధ వర్గాల జీవితం చిత్రించవచ్చు. పురోగామి స్వభావంగల వర్గాల జీవితావసరాలు అనేక కొత్త వుత్పత్తి సాధనాలను రూపొందించినట్టే ఉపరితలంలో అనేక కొత్త రూపాలను కూడా రూపొందిస్తాయి. నవల, సినిమాలాంటివి బూర్జువా సమాజంలో వెలువడిన రూపాలే. బూర్జువా వుత్పత్తి విధానానికి మూలమైన సాధనాల, ముఖ్యంగా యంత్రాల ప్రభావం శిల్పం మీద వుంది.

**వస్తు, శిల్పాలు రచనలో చాలా సన్నిహితంగా కలిసిపోవటం ఉన్నత విలువలు కల సాహిత్య లక్షణం. నిర్దిష్ట వస్తువు నిర్దిష్ట శిల్పంలోనే వ్యక్తమవుతుందన్నంత సహజంగా, దృఢంగా మంచి రచనలో వస్తు శిల్పాలు కలిసిపోతాయి. ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చేసిన ప్రముఖ రచనల్ని పరిశీలిస్తే ఈ విషయాన్ని గ్రహించవచ్చును. ఆ రచనల శిల్పాన్ని మార్చి ఆ వస్తువును అలాగే చిత్రించటం సాధ్యంకాదు. ఒక సాంఘిక దశ శిథిలమై కొత్త శక్తులు వికసించని దశల్ని క్షీణ యుగాలు అంటాం. ఇలాంటి యుగాల్లో శిల్పానికి వస్తువుకు వైరుధ్యం వస్తుంది. కేవలం శిల్పవాద ప్రాధాన్యం పెరుగుతుంది.**

బూర్జువా శిల్పానికి వేగం, సంకీర్ణత స్వభావాలు, పదబంధాల్లోనూ, పాతమాటలకు కొత్త అర్థాలను కల్పించుటలోనూ, భాషా విషయంలో కూడా కొంత పైపై మార్పు వస్తుంది. కథాంశం, పాత్రలు దీర్ఘవివరణలుండి వాటి స్థానంలో భావప్రతిమలు పెరుగుతాయి. సాహిత్య వస్తువులో స్థూలంగా చూస్తే పాతయుగాల జీవిత మత పరిభాషలోనూ, ఆధునికయుగంలో మానవత పరిభాషల్లోనూ వివరించటం జరుగుతుంది.

**వస్తు శిల్పాల సమ్మేళన**

సాధారణంగా వస్తు, శిల్పాలు ఒక యుగంలోని సాహిత్యంలో సమానంగానే వుంటాయి. ముఖ్యంగా శిల్పంలో యుగానికి ఒక శిల్పం వుంటుంది. ఉత్పత్తి రంగంలో కూడా ప్రధానంగా ఒక రకమైన ఉత్పత్తి సాధనం ప్రధానంగా వుండటమే దానికి కారణం. శ్రమ సాధనంవలె రచయితకు రచనకు మధ్య ప్రయోగింపబడి రచనకు సహకరించేది ప్రక్రియ.

వస్తు, శిల్పాలు రచనలో చాలా సన్నిహితంగా కలిసిపోవటం ఉన్నత విలువలు కల సాహిత్య లక్షణం. నిర్దిష్ట వస్తువు నిర్దిష్ట శిల్పంలోనే వ్యక్తమవుతుందన్నంత సహజంగా, దృఢంగా మంచి రచనలో వస్తు శిల్పాలు కలిసిపోతాయి. ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చేసిన ప్రముఖ రచనల్ని పరిశీలిస్తే ఈ విషయాన్ని గ్రహించవచ్చును. ఆ రచనల శిల్పాన్ని మార్చి ఆ వస్తువును అలాగే చిత్రించటం సాధ్యంకాదు. ఒక సాంఘిక దశ శిథిలమై కొత్త శక్తులు వికసించని దశల్ని క్షీణ యుగాలు అంటాం. ఇలాంటి యుగాల్లో శిల్పానికి వస్తువుకు వైరుధ్యం వస్తుంది. కేవలం శిల్పవాద ప్రాధాన్యం పెరుగుతుంది. వాస్తవానికి ఇలాంటి సందర్భాల్లో వస్తు, శిల్పాలు రెండూ క్షుద్రంగానే వుంటాయి. బాగా పాతబడి, ప్రభావం చేసే శక్తిని కోల్పోయిన వస్తు శిల్పాలు క్షీణ యుగంలో వుంటాయి. పాలకవర్గాలు ఆ వర్గాల కళా సాహిత్య నిపుణులు సాహిత్యంలో శిల్పం ప్రధానమనే వాదాన్ని బలంగా ప్రచారం చేస్తారు. ఆ విధంగా వస్తువులో నవ్యత రాకుండా ఆటంకపరచటమే వాళ్ళ వుద్దేశ్యం. కొత్తగా పుడుతున్న వర్గాల భావాలను రచనల్లోకి రాకుండా అణచివేయడం ఈ వాద సారాంశం. దేశ దేశాల్లోని ప్రగతి వాద విప్లవ రచయితలు ఈ శిల్ప వాదాన్ని నిరాకరించి, అధిక సంఖ్యాక ప్రజల్లోకి సాహిత్యాన్ని తీసుకుపోవటాన్ని దృష్టిలో పెట్టుకుని, శిల్ప ప్రాముఖ్యాన్ని పరిమితం చేయాలి. ప్రజా ప్రక్రియలను, ప్రజల నుడికారాన్ని చేపట్టి, ప్రజల కోసం ప్రజా సమస్యల్నే వస్తువుగా నిర్మించాలి.

**సాహిత్యానికిగల విప్లవకర శక్తి**

సాహిత్యం వుపరితలం అంటే అది ఏ విప్లవ బాధ్యతను నిర్వహించలేదనే జడాత్మక నిర్ధారణలను చేయకూడదు. ఎందుకంటే వుపరితలంలో జరిగే నిర్విరామ పోరాటం, పునాదిలోనే జరిగే పోరాటం అవిభాజ్యం గానే వుంటుంది. ఇవి పరస్పర ప్రభావం చూపుకొంటాయి. సాహిత్యంలో ప్రధానమైన భాష వుపరితలం కాదు. ఎందుకనంటే, సమాజ దశలు మారుతుంటే భాష మారటం లేదు. భాషలో విప్లవాలంటూ వుండవు. ఒకే భాషలో బూర్జువాలు తమ సిద్ధాంతాలను, కమ్యూనిస్టులు తమ సిద్ధాంతాలను చెప్పవచ్చును. కాబట్టి సాహిత్యం పాక్షికంగా వుపరితలం. విప్లవ కవిత్వంలో శిల్పం లేదనే వాదం విప్లవ వస్తువును నిరాకరించే ముసుగువాదం, శిల్ప దృష్ట్యా తక్కువ రకం కవిత్వం అన్ని యుగాల్లోనూ, అన్ని రకాల కవిత్వాల్లోనూ వుంటుంది. శిల్పం పేరుతో ప్రజా వస్తువును ఫ్యూడల్, బూర్జువా ప్రక్రియల్లో ఇరికించటం సరియైనదికాదు. వస్తువులో కరిగిపోయేదిగా వుండే శిల్పాన్ని మనం చేపట్టాలి. పురాణం ప్రబంధం వంటి మృత ప్రక్రియలను తప్ప అన్నిటిని విప్లవ రచయితలు వుపయోగించ కోవచ్చును.

**("సాహిత్యంలో వస్తు శిల్పాలు" సంకలనం నుండి**

# నిరంతర చైతన్యశీలి ముల్క్‌రాజ్ ఆనంద్



గాంధీని, మార్క్స్‌ను ఆవహించుకున్న సమన్వయ సిద్ధాంతి ముల్క్‌రాజ్ ఆనంద్. మిగతా భారతీయ ఇంగ్లీషు రచయతల్లాగా అతడేనాడు "అతీత రచయితగా" భావించలేదు. తనను తాను అభ్యుదయ రచయితగా మలచుకోవడంలోనే జీవనయాత్ర జైత్రయాత్రగా కొనసాగించాడు. వందేళ్ల చేరే సమయంలో కన్నుమూశాడు. ముల్క్‌రాజ్ ఆనంద్‌ను ఇందిరాగాంధీ "అంకుల్" అని పిలిచేది. ఎమర్జన్సీ విధించినప్పుడు దాన్ని ఎత్తి వేయాలని, ఎమర్జన్సీని ఎత్తివేయకుండా ఎన్నికలు నిర్వహించడం ఏ విధంగానూ ప్రజాస్వామ్యం కాజాలదని 'టైమ్స్ ఆఫ్ ఇండియా'లో ప్రధానికి బహిరంగలేఖ రాశాడు. మానవత్వాన్ని, సహోదరత్వాన్ని వరించిన ఆనంద్ బాబ్రిమసీదును హిందుమతోన్మాదులు కూల్చినప్పుడు దాన్ని తీవ్రంగా ఖండించాడు.

**జ్వాలాముఖి**

భారతదేశంలో 20వ శతాబ్దపు ప్రథమార్థంలో పుట్టి పెరిగిన మేధావులు రెండురకాల భావాలతో ఎక్కువగా ప్రభావితులయ్యారు. జాతీయోద్యమంలో ఒక సంస్కర్తగా ఎదిగి రాజకీయంగా పట్టు సాధించిన గాంధీజీ ఆదర్శవంతమైన జీవితం నాటి యువతరాన్ని చాలా ప్రభావితం చేసింది. అలాగే మానవ సమాజ స్వరూప స్వభావాల్ని సమూలంగా మార్చి వేసిన 'రష్యా విప్లవం', ఒక ప్రత్యామ్నాయ మానవీయ సమాజాన్ని 'సోషలిజం'గా ముందుకు తేవడం వల్ల చైతన్యం కల ప్రతివారూ మంత్ర ముగ్ధులయ్యారు.

ముల్క్‌రాజ్ ఆనంద్ జీవనయాత్ర అంతా గాంధేయం - సోషలిజాల మధ్య సాగింది. 1905 డిసెంబరు 12న పెషావర్‌లో జన్మించిన ఆయన విద్యాభ్యాసం పంజాబ్, లండన్ విశ్వ విద్యాలయాల్లో సాగింది. సుప్రసిద్ధ ఉర్దూకవి ఇక్బాల్ ఇచ్చిన ఆర్థిక సాయంతో, ప్రిన్సిపాల్ ప్రోత్సాహంతో సాహసించి లండన్ వెళ్లి 'ఆనర్స్' చదివాడు. తండ్రి నుండి చేతివృత్తి కళాకౌశలాన్ని, తల్లి ద్వారా పురాణగాథల్ని సంతరించుకున్న ఆనంద్ తన గురించి ఇలా రాసుకున్నాడు.. "పైపై చదువులు చదువుకున్న ఏ ప్రభావమూ లేని కొరతల యువకుడు." అలా చదివిన ఆనంద్‌కు లండన్‌లో ఉన్నత విద్య నభ్యసించడానికి మిత్రుల నుండి, పంజాబ్ విశ్వవిద్యాలయం నుండి ఆర్థికసాయం అందింది. ఆ విధంగా ముల్క్‌రాజ్ ఆనంద్ 1928లో లండన్ విశ్వ విద్యాలయం నుండి డాక్టరేట్ (పి. హెచ్. డి) పట్టా పొందాడు. అప్పటికి అతడి వయస్సు కేవలం 23 సంవత్సరాలు. అప్పుడే అతడికి మార్క్సిజం గురించి కొత్తవెలుగు తెలిసి వచ్చింది. జ్ఞానానికి గతితర్కం ఆధారమయింది. గాంధీ పరిచయం, స్పెయిన్ తిరుగు బాటులో సైద్ధాంతిక భాగస్వామ్యం అతడిలో చక్కని పునాదులు వేసి ప్రజాస్వామ్యం పట్ల అచంచల విశ్వాసం ఏర్పరచాయి. అందుకోసం సాగే పోరాటాల్ని సమర్థించే చైతన్యంలోకి వచ్చాడు. ప్రజాస్వామ్యం, సోషలిజం అతని జ్ఞాన చక్షువులయ్యాయి. "నా తొలినాటి రచనలు భావోద్వేగాల కారణంగా, చలనశక్తి కలవి - సహజమైనవి చెదురుమదురుగా ఉబికి వచ్చేవి" అని ఓ మారన్నాడు ఆనంద్.

మొదట భక్తి, సూఫీ ఉద్యమాల ప్రభావం పడి సాత్వికత వచ్చింది. ఆ తర్వాత కబీర్, నానకల ప్రభావంతో చింతన పెరిగింది. గాంధీజీ పరిచయంతో ఆదర్శాల సాహసం వికసించింది. మార్క్సిజం ద్వారా వర్గదృక్పథం బలపడింది. ఈ వైవిధ్యాల చింతన వల్ల సాంఘిక మార్పుకు ఏదో చేయాలనే ఉత్కంఠ పెరిగింది. నాటి సమకాలీన రచయితల సోషలిస్టుసమాజ అనుకూల ధోరణులు ఆనంద్‌ను నేల విడిచి సాము చేయకుండా కట్టిపడేశాయి. చుట్టూ వున్న రాజకీయ వాతావరణం, రష్యా విప్లవం సాధించిన విజయాలు ఆనంద్‌ను క్రమంగా ఆంగ్లంలో అభ్యుదయ రచయితగా తీర్చిదిద్దాయి. ఆర్యసమాజం ఆనాడు ఉత్తరభారతంలో హిందూ మతంలో సంస్కరణల్ని ప్రవేశపెట్టింది. కులాన్ని, విగ్రహారాధనని అది అనవసరాలుగా ప్రకటించింది. ఆర్య సమాజంలో కూడా భేషజాలు పెరగడం వల్ల ఆనంద్‌కు వైముఖ్యం పెరిగింది.

ఆ రోజుల్లో యువతరం చాలా సాహసవంతమైన ఆలోచనల వైపు మొగ్గడాన్ని చూసి తానూ తీసిపోకుండా తిరుగుబాటు భావాలవైపు, ముఖ్యంగా సంప్రదాయాలకు వ్యతిరేకంగా ఆలోచించసాగాడు. నాటి మేటి ఉర్దూకవి ఇక్బాల్ బృహదారణ్యకోపనిషత్ ప్రేరణతో 'అస్రార్-కి-ఖుది' (స్వార్థ రహస్యాలు) అనే దీర్ఘకవిత రాయడం ఆనంద్ జిజ్ఞాసను పెంచింది. చాలా చదవసాగాడు. సామాజిక సమస్యలకు పరిష్కారాన్ని వెదకసాగాడు. ఒక భక్తుడు ఒక యోగిని అడిగాడు.. "నేను నా జీవితంలో ఏం చేయాలి? నేనెవరిని? నేనెక్కడి నుండి వచ్చాను?" అని. "ఇలా రోజూ ఆలోచించు" అని యోగి చెప్పాడట. ఇదీ ఇక్బాల్ సుదీర్ఘ కవిత సారాంశం. ఇది ఆనంద్‌ను బాగా కదిలించింది. కర్తవ్య తత్పరత వైపు మళ్లాడు. చింతుకుడిగా కాక, కార్యకర్తగా మార్గాలు వెతికాడు. 'మార్గ్' అనే పత్రికను ప్రారంభించాడు.

పహలా పచ్చీసులోని ఆనంద్ ప్రణయం భయంకర అనుభవాన్ని మిగిల్చింది. ఒక ముస్లిం అమ్మాయిని గాఢంగా ప్రేమించాడు. కానీ తల్లిదండ్రులు ఆమెను బలవంతంగా ఒక రైల్వేగార్డుకు మూడవభార్యగా ఇచ్చి పెళ్లి చేశారు. ఆమె వద్ద ఆనంద్ రాసిన ప్రేమలేఖలు దొరకడం వల్ల భర్త ఆమెను చంపేశాడు. ఈ భయంకర భగ్నప్రేమ ఆనంద్‌ను చాలా విచలితుణ్ణి చేసింది. చిత్తశాంతికోసం అతడు అనిబిసెంట్‌ను ఆశ్రయించాడు. అనిబిసెంట్ ఉపన్యాసాలు అతడిని స్వాతంత్ర్యోద్యమం వైపు మళ్లించాయి. తిలక్, అరబిందో, గాంధీలతో జరిగిన పరిచయాలు, అధ్యయనాలు ఆనంద్‌ను క్రమంగా మార్చివేశాయి. కార్యవీరునిగా

మలచాయి. అనిబిసెంటును కాలేజీకి పిలిపించి ప్రసంగాలు చేయించినందుకు ప్రిన్సిపాల్‌ను బదిలీ చేసి శిక్షించింది ప్రభుత్వం. అందుకు నిరసనగా ఆనంద్ మిత్రులతో కలసి సమ్మె నిర్వహించాడు. ఫలితంగా కొన్ని నెలలపాటు ఆనంద్ జైల్లో మగ్గాల్సివచ్చింది. అయినా తొణకలేదు.

పరిశోధనలో నిమగ్నమై వున్న ఆనంద్ లండన్‌లో తోటి భార తీయుల ద్వారా చాలా అవమానాల పాలైనట్లు అతడి డైరీరాతలు తెలియ జేస్తాయి. లండన్‌లో వుండగా (1926) బాల్జాక్, టాల్‌స్టాయ్, గోర్కీ డికెన్స్, థామస్ హార్డీ, రవీంద్రనాథ్ టాగూర్ రచనలు చది వాడు. సాహిత్య దృక్పథానికి పదును పెట్టుకున్నాడు. ఆ విధంగా అతనికెంతో పేరు తెచ్చిన "అస్పృశ్యుడు" (ది అన్టచబుల్) నవలకు ప్రాణం పోశాడు. అలాంటి మానవీయ భారతీయ ఆంగ్లనవల నభూతో నభవిష్యతి. 'అన్‌టచబుల్' రాత ప్రతిని గాంధీజీకి పంపాడు. గాంధీజీ ఆ నవల చవిది చెప్పిన రచనా సూత్రాలు రచయిత లందరికీ (1927) గమనార్హాలు. ఆనంద్‌తో గాంధీజీ నవలా రచన గురించి ఇలా అన్నారు. 'గొప్ప పదాలు రాయడం వల్ల రచయిత పాఠకులకు దూరమవుతాడు. చాలా సరళమైన భాష రచనకు ప్రాణం. 'హరిజనులు' చెప్పుకునే బాధలగాథల గురించి వారు మాట్లాడుకునే పలుకుబడిలో చెబితేనే వారు ఇతరులకు తెలిసివస్తారు." గాంధీ సలహామేరకు ఆనంద్ సబర్మతి ఆశ్రమంలో వుండి 'అన్‌టచబుల్' నవలను తిరగరాశాడు. తిరగరాసిన నవలను గాంధీ ఆమోదించినా 19 మంది ముద్రాపకులు దాన్ని ముద్రించడానికి ఇష్టపడలేదు. కారణం కళాకృతికి సంబంధించిన అంశం కాదు. నాటి సమాజంలో పేరుకుని వున్న కుల వ్యత్యాసం. ముద్రాపకులు పై కులాలవారు కావడమే. ఆ తర్వాత ఇ.ఎం.ఫాస్టర్ (పేరు పద్ద ఆంగ్లకవి- రచయిత- విమర్శకుడు) ఆ నవలకు పీఠిక రాశాక అచ్చయింది. అది ప్రపంచవ్యాప్తంగా 20భాషల్లో అనువాదమయింది. రష్యాలో లక్షలాది ప్రతులు అమ్ముడయ్యాయి.

ఆనంద్ కథలు 8 సంపుటాలుగా వెలువడినా, అవి కూడా కళాఖండాలయినా, నవలాకారుడిగానే అతనికి గుర్తింపు లభించింది. సాంఘికాంశానికి ఆర్థికాంశం జోడించి రాసిన మరో ఆంగ్లనవల "కూలి" ప్రపంచఖ్యాతి నార్జించింది.

తన చిన్ననాటి మిత్రుడైన "బాఖా" జీవితాన్ని కళాత్మకం చేశాడు. రక్తసిక్తమైన

**'అన్‌టచబుల్' రాత ప్రతిని గాంధీజీకి పంపాడు. గాంధీజీ ఆ నవల చవిది చెప్పిన రచనా సూత్రాలు రచయిత లందరికీ (1927) గమనార్హాలు. ఆనంద్‌తో గాంధీజీ నవలా రచన గురించి ఇలా అన్నారు. 'గొప్ప పదాలు రాయడం వల్ల రచయిత పాఠకులకు దూరమవుతాడు. చాలా సరళమైన భాష రచనకు ప్రాణం. 'హరిజనులు' చెప్పుకునే బాధలగాథల గురించి వారు మాట్లాడుకునే పలుకుబడిలో చెబితేనే వారు ఇతరులకు తెలిసివస్తారు." గాంధీ సలహామేరకు ఆనంద్ సబర్మతి ఆశ్రమంలో వుండి 'అన్‌టచబుల్' నవలను తిరగరాశాడు.**

ఆనంద్‌ను ఇంటికి మోసుకువచ్చిన బాఖాను తన కొడుకును చెడగొడుతున్నవాడిగా నిందిస్తుంది తల్లి. ఆనంద్‌కు రాయి తగిలి గాయమవుతుంది. బాఖా ఇంట్లో పాకీపని చేసేవాడు. మానవీయ హృదయం కలవాడు. ఈ అంశాన్ని, చిన్ననాటి జ్ఞాపకాల్ని కళారూపంలోకి మార్చడంలో, ఒక శక్తివంతమైన సాంఘిక సమస్య (కుల వ్యత్యాసాన్ని)ను 'ఒకరోజు సంఘటన'గా ప్రాణం పోశాడు. కథానాయకుడి చుట్టూ అల్లిన కథ సహజంగా, ఆత్మీయంగా వుంది. ఒక పాకీవాడిని (అస్పృశ్యుని) ఆత్మీయంగా ఆలింగనం చేసుకోవడమే గాక మొత్తం భారతదేశాన్నే కౌగలించు కునేట్లు చేస్తుంది నవలా కథనం. "ఈ నవలావస్తువు నేరుగా గుండెలోకి చొచ్చుకుపోవడమే గాక మొత్తం వస్తువునే అది శుభ్ర పరచింది" అని పీఠిక రాసిన ఇ.ఎం.ఫాస్టర్ అంటారు.

సాంఘిక అంశాల్ని తీసుకుని నవలగా రూపొందించాలనే ఉత్కంఠ, ముల్క్‌రాజ్ ఆనంద్‌లో అనంతంగా వుండేది. గాంధీయుగపు ప్రభావం అది. ఉన్నవ లక్ష్మీ నారాయణ కూడా ఒక దశాబ్దం ముందు (1922) 'మాలపల్లి' నవల రాశాడు గాంధీయుగ ప్రభావంతో. అలాగే కార్మికవర్గ భవిష్యత్తు గురించి 'కూలీ' అనే నవల రాశాడు. మన్నూ అనే పేరుగల బాలుడు పౌష్టికాహార లోపం వల్ల, క్షయరోగం వల్ల మృత్యువాతబడిన సందర్భాన్ని గొప్పగా చిత్రించాడు ఆనంద్. ఈ నవలా కథనం, వర్గ సమాజాన్ని, దోపిడీతత్వాన్ని బహిర్గతం చేస్తూ కళ్లకు కట్టినట్టుగా చిత్రించింది. వైపరీత్యాల మధ్య గూడా ఆ అనాథబాలుడి జిజ్ఞాసను, సహృదయతను, స్నేహాన్ని, పరోపకారాన్ని కాపాడుతాడు.

"ది విలేజ్" (గ్రామం) నవల, తల్లి పొలాన్ని కాజేసిన భూకామందు దౌర్జన్యాన్ని చిత్రిస్తుంది. బ్రిటీష్‌వారి కాలంలో సాగే భూమి దోపిడికి అద్దం పడ్తుంది. "ది ఓల్డ్ ఉమన్ అండ్ ది కౌ" (వృద్ధుడు-ఆవు) నవల ఏ హక్కులూ లేని భారతీయ మహిళ పరాధీనతను తెలుపుతుంది. యాంత్రీకరణ వల్ల ఎలా ఒక కమ్మరి తన జీవనాధారాన్ని కోల్పోయాడో తెలియజేసే నవల 'ది బిగ్‌హార్ట్' (గొప్ప హృదయం). "అక్రాస్ ద బ్లాక్ వాటర్స్" అనేక భాషల్లోకి అనువాదమయింది. ఇందులో వ్యవసాయదారుడైన కథానాయకుడు సైన్యంలో చేరుతాడు. ఇతర్లకోసం యుద్ధం చేస్తాడు. వాడి బాధల్ని తెలిపే నవల ఇది. ఇంగ్లీషువారి ప్రయోజనాల కోసం భారతీయ సైనికులు యుద్ధాలలో పాల్గొని అనవసర త్యాగాలు చేసి చాలా నష్టపోయారు. ఈ అంశాన్ని హాస్యరస ప్రధానంగా చిత్రించాడు ఆనంద్.

"ది స్వోర్డ్ అండ్ సికిల్" (కత్తి - కొడవలి) నాడు కమ్యూనిస్టుగా వున్న (తర్వాత హ్యూమనిస్ట్‌గా మారిన) ఎం.ఎన్.రాయ్‌పై చిత్రితమైంది. కన్వర్ బ్రజేశ్ సింఫ్ (ఇతడే తర్వాత స్టాలిన్ కూతురు స్వెత్లానాను పెళ్లాడాడు.) ప్రారంభించిన రైతాంగపోరాటంలో చేరడానికి కథానాయకుడు విదేశీచదువులు మాని భారతదేశం తిరిగి వస్తాడు. ఇదే కథలాగా ఇగ్నాజియాసిలోన్ రాసిన (బ్రెడ్ అండ్ బటర్) నవల వచ్చింది. రెండూ బహుచర్చితా లయ్యాయి. మొదట ప్రపంచ యుద్ధం (1914-1918)లోని రక్తపాతం చాలామంది మేధావుల్ని కలచివేసింది. ఆనంద్ బిబిసిలో చేరి వార్తల్ని అందించేవాడు. ఆనంద్ వార్తా రచనల మీద సెన్సారింగ్ జరిగేది. స్వయానా నాటి ప్రధాని చర్చిల్ జోక్యం చేసుకుని "ఆనంద్ వార్తలు ఫాసిజానికి వ్యతిరేకంగా వున్నాయని" సెన్సారింగ్ ఎత్తి వేయించాడు.

భారతదేశం వచ్చాక ఆసియా రచయితల మహాసభకు కృషిచేశాడు. 120 మంది దాకా దేశదేశాల రచయితలు పాల్గొన్నారు. ప్రత్యర్థులు దీన్ని కమ్యూనిస్టు రచయితల సభగా ముద్రవేశారు. నెహ్రూ, రాధాకృష్ణ, రాజాజీ లాంటి జాతీయవాదులు కూడా పాల్గొనడం వల్ల ఆ అవప్రథ తప్పిపోయింది. అభ్యుదయ రచయితల సంఘం (1935) నిర్మాణంలో ఆనంద్ పాత్ర ముఖ్యమైనది. లండన్ రచయితల మ్యానిఫెస్టోను రూపొందించిన వారిలో

# స్వప్న ముద్రిక

**జనజ్వాల**

ఒక రాత్రి హిమాలయ పర్వతం కరిగి
నా హృదయం ద్వారాల వెంట సంద్రమై పారుతుంది

మహేశ్వరుని నుదిటి వీభూది పొరలుగా రాలుతూ
నిద్రిస్తున్న సూర్యున్ని ఎదపై మందరమై
వికసిస్తుంది
జలదరించిన ఒక పలుకు ఛీకరాకేకేస్తుంది

ఒక రాత్రి రెప్పల మధ్య
రెండు సర్పాలు ఒక చిన్నారి శిశువుని పెనవేసుకొని
బుసలుకొడుతున్నాయి

ఒక అశ్వం రెండు కాళ్ళు పైకెత్తి పరుగెత్తటానికి
ప్రయత్నిస్తుంది
మరో ఒక అశ్వం కూర్చొని నిదురిస్తుంది
(మీకు తెలుసు అశ్వం ఎప్పటికి కూర్చోదని అది ఎప్పుడూ నిలబడి
ఉంటూందని)
ఒక స్త్రీ దుఃఖిస్తూంది
భర్త నగ్నత్వాన్ని చూసి
ఆమె సంతానం సంతోషిస్తుంది
ఆమె దుఃఖాన్ని చూసి

పంచభూతాలకతీతంగా మాట్లాడే
ఒక స్త్రీ పురుషుడు అదృశ్యమైనారు
వారి జాడకోసం ఆరా తీస్తున్నాడు నమ్మకమనే భగవంతుడు
.... .... .... .... ....
.... .... .... .... ....
ఆకలి ఎంత సహజమో, మరణమంత నిజం
రెప్పల మధ్య ఒకటే మంట
ఒక రాత్రో... ఒక పగలో...
ఈ... నా
స్వప్నం
ద్రోణుని కుట్రను ఛేదిస్తున్న
ఏకలవ్యుని బొటనవ్రేలు గోటి ప్రశ్నై జ్వలిస్తుంది
కృష్ణుని మారువేషం మర్మని పసిగట్టిన కర్ణుని మందహాసమౌతుంది
మృత్యువును జయించిన అమరుని శ్వాసమీద సంతకం చేసి
మళ్ళీ... మహాసంగ్రామానికి... జమ్మి చెట్టు మీది ఆయుధాన్ని
స్వీకరిస్తుంది
ఆయుధం ప్రతిరూపంగా అక్షరమౌతుంది
అవును... అక్షరం నా స్వప్న ముద్రిక

---

అగ్రగణ్యుడు ఆయన. 1970 నవంబరులో జరిగిన ఆఫ్రోఏసియన్ సభలకు జనచైనాను పిలవనందుకు నిరసన తెలుపుతూ నేను, ఎం.టి ఖాన్, శ్రీ శ్రీ ఢిల్లీ వెళ్లి సభలను బహిష్కరించమని కరపత్రాలు పంచాం. అప్పుడు ప్రత్యక్షంగా నేను ఆనంద్‌ను చూశాను. చాలా నెమ్మదస్తుడు. సంస్కారి. అక్కడ మేం అరెస్టు కాకుండా చూసినవారిలో ఆనంద్ అగ్రగణ్యుడు. 1988నాటి కేంద్ర సాహిత్య అకాడమీ ఢిల్లీ సభల్లో, సెమినార్లో పాల్గొన్నప్పుడు వారితో కలసి సాహిత్యాంశాలు చర్చించాను.

ఆ తర్వాత ఆనంద్ సాంఘిక విషయాల మీదే కేంద్రీకరించి రచనలు చేశాడు. భారతీయ సంస్థానాధిపతుల గురించి 'ప్రైవేటు లైఫ్ అఫ్ ఇండియా ప్రిన్స్' అనే నవల రాశాడు. కౌన్జ్ అనే పరిశోధకుడు అతని నవలల్ని అధ్యయనం చేసి చెప్పిన మాటలు గమనార్హం.

"అతడి నవలలు (అన్‌టచబుల్, కూలి) గొప్ప చారిత్రక సందర్భం కలవి. అదే సమయంలో అవి గొప్ప కళాఖంధాలు కూడా. రష్యా రచయిత దాస్టోవస్కీ (క్రైమ్ అండ్ పనిష్‌మెంట్ - నేరము శిక్ష) నవల గొప్ప పరిమాణంలో ఆవిర్భవించినట్టు వుంటుంది ఆనంద్ నవల."

ఆనంద్ రచించిన "సెవెన్ సమ్మర్స్ అండ్ మార్నింగ్ ఫేస్" (ఏడు వేసవులు-ఉదయముఖం) అనే నవలను టాల్‌స్టాయ్ రాసిన "కన్ఫెషన్ ఆఫ్ ఎ లవర్" నవలతో పోల్చి సమీక్షలు రాశారు విమర్శకులు. ఈ నవలకు ప్రతిష్టాత్మక ఇ.ఎం.ఫాస్టర్ అవార్డు, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు లభించాయి. బబుల్ (బుడగ) అనే నవల భారతీయ కొత్తతరాల ఆకాంక్షలకు అద్దం పడుతుంది.

ఆనంద్‌కు పద్మభూషణ్ గౌరవం దక్కింది. సాహిత్య లలితకళా అకాడమీల్లో విశిష్ట సభ్యత్వాలు (ఫెలోషిప్స్) లభించాయి. అంతర్జాతీయ శాంతి బహుమతి కూడా లభించింది. ఈ బహుమతులేవీ అతడి జిజ్ఞాసకు, చైతన్యానికి, గాంధేయ జీవనసరళికి ఆశావహమైన రచనా ప్రపంచానికి సరితూగేవి కావు. కేంద్ర సాహిత్య అకాడమీ ముల్క్‌రాజ్ ఆనంద్‌కు "ఫెలోషిప్" ప్రదానం చేస్తున్న సందర్భంలో అతడు అన్న మాటలు అక్షర సత్యాలు. కార్యాచరణలో బతికి వుండటం, గాంధీ చెప్పినట్టు కార్యాచరణలో సాగడం తోటి మానవుడితో మానవుడుగా వుండే ధైర్యాన్ని సంస్కారాన్ని కలిగి వుండడం లాంటిది. భూమ్మీది సమస్త పౌరులతో ఆత్మీయంగా నిమగ్నమై వుండటం లాంటిది. జవహర్‌లాల్ నెహ్రూ చెప్పినట్లు, ఓటముల నాయకత్వాన్ని కూడా స్వీకరించడం లాంటిది. ఓటమి అనేది పోరాటంలో పట్టుదలను నేర్పుతుంది. మానవోద్వేగాలను కాపాడే పుష్టినిస్తుంది. ఆత్మీయ అనురాగాన్ని పెంపొందిస్తుంది. అడ్డంకులున్నా అంకితభావాన్ని భక్తి ప్రపత్తినిస్తుంది. ఈ నాటి సందర్భంలో కవిత్వం గొప్ప ధైర్యంగా వుండాలి."

గాంధీని, మార్క్సును ఆవహించు కున్న సమన్వయ సిద్ధాంతి ముల్క్‌రాజ్ ఆనంద్. మిగతా భారతీయ ఇంగ్లీషు రచయితల్లాగా అతడేనాడు "అతీత రచయితగా" భావించలేదు. తనను తాను అభ్యుదయ రచయితగా మలచుకోవడంలోనే జీవనయాత్ర జైత్రయాత్రగా కొనసాగించాడు. వందేళ్లు చేరే సమయంలో కన్నుమూశాడు. ముల్క్‌రాజ్ ఆనంద్‌ను ఇందిరాగాంధీ "అంకుల్" అని పిలిచేది. ఎమర్జన్సీ విధించినప్పుడు దాన్ని ఎత్తి వేయాలని, ఎమర్జన్సీని ఎత్తివేయకుండా ఎన్నికలు నిర్వహించడం ఏ విధంగానూ ప్రజాస్వామ్యం కాజాలదని 'టైమ్స్ ఆఫ్ ఇండియా'లో ప్రధానికి బహిరంగలేఖ రాశాడు. మానవత్వాన్ని, సహోదరత్వాన్ని వరించిన ఆనంద్ బాబ్రిమసీదును హిందుమతోన్మాదులు కూల్చినప్పుడు దాన్ని తీవ్రంగా ఖండించాడు. ఒకడు ఎన్ని సంవత్సరాలు జీవించాడని కాదు. ఎన్ని గ్రంథాలు రాశాడని కాదు, జీవించిన కాలం, రాసిన రచన, తోటి మానవుల్ని ఏ మేరకు పట్టించుకున్నాయన్నదే మానవీయ గీటు రాయి. ముల్క్‌రాజ్ ఆనంద్ గాంధేయం నుండి శీలాన్ని, మార్క్సిజం నుండి జ్ఞానాన్ని సంతరించుకున్న స్థితప్రజ్ఞుడు. స్థితప్రజ్ఞులకు మిగిలేది చరిత్ర. చరిత్రలో చరిత్ర. ముల్క్‌రాజ్ ఆనంద్ అక్షరానికి మరణం లేదు.

**(ప్రజాశక్తి సౌజన్యంతో)**

# పత్రికలు, ప్రసార సాధనాలు - సాహిత్యం

స్థూలమైన అర్థంలో మీడియా, సాహిత్యం రెండూ ఒకే కోవకు చెందుతాయి. ఇవి ప్రజలను ప్రభావితం చేసే మాధ్యమాలు. ప్రజలకు విషయాలు తెలియజెప్పి వారి చైతన్యాన్ని తీర్చిదిద్దే సాధనాలు. అందుకే పత్రికారచన హడావుడి సాహిత్యం అన్నారు. తేడా ఏమిటంటే సాహిత్యం సృజనాత్మక మైంది: మౌలికంగా మీడియా వున్నదాన్ని నివేదించేది. ఈ వివరణకూ ఒక మినహాయింపు వుంది. సాహిత్యం సృజనాత్మకమైనా మంచి సాహిత్యం ఎప్పుడూ సమాజ వాస్తవికతపైనే ఆధారపడివుంటుంది. అలాగే సమాచార నివేదన ,వ్యాఖ్యానం వాస్తవాలకు సంబంధించినవైనా సృజనాత్మకత కూడా వుంటేనే పాఠకులపై ముద్ర వేయగలుగుతాయి. అందుకే ఇవి రెండూ ఒకదాని లక్షణాలు ఒకటి కొంతవరకైనా కలిగివుంటాయి.

తెలకపల్లి రవి

పత్రికలు, ప్రసార సాధనాలు లేదా మీడియాకు సాహిత్యానికి మధ్య సంబంధం ఏమిటి?

రోజు వారీ సమాచారం అందించే మీడియాకు సాహిత్యానికి మధ్య సంబంధమంటూ వుందా? ఉంటే వివిధ దశల్లో అది ఎలాటి మార్పులకు లోనైంది? అందుకు కారణాలేమిటి?

సాహిత్య వ్యాప్తిలో లేదా అవ్యాప్తిలో మీడియాకు వుండే పాత్ర ఏమిటి?

సాహిత్య స్వభావాన్ని మీడియా ఏ మేరకు ప్రభావితం చేయగలుగుతుంది?

సాంకేతిక సామాజిక మార్పులకు దీనికి మధ్య ఏదైనా సంబంధం వుందా?

మీడియాలోని వివిధ విభాగాలు- పత్రికలు, పుస్తకాలు, రేడియో టీవీలు, సినిమా వగైరాలు ఈ విషయంలో ఎలాటి పాత్ర నిర్వహిస్తున్నాయి?

ఇవి, ఇంకా ఇలాటి అనేక ప్రశ్నలు ఈ అంశంలో ఇమిడివున్నాయి. క్లుప్తంగానైనా వీటికి జవాబు చెప్పుకుని, ఆ పైన వాటి పరిణామక్రమాన్ని విశ్లేషించుకోవచ్చు.

### అవినాభావ సంబంధం

మీడియాకు సాహిత్యానికి సంబంధం అనే సమస్యను పైపైన చూస్తే సాహిత్య సంబంధమైన అంశాల ప్రచురణ లేదా ఆ వార్తల ప్రచారం అనే భావం కలగవచ్చు. అది తప్పు కాదు కూడా. కాని వాస్తవంలో ఈ సంబంధం అంతకంటే విశాలమైనది. విస్తృతమైనది.

స్థూలమైన అర్థంలో మీడియా సాహిత్యం రెండూ ఒకే కోవకు చెందుతాయి. ఇవి ప్రజలను ప్రభావితం చేసే మాధ్యమాలు. ప్రజలకు విషయాలు తెలియజెప్పి వారి చైతన్యాన్ని తీర్చిదిద్దే సాధనాలు. అందుకే పత్రికారచన హడావుడి సాహిత్యం అన్నారు. తేడా ఏమిటంటే సాహిత్యం సృజనాత్మక మైంది: మౌలికంగా మీడియా వున్నదాన్ని నివేదించేది. ఈ వివరణకూ ఒక మినహాయింపు వుంది. సాహిత్యం సృజనాత్మకమైనా మంచి సాహిత్యం ఎప్పుడూ సమాజ వాస్తవికతపైనే ఆధారపడివుంటుంది. అలాగే సమాచార నివేదన, వ్యాఖ్యానం వాస్తవాలకు సంబంధించినవైనా సృజనాత్మకత కూడా వుంటేనే పాఠకులపై ముద్ర వేయగలుగుతాయి. అందుకే ఇవి రెండూ ఒకదాని లక్షణాలు ఒకటి కొంతవరకైనా కలిగివుంటాయి. అన్నిటినీ మించి రెంటికీ వాహకం భాషనే. ఈ కారణం చేతనే తొలిదశలో రచయితలు పండితులే పత్రికలు స్థాపించడం చూస్తాం. అంతేగాక మొదట్లో గణితమైనా, విజ్ఞాన శాస్త్రమైనా పద్యరూపంలోనే రాయడం వల్ల అనివార్యంగా సాహిత్య స్పృహ అవసరమయ్యేది.

నేటి అర్థంలో చూస్తే ఆధునిక కాలంలో మీడియా పరిధిలోకి రాని విషయమేదీ వుండటం లేదు. దాన్ని దినీ విజ్ఞాన సర్వస్వమంటున్నారు. జీవితంలోని సమస్త పార్శ్వాలను మీడియా తనదైన పద్ధతిలో నివేదిస్తుంది, వ్యాఖ్యానిస్తుంది, భవిష్యత్‌ను గురించిన భావనలను కలిగిస్తుంది. ఎలక్ట్రానిక్ మీడియా వచ్చాక దాని ధాటిని తట్టుకునేందుకు మన పత్రికలు ప్యాకేజి జర్నలిజం అన్నదాన్ని ప్రవేశపెట్టాయి. ఆరోగ్యం నుంచి ఆర్థిక ఆధ్యాత్మికాల వరకూ ఏ అంశమూ మినహాయించబడటం లేదు. ఆదికాలం నుంచి కూడా మిగిలిన ఇతర రంగాలలాగే సాహిత్యాన్ని జనానికి చేర్చే పని మీడియానే నిర్వహిస్తోంది. పత్రికలు ఇంతగా పెరగని రోజుల్లోనూ రాజులు వేసిన శాసనాలు కూడా సాహిత్యభాషలో వుండటం చూస్తాం. ఇక ఇప్పుడు ఇంత విస్తృతమైన మీడియా పరిధిలో సాహిత్యం రాకపోవడం వూహకందని విషయం.

అదే సమయంలో ఈ విస్తృతి మీడియాకు కొన్ని లక్షణాలు కూడా సంతరింపచేస్తుంది. మీడియా పరిణామ క్రమాన్ని బట్టి సాహిత్యానికి దానికి మధ్యన వుండే సంబంధాలు నిర్వచించబడుతుంటాయి. ఇవన్నీ గమనంలో వుంచుకొని మీడియా సాహిత్యం అనే అంశాన్ని చర్చించాల్సి వుంటుంది.

### తొలిదశ

తొలిదశలో తెలుగు పత్రికలు స్థాపించిన వారందరూ సాహిత్య ప్రముఖులే. అలాటి వారిలో అగ్రగణ్యులు కందుకూరి వీరేశలింగం. ఆయన పెట్టిన పత్రిక వివేకవర్ధని పేరులోనే దాని లక్ష్యం కూడా కనిపిస్తుంది. అదే విధంగా స్త్రీల కోసం ఆయన ప్రారంభించిన సతీహిత బోధిని వగైరాలన్ని. సామాజిక విషయాలను సామాన్య జనానికి తెలిసే విధంగా ప్రహసనాలు, పద్యాలు, కథల రూపంలో అందించేవారు. భాష విషయమై వాదోప వాదాలకు కూడా ఈ పత్రికలే సాధనాలుగా వుండేవి. వీరేశలింగం, కొక్కొండ వెంకటరత్నం పంతులు పరస్పరం పోటీ పడి నడుపుకున్న పత్రికలలో పురోగామి తిరోగామి వాదనలు వుండేవి. చిలకమర్తి లక్ష్మీనరసింహం రామచంద్ర విజయం కూడా చింతామణి పత్రిక పోటీలలో గెలుపొందిందే కావటం గమనార్హం.

తెలుగులో మొదట నవలలు, తర్వాత కథలు వెలువడ్డాయి. ప్రముఖమైన కథ- గురజాడ అప్పారావు 'దిద్దుబాటు' తెలుగు కవిత్వాన్ని మలుపు తిప్పిన ముత్యాల సరాలు కూడా మొదట 'ఆంధ్ర భారతి' పత్రికలలోనే అచ్చయ్యాయి. గురజాడ, పత్రికల ప్రాధాన్యతను బాగా గుర్తించిన వారు. ఆయన, గిడుగు

వ్యవహార భాషకోసం సాగించిన పోరాటానికి కూడా పత్రికలు సాధనాలైనాయి. కన్యాశుల్కంతో సహా ఆయన రచనలపై సమీక్షలు, వాటి ప్రదర్శనల తాలూకూ రిపోర్టులు కూడా మనం నాటి పత్రికల్లో చూస్తాం. కన్యాశుల్కం పై జరిగినంత చర్చ మరే రచనపైనా రాలేదు. గురజాడకు కూడా పత్రికా స్థాపన పట్ల చాలా ఆసక్తి వుండేది.

భాష, సంఘ సంస్కరణ ఉద్యమాల తర్వాత స్వాతంత్ర్య పోరాట కాలంలోనూ పత్రికలు ప్రధానంగా అందుకు దోహదపడ్డాయి. అలాటి రచనలు ప్రచురించాయి. రాష్ట్రంలో తొలి రాజకీయ ఖైదీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు జైలు శిక్షకు కారణమైంది, స్వరాజ్యపత్రికలో ఆయన "అరరే ఫరంగీ క్రూర వ్యాఘ్రమా' అంటూ తెల్లదొరలను నిలదీసిన సంపాదకీయం కావడం యాధృచ్ఛికం కాదు. ఆంధ్ర పత్రిక ప్రారంభానికి ముందు సాహిత్య సంబంధమైన వార్షిక సంచికగానే వస్తుండేది. దాని రచయితల జాబితా చూస్తే సుప్రసిద్ధ తెలుగు రచయితల పట్టికలా వుంటుంది. కాశీనాధుని నాగేశ్వరరావు, ఆయన ఆంధ్ర పత్రిక, ప్రెస్సూ కవులు రచయితల పాలిట కామధేనువుల్లా వుండేవి. ఆయన స్వయంగా సాహిత్య విశ్లేషణ చేసేవారు. తర్వాత కాలంలో ఆ పనికోసం ప్రత్యేకంగా భారతి పత్రిక స్థాపించి, తెలుగు సాహిత్య చరిత్రలో దానికంటూ ఒక ప్రత్యేక స్థానం కల్పించగలిగారు.

సాహిత్యానికి సమాజానికి సమాచార సాధనాలకు మధ్యన గల సంబంధాన్ని ఈ ఉదాహరణలు చెబుతాయి. దేశాన్ని ఉర్రూతలూపిన శ్రీశ్రీ గేయాలు చిన్న పత్రికలలో తొలుత వెలువడ్డాయి. ఆయన దేశ చరిత్రలు ఆంధ్రశిల్పిలో ఒక నాటకంలో భాగంగా వచ్చింది. ఆ విధంగా అభ్యుదయ యుగావిర్భావం లోనూ పత్రికల పాత్ర వుంది. వామపక్ష పత్రికలు ప్రారంభమవడంతో సామ్యవాద భావజాలాన్ని ప్రబోధించే సాహిత్య ప్రచురణకు అవకాశాలు ఎంతగానో విస్తరించాయి.

ఆ దశలోనే శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి 'ప్రబుద్ధాంధ్ర' పాటిబండ్ల మాధవశర్మ 'వీణ' వంటి పత్రికలు నడిపారు. చలం మ్యూజింగ్స్ వీణలోనే వచ్చాయి. 20 వ దశకంలో తెలుగు సాహిత్యంలో విశ్వనాధ, చలం, కొడవటిగంటి, కవిరాజుత్రిపురనేని ప్రభృతులెందరో తమ తమ కోణాల నుంచి అక్షరాస్త్రాలు సంధించారు. సహజంగానే ఇందుకు పత్రికలు వేదికలైనాయి. తర్వాత కాలంలో సాహిత్య చర్చల్లో,


★

**వీటిలో కొన్ని సినిమాలుగా వచ్చి ఘన విజయాలు సాధించాయి. మొత్తంపైన నవ స్వతంత్ర భారతంలో మధ్యతరగతి మహిళల ఆశలు, ఆకాంక్షలు తెలుసుకోవడానికి ఈ సినిమాలు, రచనలు కూడా దోహదపడతాయి. మీడియాలోని మూడు రూపాలు- రచనలు, పత్రికలు, సినిమా ల మధ్య సంబంధాన్ని ఈ విధంగా చూడగలుగుతాము. ఇది అరవయ్యవ దశకం నాటి మాట. ఇదే స్థితి డెబ్భయ్యవ దశకం ప్రథమార్థమంతా సాగింది. అప్పటికి మన సమాజంలో ఇంకా పాలకవర్గాలు భ్రమలు కలిగించే స్థితి వుండింది.**

★


అధ్యయనంలో మార్గదర్శకాలుగా, అనివార్యమైన భాగాలుగా పరిగణించబడిన అంశాలన్ని అప్పట్లో పత్రికలలో వెలువడినవే. తాపీ ధర్మారావు జనవాణి పత్రిక ద్వారా ఇతర సేవలతో పాటు పత్రికాభాషను సులభతరం చేసి ఆ విధంగా తెలుగుభాషను సుసంపన్నం చేశారు. వీటితో పాటే పరిషత్ పత్రిక, శివశంకర శాస్త్రి సాహితి, కొంపెల్ల జనార్ధనరావు ఉదయిని, ముద్దుకృష్ణ జ్వాల, సురవరం ప్రతాపరెడ్డి తెలుగు తదితర పత్రికలన్నీ తెలుగుభాషకు సాహిత్యానికి ఎనలేని సేవ చేశాయి.

## స్వాతంత్రం తర్వాత

స్వాతంత్ర్యానంతర కాలంలోనూ ఈ వరవడి కొనసాగింది. అసలు ఆ రోజుల్లో ఆదివారం అనుబంధాలు సాహిత్య ప్రధానమైనవిగా పరిగణించేవారు. కళాసాహిత్యానుబంధం అని వుండేది. ప్రముఖ సాహిత్యవేత్తలు ఆ ఆదివారం అనుబంధాల్లో రచనలు చేస్తుండేవారు. పరిశోధనాత్మక వ్యాసాలు వుండేవి. (హిందూతో సహా ఇంగ్లీషు పత్రికలు ఇప్పటికీ నెలలో ఒకరోజు సాహిత్యానుబంధాలను ప్రచురించడం పరిపాటి) వామపక్షవాదులు నడిపిన నవశక్తి, ప్రజాశక్తి వంటి పత్రికలు అభ్యుదయ కవిత్వాన్ని, ఇతర రచనలను ఎంతగానో ప్రోత్సహించడమే కాదు, గురజాడ గిడుగు కందుకూరి తెచ్చిన సాంస్కృతిక పునర్వికాస భావనను మరింత ముందుకు కొనిపోయాయి. 'పెద్దబాలశిక్ష ఫెయిల్, ప్రజాశక్తి ప్యాస్' అనే విధంగా చాందసులు ఎగతాళిచేసినా వాస్తవానికి అవి అమూల్యమైన ప్రజాకవిత్వాన్ని సాహిత్యాన్ని సృష్టించాయి. ఆ రోజుల్లోనే కొకు, సెట్టి ఈశ్వరరావు, చాసో తదితరుల రచనలతో 'ప్రజాశక్తికథలు' రెండు సంపుటాలుగా వెలువడ్డాయి. అనేక మంచి రచనల అనువాదానికి కూడా దోహదం చేశాయి. అప్పుడే చక్రపాణి 'దేవదాసు' నవలానువాదం కూడా ఆంధ్రప్రభలో వచ్చింది. ఇప్పుడు ఇంటర్నెట్ యుగంలోకన్నా ఎక్కువగా ఆ రోజులలోనే అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన రచనలు తెలుగులోకి అనువదించబడటం చూస్తాం. అభిప్రాయాలలో తరతమ తేడాలున్నా ఆంధ్ర సారస్వత పరిషత్పత్రిక, సాహితి. శారద, గృహలక్ష్మి వంటి పత్రికలు సాహిత్య వ్యాప్తిలోసాటిలేని పాత్ర నిర్వహించాయి. ఎందరో రచయితలను, ఎన్నో గొప్ప రచనలను అందించడానికి దోహదపడ్డాయి. కొడవటిగంటి సంపాదకత్వంలో 'యువ' ఉత్తమ సాహిత్యానికి చిరునామా అయింది. రావి శాస్త్రి, బీనాదేవి, దాశరథి రంగాచార్య, మహీధర వంటి వారి రచనలు పత్రికలలో ధారావాహికలుగానే మొదట వెలువడ్డాయి. అభ్యుదయ పత్రిక కూడా సాహిత్య చర్చకు సహకరించింది. కమ్యూనిస్టు పార్టీ నడిపిన సిద్ధాంత పత్రిక 'సందేశం'లోనూ సాహిత్య సంబంధమైన అనేక విశ్లేషణలు చూస్తాం.

## రచయిత్రుల తీరు

దినపత్రికలు అదే పేరుతో ప్రారంభించిన సచిత్ర వారపత్రికలు వారం వారం ధారావాహికలను, కథలను ప్రచురించుతూ పఠనాసక్తిని ఎంతగానో పెంచాయి. ఆ క్రమంలో పాఠకుల సంఖ్యను కూడా పెంచాయి. ఈ క్రమంలో అరవయ్యవ దశకంలో రచయిత్రుల నవలలు అనూహ్యమైన స్పందన తీసుకొచ్చాయి. అప్పుడప్పుడే విద్యాధికులవుతున్న మహిళలు వాటిని విశేషంగా ఆదరించడం సామాజిక ప్రాధాన్యత గల విషయం. సామాజిక స్పృహ కోణం నుంచి వాటిని అంత ప్రముఖంగా పరిగణించలేకపోయినా ఈ కోణంలో మాత్రం అవి గొప్ప పాత్ర నిర్వహించాయని చెప్పాలి. వీటిలో కొన్ని సినిమాలుగా వచ్చి ఘన విజయాలు సాధించాయి. మొత్తంపైన నవ స్వతంత్ర భారతంలో మధ్యతరగతి మహిళల ఆశలు, ఆకాంక్షలు తెలుసుకోవడానికి ఈ సినిమాలు, రచనలు కూడా దోహదపడతాయి. మీడియాలోని మూడు రూపాలు- రచనలు, పత్రికలు, సినిమా ల మధ్య సంబంధాన్ని ఈ విధంగా చూడగలుగుతాము. ఇది అరవయ్యవ దశకం నాటి మాట. ఇదే స్థితి డెబ్భయ్యవ

దశకం ప్రథమార్థమంతా సాగింది. అప్పటికి మన సమాజంలో ఇంకా పాలకవర్గాలు భ్రమలు కలిగించే స్థితి వుండింది. అది అప్పుడప్పుడే కదలిపోతున్నది. నెహ్రూ తర్వాత ఇందిరా గాంధీలు మహానాయకులుగా మన్ననలు పొందుతున్న స్థితి ఇంకా పోలేదు కాని 60 వ దశకం మధ్యకాలానికే సంక్షోభాలు తీవ్రమవుతున్నాయి. ఇది సాహిత్యంలో ప్రతిబింబించింది. దిగంబర కవిత్వం వచ్చింది. తర్వాత శ్రీశ్రీ షష్టిపూర్తితో విరసం పుట్టింది. ఈ పరిణామక్రమాన్ని సంచలనశీలంగా మలచడంలో నాటి పత్రికలు పాత్ర నిర్వహించాయి. ఈ కాలంలో సాహిత్యమే ప్రధానాంశంగా గల పత్రికలు రావడం, పోవడం జరిగింది. అందులో రాచమల్లు రామచంద్రారెడ్డి సంవేదన చెప్పుకోదగింది. వరంగల్‌లో వరవరరావు తదితర సాహితీ మిత్రులు స్థాపించిన సృజన మారుతున్న పరిస్థితులకు భావ ఘర్షణలకు అద్దం పట్టే సాహిత్య వేదికగా వెలుగొందింది.

అయినా డెబ్బయ్యవ దశకం ప్రథమార్థం వరకూ ఇంకా చెప్పాలంటే ఇందిరాగాంధీ ఎమర్జన్సీ వరకూ పత్రికలలో కాల్పనిక సాహిత్యం ప్రముఖస్థానంలోనే కొనసాగింది. అప్పుడే జీవన తరంగాలు, ప్రేమనగర్, విజేత వంటి నవలలు సినిమాలుగా వచ్చి పెద్ద విజయాలు సాధించాయి. ఆంధ్రజ్యోతి , ఆంధ్రప్రభ, విశాలాంధ్రల ఆదివారం అనుబంధాలలోనూ, వార పత్రికలలోనూ సాహిత్యపరమైన సృజన చర్చ జోరుగా సాగుతూ వచ్చాయి. అప్పుడే అభివృద్ధి చెందుతున్న ఈనాడు కొత్తపాళీ పేరుతో రోజుకో కవిత ప్రచురిస్తూ కొంతకాలం కవులను ఉత్సాహపరచింది. దాదాపు అప్పుడే ఆంధ్రజ్యోతి దినపత్రిక, వారపత్రిక కూడా సాహిత్య చర్చను వేడెక్కించే అనేక అంశాలు ప్రచురించాయి.

పురాణం సుబ్రహ్మణ్య శర్మ శ్రీశ్రీ కవిత్వంపై మిరియాల రామకృష్ణ థీసిస్‌ను ఎండగడుతూ రాసిన ధారావాహిక, గురజాడ రచనలకు అవసరాల అనువాదాలపై ధ్వజమెత్తడం, రంగనాయకమ్మ రామాయణ విషవృక్షంపై చర్చ, ప్రజాతంత్రలో శ్రీశ్రీ ఆత్మకథా ప్రచురణ, సంబంధిత వాదోపవాదాలు ఈ కోవలో చెప్పుకోదగినవి. దేవీప్రియ సమాజానందస్వామి పేరుతో ప్రజాతంత్రలోనే తన రన్నింగ్ కామెంట్రీ తరహా కవితలు రాసేవాడు. నెల్లూరు పత్రిక జమీన్‌రైతులో కూడా ప్రతివారం శివారెడ్డి పద్యాలుండేవి. 1975లో ప్రపంచ తెలుగు మహాసభలకు శ్రీశ్రీ విశ్వనాథ సత్యనారాయణ హాజరవడంపై సాగిన


**పురాణం సుబ్రహ్మణ్య శర్మ శ్రీశ్రీ కవిత్వంపై మిరియాల రామకృష్ణ థీసిస్‌ను ఎండగడుతూ రాసిన దారావాహిక, గురజాడ రచనలను అవసరాల అనువాదాలపై ధ్వజమెత్తడం, రంగనాయకమ్మ రామాయణ విషవృక్షంపై చర్చ, ప్రజాతంత్రలో శ్రీశ్రీ ఆత్మకథా ప్రచురణ సంబంధిత వాదోపవాదాలు ఈ కోవలో చెప్పుకోదగినవి. దేవీప్రియ సమాజానందస్వామి పేరుతో ప్రజాతంత్రలోనే తన రన్నింగ్ కామెంట్రీ తరహా కవితలు రాసేవాడు.**


తర్జనభర్జనలలో పత్రికల పాత్ర చాలా వుంది. శ్రీశ్రీ వంటి పేరున్న కవులు రచయితలకు పత్రికలు ఎప్పుడూ పెద్ద పీట వేస్తూనే వుండేవి. విరసం నా శాశ్వత చిరునామా అనిగాని, అరసం ప్రజానాట్య మండలితో కలసి చేసిందాంట్లో శతాంశమైనా విరసం జననాట్యమండలితో కలసి చేయలేకపోయిందని గాని శ్రీశ్రీ చేసిన వ్యాఖ్యలు పత్రికల ద్వారానే తెలిశాయి.

**ఎమర్జెన్సీ తర్వాత**

1977లో ఎమర్జన్సీ ఓటమి జనతా ప్రభుత్వ ఏర్పాటు మన మీడియాలో సరికొత్త విస్తరణకు దారితీసింది. రాజకీయమార్పు సమాజంలో ఒక ప్రజాస్వామిక స్పృహకు కదలికకు కారణమైంది. పత్రికలు కేవలం కొంతమంది పండితులు రాజకీయ వేత్తలకే పరిమితమనే వాతావరణం మారింది. రవాణా సదుపాయాలు కూడా పెరగడంతో పల్లెపల్లెకూ చేరడం మొదలైంది. ఈ విధంగా పత్రికలు అంతకు ముందు లేని ఒక విశాలమైన మార్కెట్‌ను సంపాదించుకున్నాయి. మరో రకంగా చెప్పాలంటే వాటి వాణిజ్య శక్తి పెరిగింది. తత్ఫలితంగా వచ్చిన ఇతర ప్రభావాలను పక్కన పెడితే సాహిత్యంలో ఇది కొన్ని అనారోగ్యకరమైన ధోరణులకు దారి తీసింది. కొత్తగా లభించిన విస్తరణను సొమ్ముచేసుకోవాలనే తాపత్రయంలో కొన్ని పత్రికలు క్షుద్రసాహిత్యాన్ని ప్రోత్సహించడం మొదలెట్టాయి. కందుకూరి వీరేశలింగం దయ్యాలు భూతాలు లేవని ఢంకా భజాయించి చెప్పిన తర్వాత వందేళ్లకు యండమూరి వీరేంద్రనాథ్ తులసిదళాలను సృష్టించడం ఈ వైపరీత్యానికి ఉదాహరణ. అరవై, డెబ్బయి దశకాలలో రచయిత్రుల కాల్పనిక సాహిత్యానికి వారపత్రికలు కారణమైతే ఈ దశలో కొన్ని వారపత్రికలు సరసమైన కథలు, పెద్దలకు మాత్రమే కథలు ప్రచురించడం మొదలెట్టాయి.. విశేషమేమంటే నాటి నవలలాగే ఇప్పుడు కూడా ఈ నవలలు చలనచిత్రాలుగా వచ్చి విజయం సాధించాయి. దీనికి తెలుగు సినిమా రంగాన్ని సమాంతరంగా తీసుకుంటే అక్కడా సాహిత్య విలువలలో ఈ క్షీణత మార్పు గోచరిస్తాయి. సాహిత్యానికి, మీడియాకు సమాజానికి మధ్య సంబంధాలలో సరికొత్త మార్పును ఇవి సూచిస్తాయి.

1977లోనే 'ప్రజాసాహితి' రంగనాయకమ్మ సంపాదకత్వంలో ప్రారంభమైంది. కొంత కాలం తర్వాత అది జనసాహితి అధికార పత్రికగా మారింది. ఇప్పటి వరకూ నిరాఘాటంగా నడుస్తున్నది. ప్రత్యామ్నాయ రచయితలకు ఒక వేదికగా ఉపకరించింది.

ఈ కాలంలో దినపత్రికలు సాహిత్య వార్తల ప్రచురణకు ప్రత్యేకంగా విలేకరులను నియమించుకోవడం పెరిగింది. స్థానిక వార్తల కవరేజి పెంచిన ఈనాడు ఇందుకు దోహదపడింది. పట్టణాలలో డొక్కశుద్ధి గలవారిని కల్చరల్ కంట్రిబ్యూటర్లుగా నియమించుకుని వారితో పుస్తకావిష్కరణలు, సాహిత్య సభల సమాచారం వివరంగా తాజాగా ఇవ్వడంతో సాహిత్య వార్తలు పెరిగాయి. అంటే వాటి వార్తా విలువ పెరిగింది. క్రమేణా సాహిత్య సభలంటే కవులు రచయితలకే పరిమితమకుండా వాటివల్ల కూడా ప్రచారం లభిస్తుందని గుర్తించే అవకాశం కలిగింది.

**కొత్తగవాక్షాలు**

ఎనభయ్యవ దశకం మధ్య కాలం నుంచి తెలుగు పత్రికల సాహిత్య పాత్రలో మార్పు కన్పిస్తుంది. ఉదయం పత్రికలో ధ్వని పేరుతో సాహిత్య పేజీ మొదలైంది. దీనివల్ల సాహిత్య సంబంధమైన ఇంటర్వ్యూలు, సమీక్షలు, వాదోపవాదాలకు అవకాశం పెరిగింది. ఇది ఒక కొత్త దశ. అనతి కాలంలోనే ఆంధ్రజ్యోతి కూడా సాహిత్యవేదిక ప్రారంభించింది. దిగంబర విప్లవ కవిత్వాల అనంతరం అనుభూతి కవిత్వ ఘట్టాన్ని దాటి దళిత ఫెమినిస్టు వాదనల దశలో ఆ పేజీలు రావడం వల్ల సాహిత్య చర్చ వూపందుకోవడానికి అవకాశం కలిగింది.

అదే సమయంలో పత్రికల సహజ లక్షణాలు సాహిత్యరంగానికీ సోకాయి. అంటే సాహిత్య చర్చలో సంచలనశీలత ప్రవేశించింది. విషయాన్ని విమర్శించడమే చాలదని ఏవో కొన్ని

పరుషమైన వ్యాఖ్యలు వుంటేనే ప్రచారం లభిస్తుందని భావించడం మొదలెట్టారు. ఫలానా ఆయనకు సాహిత్యం తెలీదని, ఫలానా వారు రచయితే కాదని ఇలాటి స్టేట్‌మెంట్లు పెరిగాయి. ఆరుద్ర వారం వారం వ్యాసపీఠం రాస్తుంటే దేవీప్రియ,గజ్జెల మల్లారెడ్డి, ఈ వ్యాసరచయిత రోజువారీ కవితా చరణాలు టుమ్రీలు రాయడం కొనసాగింది. ఈ అనుదిన కవితలు, వాటి కార్టూనులు రోజువారీ పాఠకులలోనూ సాహిత్యాభిలాష పెంచడానికి సాధనాలయ్యాయి. కవిత్వ ప్రచురణలోనూ ఫోటోలతో ఫీచర్ చేయడం పెరిగింది.

ఈనాడు సాహిత్య వ్యాసాలు ప్రచురించకపోయినా ఆ సమాచారం ఇవ్వడంలోనూ, అంతకుమించి తన శీర్షికలు, కాలమ్‌లలోనూ సాహిత్య విలువలను పాటించింది. వార్తలలోనూ, వార్తల రూప కల్పనలోనూ సాహిత్యానికి గల వస్తు విలువను ఉపయోగించుకోవడం, సాహిత్యంగా దానికి వున్నవిలువకు తగినంత చోటు కల్పించలేక పోవడంలో ఒక సామాజిక సూత్రం వుంది. ఏమైనా ఆ సంస్థ విపుల,చతుర ద్వారా ఎందరో రచయితలు అనువాదకులను ప్రోత్సహించింది. ఆదివారంఅనుబంధం కళాసాహిత్య విజ్ఞానవేదిక అనే స్వరూపాన్ని మార్చి నమ్మలేని నిజాలు, సెక్స్ సైన్స్ వంటివిప్రవేశపెట్టింది. తర్వాత పుస్తకంగా మార్చి ఒక హాస్యకథ వేస్తూ వచ్చింది.ఇటీవల కాలంలో సీరియస్ కథలు కూడా వేస్తోంది రచన కూడా సాహిత్యాభిరుచి పెంచడానికి విశేషంగా సహకరించింది.

తొంభయ్యవ దశకం తొలిదశ నాటికే ఈ ప్రభావాలు బాగా పెరిగాయి. అప్పటికి ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం కూడా సాహిత్యానికి ప్రాధాన్యత పెంచింది. చేకూరి రామారావు చేరాతలు లో వారం వారం ఎవరి పుస్తకాన్ని పరిచయం చేస్తారనేది ఆసక్తికరమైన అంశంగా మారింది.

అలాగే నార్లవెంకటేశ్వరరావు, ఎబికె ప్రసాద్ వంటి సంపాదకులు తమకు నచ్చిన పుస్తకాలను పరిచయం చేసే పద్ధతి పాటించారు. నండూరి రామమోహనరావు కూడా తనదైన శైలిలో సాహిత్య రంగానికి పత్రికాముఖంగా సహాయపడ్డారు. ఈ జాబితాలో చేర్చవలసిన పేర్లు విషయాలు ఇంకా వున్నాయి. ఉదాహరణకు కీ.శే. టిఎల్ కాంతారావు కలాలు- సంకలనాలు, అప్సర్ అక్షరాలా, చందు సుబ్బారావు చందన చర్చ, బేతవోలు రామబ్రహ్మం పద్యారణ్యం, నలిమెల భాస్కర్ సాహితీ సుమాలు, దేవరాజు మహారాజు కవితాభారతి, అబ్బూరి వరద రాజేశ్వరరావు వరదకాలం, ,దాశరథి రంగాచార్య జ్ఞాపకాలు వంటివి పత్రికలలో జనాదరణ పొందిన కొన్ని శీర్షికలు. ఇదే విధంగా ఈ దశలో సృజనాత్మక సాహిత్యం కూడ పత్రికల ద్వారా వెలుగులోకి వచ్చిన ఉదాహరణలున్నాయి. నామిని పచ్చనాకు సాక్షిగా, కెఎన్‌వై పతంజలి పతంజలి భాష్యం, మృణాళిని కోమలి గాంధారం,ఖదీర్ బాబు కథలు అందులో కొన్ని. విరసం అధికార పత్రిక అంటరాని వసంతంలో సీరియల్‌గా వచ్చిన కళ్యాణరావు అంటరాని వసంతం అపూర్వ ప్రతిష్ట సం... ...ంది.

...స పెర్కొన్న వారు గాక పత్రికలలో ...్య చర్చకు దోహద పడిన వారు ఇంకా ఎలువురున్నారు. ఆవంత్స సోమసుందర్, కేతు విశ్వనాథరెడ్డి,అద్దేపల్లి రామమోహనరావు, కె.రామమోహనరాయ్, పురాణం సుబ్రహ్మణ్య శర్మ, కెవి రమణారెడ్డి, జ్వాలాముఖి, పాపినేని శివశంకర్, కోవెల సంపత్కుమారాచార్య, నాళేశ్వరం శంకరం, తెలకపల్లి రవి, సతీష్ చందర్, కల్లూరి భాస్కరం, కాత్యాయని విద్మహే, అబ్బూరి చాయాదేవి, ఓల్గా, ఎన్.వేణుగోపాల్, రంగనాయకమ్మ, సుధామ, కాత్యాయని, పొనుగోటి కృష్ణారెడ్డి, జి.లక్ష్మీనరసయ్య, బి.తిరుపతిరావు, గుడిపాటి, కె.శ్రీనివాస్, కెపి అశోక్ కుమార్, ద్వానా శాస్త్రి, ఎస్వీ , నిఖిలేశ్వర్, రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, వాడ్రేవు చినవీరభద్రుడు, ఎన్‌గోపి, చిన్న వయసులోనే కన్నుమూసిన త్రిపురనేని శ్రీనివాస్ తదితరులు అలాటి వారిలో కొందరు. ఈ జాబితాలో ఇంకా చాలా మంది సీనియర్లు, ఔత్సాహికులను కూడా కలపాల్సి వుంటుంది

ఇండియా టుడే 90లలో సాహిత్య వార్షిక సంచికలు ప్రారంభించడం కూడా చాలా ప్రభావం చూపింది. దాదాపు అప్పుడే ప్రజాశక్తి, తర్వాత ప్రజాతంత్ర కూడా వార్షిక సాహిత్య సంచికలు తెచ్చాయి. ఈ విధంగా పత్రికలలో మరుగుపడిపోయిందనుకున్న సాహిత్యం మళ్లీ ప్రోత్సాహం పొందింది.

మొదటి నుంచి కూడా పత్రికాసమీక్షలు పుస్తకాల గురించి తెలియజేసే ప్రధాన సాధనాలుగా వుంటున్నాయి. సమీక్షల స్థాయి, మోతాదులో తరతమ తేడాలున్నా నాటికి నేటికి ఈ పాత్ర కూడా కొనసాగుతూనే వుంది. మొత్తం మీద ఇప్పుడు సమీక్షలకు సాహిత్య విలువ కన్నా పదిమందికి తెలియజేసే పాత్రనే ఎక్కువగా వుంటున్నది.

ఈ విధంగా తెలుగు పత్రికలు సాహిత్యరంగానికి చేసిన సేవ రూపం మారినా ఇప్పటికీ గణనీయంగానే వుంటోందనడం నిస్సందేహం.

**ఇతర మీడియా**

మిగిలిన మీడియా రూపాలు- అంటే సినిమా, టీవీ, రేడియోలను కూడా ఒకే వ్యాసంలో పరిశీలించడం స్థలాభావం దృష్ట్యా సాధ్యం కాని పని. కొన్ని సాధారణ సూత్రీకరణలు చేయొచ్చు.

సినిమాల మొదటి దశలో ప్రముఖ కవులు రచయితలే వుంటూ సాహిత్య విలువలను అందించారు. క్రమేణా ఆ పరిస్థితి మారింది. సినిమా పాటలు వ్యాపార మయమై ద్వంద్వార్థ భరితమై పోయాయి. ఇప్పుడు అసలు అర్థం అన్న ప్రశ్న లేకుండా ధమధమలతో నిండిపోతున్నాయి. తెలుగు సినిమాలో తెలుగుదనమే కొడిగడుతు న్నప్పుడు తెలుగు సాహిత్య విలువలుంటాయని ఎలా ఆశించగలం? అరుదుగానే కొన్ని మంచి పాటలు వస్తున్నాయి. 1974లో శ్రీశ్రీ తెలుగువీర లేవరా కు జాతీయ అవార్డు వస్తే 30 ఏళ్ల తర్వాత ఆయనే కవితే ప్రేరణగా సుద్దాల అశోక్ తేజ రాసిన నేనుసైతం పాటకు అవార్డు రావడం ఒక విశేషం.

ఇక టీవీలలో ఎంటర్‌టైన్‌మెంట్ ఛానళ్లు సహజంగానే వినోద ప్రధానమైనవి. అవీ సినిమాల చుట్టూ తిరుగుతుంటాయి. వాటిలో సాహిత్యం, సామాజిక విలువలు ఆశించలేము. స్పాన్సర్లు సహించరు కూడా. ఏ సీరియల్‌లోనూ సాహిత్యం, పుస్తకాల గురించిన ప్రస్తావనేవినిపించదు. కాకపోతే సాహిత్య కారుల ఇంటర్వ్యూల ద్వారా మాత్రం వారిని పాఠకులకు ప్రత్యక్షంగా పరిచయం చేయడం ఛానల్స్ చేసే ఒక పెద్ద సేవ. కొన్ని ఛానల్స్‌లో సమీక్షలు, పరిచయలు కూడా వుంటున్నాయి. దీనితో పాటే సాహిత్య కార్యక్రమాల ప్రసారం కూడా. ఛానల్స్‌లో కార్యక్రమాల సమర్పణకు కవితా చరణాలు బాగా ఉపయోగిస్తుంటారు.

రేడియో మొదటి నుంచి సాహిత్యానికి సానుకూలంగా దోహదపడింది. ప్రసిద్ధకవులు, రచయితలు ఆకాశవాణిలో పని చేశారు. ఇప్పటికి ప్రభుత్వ సంస్థగానే వుందిగనక తత్సంబంధిత ప్రభావాలున్న కలుషిత విలువలకు మాత్రం దూరంగా వుండగలుగుతుందని చెప్పొచ్చు ఇవి మొత్తంపైన మీడియాకు సాహిత్యానికి మధ్య సంబంధంలో కొన్ని అంశాలు. ఇవన్ని కూడా వర్గ సమాజంలో మీడియా సాధారణ స్వభావానికి లోబడే పని చేస్తుంటాయని గమనంలో వుంచుకోవడం అన్నింటి కన్నా ముఖ్యం.

**(ఉస్మానియా యూనివర్శిటీ అకడమిక్ స్టాఫ్ కాలేజీ పునశ్చరణ తరగతుల్లో చేసిన ప్రసంగ పత్రం)**

# సర్కారు తుమ్మ



కొలనుపాక మురళీధరరావు

కొండయ్య తుండుగుడ్డను తలకు చుట్టుకొని భుజం మీద గొడ్డలి పెట్టుకొని ఒక చేతిలో టిఫిను డబ్బా పట్టుకొని ఎనిమిది గంటలకే అడ్డా మీది వచ్చి కూకుండు "ఎందిరో కొత్త బిచ్చగాడు పొద్దేరెడుగని ఇంత పొద్దుగాల వచ్చినవేంద్రో" పలకరించినాడు టీ కొట్టు మల్లయ్య 'ఏందో అన్నా రెండు రోజుల నుండి ఈడికి వస్తున్నా పోతున్నా జనం కిటకిటలాడుతున్నారు. కరువు కాలమాయె. పూట కూలికి పోటీ పడే దినాలొచ్చినాయి. మరేమో ఈడకూడ యింత జనం వుంటారనుకోలేదు' గుర్రం పూదు నుండి బతకటానికి వచ్చిన కొండయ్య టీకొట్టు మల్లయ్యతో అన్నాడు.

"పది గంటలుకొట్టింద్రు ఒక్క రొక్కరే కూలోంద్రు మేస్త్రీల వెంట పోతున్నరు ఏ ఒక్క మేస్త్రీ కూడ తనని పిలవడంలేదు. ఊరు కొత్త. అదే తన వూరు గుర్రం పూదు అయితే ఎవరో ఒకరు తెలిసినోళ్ళు పలకరించేటోళ్ళు ఈడ ఎవడికి వాడే యమునా తీరె తన పొట్ట మీద ఈడెక్కడ కొడతాడోనని గుర్రుగ చూసేటోండ్లే. ఉండబట్టలేక ఒక మేస్త్రీతో "అన్నా నాకు ఏదైన పనిమైనా చూపించరాదు" అడిగాడు, ఆడు 'ఆడకూలి కావాలేనీవెందు"కంటూ అప్పుడే వచ్చిన పోరీతో మాట్లాడుకొని సైకిలు మీద తీసుకపోయిండు.

అడ్డా ఖాళీ అయింది. ఇద్దరో ముగ్గురో తనతోటీ వాళ్ళు మిగిలింద్రు. వాళ్ళు కూడా ఆడ నుంచి కదిలిపోయింద్రు. ఇంక తనొక్కడే మిగిలిండు. పది దాటింది కచ్చేరీలకి పోయెటోళ్ళు, బళ్ళకుపోయెటోళ్ళు, దుకాణాలకు పోయెటోళ్ళు పోతున్నా ఇంక లాభం లేదనుకొని పానగల్లు బాట పట్టిండు ఆడ ఏదో కట్టపని జరుగుతూందంట ఏదైనా పని దొరక్కపోతుందా అన్న ఆశతో కట్ట కాడికి పోయి నిలబడ్డడు. ఇంజనీరు సాబు, మేస్త్రీలు, సిమెంటు బస్తాలు మోస్తున్న కూలోళ్ళు కనబడ్డరు. "సార్, ఏదైనా పని నాక్కూడా ఇప్పించండి. ఇంజనీరు సాబును అడిగుండు 'నా కెరుకలేదు గుత్తేదారు నడుగ్గుపో' అన్నాడు విసుగ్గా. పక్కనే వున్న పోరగానితో 'గుత్తేదారు అంటే ఏందీ తమ్మీ' అడిగాడు 'ఓరినీ యవ్వ! గుత్తేదారంటె ఎరుకలేదా? గుత్తేదారంటే పని గుత్తకు మాట్లాడుకొని తనే కూలోళ్ళను మాట్లాడుకొని కొంత కమిషను ఆయనికిచ్చి కొంత తను దొబ్బి పని చేయిస్తడు "గుత్తేదారుకు చెప్పినా క్కూడా పని ఇప్పించరాదా?" అడిగాడు కొండయ్య. "నాకేగతి లేదు నేను ఆడికాళ్ళు ఈడి కాళ్ళు పట్టుకుంటే ఈడ చూపించుదు 'ఆ' వస్తున్నా' అంటూ ఆద్నుంచి పరుగున పోయిండు. పని దొరుకుద్దని ఆశతో వస్తే ఈడ కూడేదొరకనట్టుంది. నిరాశతో అటూ యిటూ కదలసాగిండు. ఇంతలో ఇంజనీరు సాబు బువ్వలయాళైందని బోయిండు. ఆయన అటు నుండి పోగానే పని మందగించి ముచ్చట్లో పడ్డారు పనోళ్ళు. కొందరు బీడీలు కాల్చుకుంటున్నారు మరికొందరాడ కూలోళ్ళతో పరాచికాలాడుతున్నారు. కొండయ్య వాళ్ళకాడికిపోయి చేతులు నులుపుకుంటూ 'అన్నా నాక్కూడా పనిప్పించండి రెండు రోజుల నుంచి కూడు దొరకటంలేదు' వాళ్ళలో పెద్ద మనిషిని జాలిగా అడిగిండు.

'సింగన్నా ఈడికి పనికావాలంటా' బీడీ నములుత్తూ సింగన్నకేసి చూస్తూ అన్నాడు.

'ఈడ పని దొరుకద్దని వచ్చినవు బిడ్డా. ఏ వూరేమనకి 'గుర్రం పూదా. శానా దూరం కెళ్ళి వచ్చినవ్ ఈ ఏం బాపుకుందామని? 'ఎవరో అన్నారు. పొలం, పుట్రా చెల్కగిల్క ఉందా?" అడిగిండు ఇంకొకాయన రెండెకరాల చెల్క పడావ్ కాలం లేక కరువుతో బీడైంది.

'ముగ్గరం బతకాలి. నేను మాయమ్మ మా చెల్లి' నేను కూలోనాలో చేసుకొని పొట్టచేతపట్టుకొని ఈ వూరికిచ్చిన రెండు రోజుల నుండి నల్లడ అడ్డలన్నీ తిరుగుతూండ. ఏ మేస్త్రీకి దయరాదే "అమ్మో! అయ్యో! సర్కారు ముల్లు గుచ్చుకుందే రక్తం గారుతుంది పదేళ్ళపిల్ల కుంటూకుంటూ ఏడ్చుకుంటూ వచ్చింది.

ఏందే బిడ్డా ఏ జరిగిందే? ఏడ్కిపోయినవే మల్లమ్మ శోకాలు పెడుతూ పిల్లకాడికిపోయింది. మొన్న కూడా జమ అయిన్రు. చంటి పిల్లను ఆడించడానికిపోయిన ఇంతలోపిల్ల పాక్కుంటూ పోయింది 'నేను చెంబట్కకు ఆడికిపోయిన అంటే కసుకు ముల్లు కాల్లో దిగిందే అమ్మానొప్పి' అంటూ కూలబడింది. 'నన్నూ చూడనీ' ఓ ముసలయానా వచ్చి 'ఈ సర్కారు తమ్మ పాదుగాను దయ్యంలా ఊరులూ పాకింది. మొన్ననే సాబుచేస్తే మళ్ళా మన గుడిసెల్లోకి వచ్చింది. దేశం నిండా ఈ చెట్లే. మా చిన్నప్పుడు ఐదు రూపాయలకు కిలో విత్తనాలు కొని కంచె చుట్టూ ఏసిందు మా అయ్య. చెల్కపోయి కంచె పోయింది. తుమ్మలు మాత్రం మిగిలినయి నేను కూలోడ్ని అయిన అన్నడు కొండయ్య పిల్లనొప్పితో మొత్తుకుంటూంది ఏం చేద్దాం మల్ల అడిగింది చంద్రమ్మ డాక్టరు కాడికి తీసుకపోదాం "సూది మందిస్తడు కట్టు గడ్తడు. అన్నాడు మల్లయ్య 'ముందుకాల్లో ముల్లు ఉందో చూడండీ. ముల్లు లేకుంటే ఈ తుమ్మాకుని ఉడికించి కట్టు కడ్తె రెండు రోజుల్లో తగ్గుద్ది" అన్నాడు కొండయ్య నిజమే లోపల ముల్లుంటే సెప్టిక్ అయితది. ఆ తరువాత కాలు కొట్టయాలంటడు అన్నాడు లతీఫ్‌సాబు.

'డాక్టరు కాడికిపోతె బొచ్చెడు పైసలయి పోతాయి. దగుల్బాజీ కబుర్లు చెప్పి పైసలు గుంజుతడు'. 'మరి సర్కారు దవాఖానా పోదామనే' అన్నడు చంద్రయ్య 'ఏందయ్యో! సర్కారు దవాఖానాకా. నేను తీసుకుపోను ఆడ్కిపోతే ఇంకా గోరం ఇన్ని రంగునీళ్ళు పోసి పొమ్మంటారు. లేదా ఇంటికి తీసుకరమ్మంటారు' అంది గాబరా పడుతూ చంద్రమ్మ బిడ్డను దగ్గరకు తీసుకుంటూ.



'మరేం చేద్దామే. ఇంజనీరు సాబు వచ్చే ఏళైంది తొందర చెప్పండే ఏం చేద్దాం?

నేను పరాయి ఒడోనని అనుకోకపోతే నన్ను ఒకసారి చూడనీయండి ఆ పిల్లకాలు నాకుతోచిన వైద్యంనేచేస్తాను. మా గుగ్రం పూళ్ళో మేం చేస్తేనే చేస్తాను. అన్నాడు కొండయ్య

'సరె, చూపించండి పిల్లకాలును' అని రామయ్య అనగానే

కొండయ్య పిల్లకాలును అటు యిటు తిప్పిచూసిండు. నొప్పి ఎక్కడ ఉందో చూసి అక్కడ నొక్కిండు పిల్లకెవ్వుమంది. 'భయం లేదు ముల్లు లేదు. లోపలికి బాగా గుచ్చుకుంది' పిల్లను ముల్లు గుచ్చుకున్న చోటికి తీసుకపోయి ముల్లకంపను చూసిండ్రు. ఎక్కడ ముళ్ళు విరిగినట్టు లేవు పచ్చి ముళ్ళు గుచ్చుకుంటుందేగాని తొందరగా ఇరగవు అని చెప్పి. తుమ్మాకు బాగా ఉడికించి కాలు కట్టుకట్టిండు కొండయ్య.

ఆ మాట ఈ మాట అనుకునేలోగానే పొద్దుగూకింది. 'ఈ సర్కారు తుమ్మలు ఎవరైనా కొట్టకపోతే బావుండు. నాలుగు పైసలైనా వస్తవి. లేకుంటే బొగ్గులు చేసి అమ్ముకుంటే సరే సరి బంగలాలు కట్టొచ్చు" అన్నాడు లతీఫ్‌సాబు.

'అవును మన బొగ్గుల కాంట్రాక్టరు కనకయ్య నకిరెకిలో పెద్ద బంగళా కట్టుకున్నాడు. ఈ యాపారం చేసే అన్నాడు రామయ్య.

'ఈ సర్కారు తుమ్మలు ఎవరైనా కొట్టుకోవచ్చా' అమాయకంగా అడిగాడు కొండయ్య.

ఎవరైనా కొట్టుకోవచ్చు అంటేగాదు బొగ్గుల కాంట్రాక్టరు అమ్ముతే నాలుగు డబ్బులు కూడా వస్తాయి" అని చంద్రయ్య అన్నా మరినేను ఈ సర్కారు తుమ్మను కొట్టుకోనా? రామయ్యకేసి చూస్తూ ఆశగా అడిగాడు కొండయ్య కొట్టుకోబిడ్డా నీ రెక్కల కష్టం నీవు బాగుపడతానంటే మాకేందంట. మాజాగా సుబ్బరంగా ఉంటది. నీకు బువ్వ దొరుకుద్ది అన్నాడు చుట్ట కాల్చుకుంటూ రామయ్య.

'రేపటి నుండి కొట్టుతా' అన్నాడు సంబరపడుతూ 'ఈ రోజు కూలి గిట్టుబాటవుతుంది రేపు అమాస్య చివరిరోజు కాదు' అన్నారెవరో.

'మనకు మంచి రోజు చెడ్డరోజు అని చూస్తే బువ్వ దొరకదు బిడ్డా. ఇంక రభాము పొద్దుంది. పని మొదలు పెట్టి కొట్టినంత కొట్టుకో' అన్నా రామయ్య వైపు చూసి కొండయ్యకు కొండంత బలం వచ్చింది తను కండలు తిరిగిన మనిషి కాకున్న భుజ బలం మన్నోడు రెక్కల కష్టము చేసి బతికేటోడు రెక్కాడితేగాని డొక్కాడని బడుగు బతుకు పని మొదలు పెట్టిండు. 'ఏందిరాబిడ్డా సద్దిమూట అట్లాగె ఉంది. ముందు బువ్వ తిని పని మొదలు పెడితే కొంచం పొద్దుగుంకినా కొంత పనవుతూంది.

కాళ్ళు, చేతులు కడుక్కొని తెచ్చుకున్న అన్నము తిని మళ్ళా పని మొదలుపెట్టిండు. ఎండిన కంప చెట్లను ఒక వైపు కొట్టి. పచ్చిగా ఉన్న కంపచెట్లను కొట్టి వేరే మోపులు కట్టిండు. పడమటి దిక్కున సూర్యుడు కొండచాటుకు పోయిండు. ప్రాజెక్టు కూలోండ్రు పనుల్లో నుంచి దిగి చేతులు కాళ్ళు కడుకుంటుండ్రు. కొండయ్య తానుకొట్టిన ఎండు కట్టెల మోపులను రామయ్య గుడిసె ముందు పెట్టి 'తాతా యివి మీరు పొయ్యిలోకి వాడుకోండి. నేను పచ్చి కట్టెల మోపులను అమ్ముకుంటూ ఆ పైన భగవంతుని దయ' అన్నాడు.

'అదేంది బిడ్డా, మీ కష్టం మాకెందుకు మా పిల్లలు ఆడనో ఈడనో పడ్డ కట్టెల ఏరుకొస్తార్లే. ఎండువి పచ్చివి కల్పిమోపులు కట్టి అమ్మాలి తెలుసా? 'అచ్చంగ ఎండువి వేరు పచ్చివి వేరు చేసి అమ్మితే లాభంరాదు' వ్యాపార రహస్యం చెప్పాడు. రామయ్య తాత కొండయ్య. రామయ్య తాత చెప్పినట్లు అన్నీ కల్పి మోపులు కట్టల గట్టిండు. చీకటి పడుతూంది. ఈ రాత్రి వీటిని ఈడనే పెట్ట రేపు సందాళే వచ్చి అమ్ముకుంట. ఇంగా ఈడనే ఉండి మీతోపాటు కలో గంజో తాగుతా అంటూ తుండగుడ్డతో ముఖం తుడ్చుకుండు.

'ఏడ ఉంటున్నావ్ అడిగాడు ఎంత మంది' అన్నాడు 'రైలు పట్టాలావతల ఒక గుడిసెలో ఉంటుండా నేనొక్కడ్నే'.

చూద్దాంలే రేపురా నీవు రోజు వచ్చి తుమ్మలు కొట్టుకో నేను మా గుత్తేదారుతో మాట్లాడి చూస్తా భరోసా యిచ్చేసరికి ఆ రోజు పడిన కష్టానికి ఫలితం దొరిందనుకున్నాడు.

పొద్దుగల్లనే వస్తా లతీఫన్నా,చంద్రన్నా, రామయ్య తాత అంటూ రైలు పట్టాల వైపు దారి పట్టిండు.

రామయ్య తాత పుణ్యమా అంటూ కొండయ్య తాను కొట్టిన మోపులను బొగ్గుల కాంట్రాక్టరు కనకయ్యతో చెప్పబట్టి అమ్ముడుబోయినయి. వీడు మనోడే కనిపెట్టు జరా అని కాంట్రాక్టరుతో మరీ మరీ చెప్పంగ తాను ఇన్నాడు కూడా. కొండయ్య సంబరంగ రామయ్యతాత చేతిలో యాభై రూపాయలు పెట్టి కాళ్ళకు మొక్కిండు. 'ఇదేంది బిడ్డా! నీ కష్టం నా కెందుకు' తాతా నీవు చెప్పబట్టే కదా

మూడొందలు రూపాయిలొచ్చినయి. లేకుంటే ఒక పూట తిని ఒక పూట తినక పస్తులుండే వాడ్ని కదా అన్నాడు. మనలో మనకు లంచాలు కమిషన్లేంది బిడ్డా అన్నాడు కొండయ్య పొంగిపోయిండు. కొండయ్య చేసిన వైద్యంతో చంద్రయ్య బిడ్డ కాలు నొప్పి తగ్గింది పిల్ల కూడా తనపని తాను చేసుకుంటుంది. కొండయ్య వాళ్ళలో ఒకటైంది. రోజుపొద్దునే లేవడం తుమ్మలు కొట్టడం చంద్రయ్య కూతురు వాటిని ఒక దగ్గరి చేర్చడం జరుగుతుంటే 'నీకెందుకు కష్టం? నేను కొట్టిన కట్టెలను మోపు కట్టుకుంటాన్లే చంద్రయ్య బిడ్డ లక్ష్మితో, నీవు నా కాలు బాగుచేసినవ్ కదా ఆ మాత్రం సాయం చేస్తే ఏమవుతుందని అంది. రోజులు గడుస్తున్నాయి. సర్కారోళ్ళు 'క్లీన్ గ్రీన్' పథకం కింద సర్కారు తుమ్మచెట్లు కొట్టిస్తున్నారని తెల్సింది గుత్తేదారు కనకయ్యకు. వెంటనే కొండయ్యకు ఆ పని ఒప్పచెప్పిండు సర్కారు వాళ్ళతో మాట్లాడిండు. కొండయ్యకు చేతి నిండా పని దొరికింది. అలుపెరుగకుండా కట్టెలు కొట్టి తాను గుత్తేదారు కనకయ్యకు అమ్మి నాలుగు డబ్బులు కూడబెట్టుకుంటూ దీపావళి పండక్కి ఇంటికి పోవాలి. అమ్మను, చెల్లిని చూడక చాలా రోజులైంది. అమ్మకో చీర చెల్లికి మంచి పరికిణి బట్టలు తీసుకోపోతే సంబరపడతారను కుంటూ బతుకుబండిని నడుపుతూండు.

కాలం తన పని తాను చేసుకబోతూంది. తాను వచ్చి పదినెల్లైంది. రామయ్య తాత కొండయ్య తమ దగ్గరలోనే ఓ గుడిసె ఏయించుండు ముందు చూపుతో చంద్రయ్య బిడ్డ లక్ష్మిని కొండయ్యకు కట్టబెట్టాలనే ఆలోచన వుంది. మరి చంద్రయ్యను కోడలును అడగాలి వారికి నప్పితే చంద్రయ్య కొండయ్యను అడగాలి. మరికొండయ్య ఏమంటాడో రామయ్య తాత ఆలోచన రామయ్యది దీపావళి రెండు రోజుల్లో పడ్డది. గుత్తేదారు 'కనకయ్యా ఇప్పుడేం పని లేదు పండుగ తరువాత మళ్ళీ పని మొదలుపెడదాం అనడంతో తన మనసులో కొంత దిగులైంది. పని బందైతదా? దీపావళికి ఇంటికిపోయి వచ్చిన తరువాత చూద్దాం తనకు తానే ధైర్యం తెచ్చుకొని రామయ్యా తాత, నేను మా వూరి పోయి రెండు రోజులుండి వస్తా, అమ్మను చెల్లిని చూడక చాలా నాళ్ళు అయ్యింది పండుగ పూట ఆడ ఉండి మళ్ళీ ఈడకు వస్త అన్నాడు. బాగానే వుంది నీ ఆలోచన పోయిరాబిడ్డా పండుగ పూట అందరూ ఓ కాడ వుండి కలోగంజో తాగితే అదొక సంతోషం అదొక తృప్తి అన్నట్టు మీ చెల్లిని మీ అమ్మను ఈడికే తోలుకరా రెండు రోజులుండిపోతారు. ఇప్పుడు నీకు టికానా కూడా దొరికింది కదా కొండయ్యతో అన్నాడు రామయ్య చంద్రయ్యకేసి చూస్తూ.



మరి మా అమ్మ ఏమంటుందో.

'అమ్మను చెల్లిని ఈడికి తీసుకొస్తే మనతో బాటే వుంటారు. ఆడ కాలం లేదంటివి కదా. చెల్కలు కూడా పడావ్ పెడ్తివి. అంతగైతే మళ్ళీ వానా కాలం మొదలైనప్పుడు ఆడికిపోయి ఎవరికైనా కౌలుకిస్తే బావుంటుంది చంద్రయ్య కొండయ్య రామయ్య చూపులను గ్రహించి. అంతకైతే ఈడ బాగుండకపోతే మళ్ళీ ఆడికిపోవచ్చు. నీవేంటావ్ అయ్యా. రామయ్యకేసి చూస్తూ అన్నా 'మా అమ్మకు చెప్పి చూస్తా ఆపైన ఇష్టం' సరే నీ ఇష్టం రామయ్య తాత పోయొస్త లతీఫ్ అన్నా చంద్రయ్య మెల్లగా లక్ష్మికేసి చూస్తూ పోయొస్తా అంటూ గుర్రం పూడుబాట పట్టిండు.

అరె చంద్రయ్య లచ్చికి కొండయ్య జోడుగా ఉంటాడు గదా మరినీకేమనిపిస్తుంది. పోరగాడు బుద్ధిమంతుడె ఒళ్ళోంచి కష్టపడతడు మనం చూస్తున్నాం గదా. 'అవును రామయ్య తాతా లక్ష్మికి కొండయ్యతో లగ్గం చేస్తే బావుంటుందని లతీఫ్ సాబు అన్నాడు.

మరి కొండయ్యను అడగొద్దు మరి అతని తల్లి ఏమంటుందో. అనుమానం వెలిబుచ్చిండు. రామయ్య "కొండయ్య మనస్సు మన లచ్చిమ్మీదే వుంది. మరి కోడలు పిల్లను అడిగి తెలుసుకో వచ్చిన మనందరం ఒకే మాట మీదుండి వాళ్ళను అడుగుదాం నా మాట కాదనరు' అన్నాడు రామయ్య తాత చంద్రయ్యతో గుర్రంపూడికి పోయిండు 'ఎన్నాళ్ళైందిరా బిడ్డా! ఎంత చిక్కిపోయినవ్రా. పనీగినీ దొరికిందా. ఒళ్ళంత తడిమీ అనురాగంతో తల్లి అడిగేసరికి కళ్ళలో నీళ్ళు తిర్గినయి కొండయ్యకు. అన్నా ఎప్పుడొచ్చినవ్ బజారు నుండి వస్తూ అడిగింది చెల్లె మల్లీశ్వరి. ఇంతకు ముందే వచ్చిన బావున్నావా! చెల్లిని తన దగ్గరికి తీసుకుంటూ తల్లికి చెల్లికి తెచ్చిన బట్టల బిస్కటు పొట్లం ఇచ్చిండు. ఏంద్రా పండక్కి మాకు బట్టలు తెచ్చినావ్. ఎంత ఖర్చు పెట్టినవ్ ఇన్ని రోజులు ఏడ వున్నావు ఏం చేసినవ్ చెప్పుబిడ్డా నా మనస్సు నీ మీదే బుగులు బుగులుగా వుంది. తల మీద చేయి వేస్తూ కొండయ్య ఒళ్ళు నిమురుతూ అడిగింది. కొండయ్య తల్లి చేతిలో ఐదొందలు పెట్టిండు పండుగ ఖర్చుకు వుండని అక్కడి సంగతంతా చెప్పి వాళ్ళు చాలా మంచోళ్ళు నిన్ను చెల్లెను తీసుకరమ్మన్నారు. ఆడనే వుండి పొమన్నారు.

ఈడ ఏంజేసినా పొట్ట వెళ్ళడం లేదు బిడ్డా ఆ రెండుఎకరాల చెల్కలో తాండలు కూడా గుడ్లు పెట్టడంలేదు. ఐదేండ్ల నుండి పడావ్ పెట్టినం. అమ్ముదామంటే కొనేనాథుడు పుల్లయ్య తాతకు కౌలుకిద్దాం. మొదటి నుండి మన మంచీ చెడు చూస్తున్నాడు గదా. కాలం బావుంటే ఆ తరువాత చూద్దాం అన్నాడు. కొండయ్య బిడ్డా నీవు తెల్విబారినవ్ బిడ్డా, నాకేం భయం లేదు అంది మెచ్చుకోలుగా నాగమ్మ.

పండుగ సంబరాల అయిపోయినై. తల్లీని చెల్లిని వెంటబెట్టుకొని వచ్చిండు. అంతదూరం నుండి చూసిన లక్ష్మి రామయ్య తాతకు చెప్పింది.

కొండయ్య తల్లిని చెల్లిని వాళ్ళందరి ఎరుక పరిచిండు చుట్టుపక్కల చూస్తూ పెరిగిన సర్కారు తుమ్మలు మళ్ళీ తనను పిలిచినట్టనిపించింది. ఇక చేతినిండా పని దొరికందనుకున్నాడు. ఈ సర్కారు తుమ్మలే నా కన్నం పెడుతున్నాయి. ఈళ్ళేనాకు సాయంగా ఉన్నారు. అందరివైపు చూస్తూ అన్నాడు కొండయ్య సర్కారు తుమ్మ ఇట్టె పెరుగుతుంది. మొండివి అసలు తుమ్మ కన్నా సర్కారు తుమ్మ.

ఇంతలో కొండయ్య తమ గుడిసెకేసి చూపించుండు ఉన్నంతలో శుభ్రంగా ఉంది అనుకుంది నాగమ్మ. కొండయ్య తల్లి లక్ష్మితో కల్సిపోయింది కొండయ్య చెల్లెలు మల్లీశ్వరి.

వారం పది రోజులు గడిచిపోయినై కొండయ్యకు చేతినిండా పని నాలుగు డబ్బులు పోగు చేసుకుంటుండు. ప్రాజెక్టు పని కూడా జోరుగ సాగుతుంది. ఎలక్షన్లు వస్తున్నాయని రాత్రి పగలనక పని చేస్తుండ్రు. తాగు నీరు సాగునీరు అందియ్యాల అని సర్కారోళ్ళు హుకూం జారీ చేసిండ్రట.

గుత్తేదారు కనకయ్య యాపారం బాగా సాగుతుంది "కొండయ్యా నాకేడ ఆడ చూసుకోవాలంటే బేజారుగ ఉంది. ఈడ నీవు చూసుకోనేను కొత్తగూడెం, ఖమ్మం, గోదావరిఖని కాడ నుంచి కూడా ఆర్డర్లు వస్తున్నాయి. అన్నడు నీవు కాదంటే వేరే మనిషిని మాట్లాడుకుంట సోచాయించి చెప్పు రామయ్య తాతను ఇంకా మీ వోళ్ళను అడుగు

తొందరేంలేదు. ఉగాది వరకు మనకు టైం ఉంది. ఇంక నాకు వేరే పని వుంది. అంటూ నకిరేకల్ బస్సెక్కిండు. కొండయ్య ఆలోచనలో పడిండు.

ఏందిరా బిడ్డా ఏందో బిక్కమొగమేసినవ్. మీ గుత్తేదారు ఏమన్న అన్నాడా? రామయ్య తాత కొండయ్య భుజం మీద చేయి అడిగిండు.

మాటల్లోనే రామయ్య తాత కొండయ్య గుడిసెకాడికి వచ్చిండు. లోపల శుభ్రంగా ఉంచుకున్నారు. తల్లీ పిల్లలు. ఉన్న దాంట్లోనె పొందిక ఉంది. ఏం లేదు తాత గుత్తేదారు కనకయ్యతో చెప్పినది చెప్పిండు.

దీనికోసమే గింత ఫికరు చేస్తవు. ఖుషీగనీవు ఒప్పుకో. మన పొరగాండ్లు యిద్దరు ముగ్గుర్ని నీ చేతికింద పెడ్త. వచ్చిన పని పోనియొద్దు. బేఫికరు గుండు. ధైర్యం చెప్పిండు. అప్పుడుగాని మనసు కుదుట పడ్లేదు కొండయ్యకు. వారం రోజులు గడిచినై. గుత్తేదారు కనకయ్య కొండయ్యను పిలిపించుకుందాం కొండయ్య మునుపటికన్నా రెట్టింపు ఉత్సాహంతో తుమ్మలు కొట్టి మోపులకొద్ది తమ ముందు పడేస్తున్నది గమనించి. పిల్లగాడు మంచి కష్టజీవి తన వ్యాపారానికి పనికొస్తాడు అనుకున్నాడు. గుత్తేదారు కనకయ్య. ఇద్దరి మధ్య దోస్తీ పెరిగింది. తన బొగ్గుల యాపారం బాగానే సాగుతుంది. ఏందీ కొండయ్యా నేను చెప్పింది ఏ సోచాయించినావా' అడిగిండు కనకయ్య. చెప్పండి సార్ నేనేం చేయాలో అన్నడు. నేను లారీలు రెండు కొన్న ఒకటి ఇటు లోడ్ అటు అడ్సించి ఇంకోటి గోదావరిఖని, పాల్వంచ అటు తిరుగుతది.

'నీవు ఈడ ఉండి ఈ బొగ్గులు కాల్పించి కట్టెలు మోపులు తెప్పించి వారానికి రెండు లోడ్లు కొత్తగూడెం పంపించు. నేను ఖమ్మంలో సిన్మాహాలు కట్టిస్తున్నా. నీవు లారి వెంట వచ్చి లోడ్ ఆడదింపి ఇంకో లారీలో ఈడికి వచ్చేయి. రెండు రోజులకొక ట్రిప్పు చొప్పున జరిగితే మంచి లాభం ఉంటుంది. రెండు మూడు వారాల్లో నీకు తెల్సిపోతుంది. లోడ్‌కు నీకు రెండొందలు కమీషను రోజు బత్తా దొరుకతది. ఏమంటావు? అడిగిండు కనకయ్య.

సరేసార్. పని ఎప్పుడు మొదలుపెట్టాలి. ఈ నెల 15వ తారీఖు నుండి.

ఇంక తొమ్మిది రోజులుంది. నీకిష్టమైన పనోళ్ళను పెట్టుకో వాండ్లే కట్టెలు కొట్టుకొస్తరు. నీవు ఈడ ఉండి చూస్తుండు.

'నేను కట్టెలు కొట్టకుంటె నా పొట్ట ఎట్లా గడుస్తదిసార్?'

నెల జీతమిస్త, లోడ్‌పై కమిషను, బత్తా, వ్యాపారం సాగిన కొద్ది నీకు కమిషను, జీతం పెంచుతా. కొండయ్యకు సంబరమైంది.

ఇంతలో పానగల్లు నుండి కట్టంగూరు కొత్త రోడ్డు వేస్తున్నారు. అక్కడ పెరిగిన సర్కారు తుమ్మలు కొట్టేందుకు కొండయ్యకిచ్చిన్రు. కొండయ్య రామయ్య తాత చూపించిన పిల్లగాండ్లను తన చేతికింద పెట్టుకుండు.

రామయ్య తాత చంద్రయ్య కల్సి కొండయ్య గుడిసెకు వచ్చిన్రు. రండ్రి రండ్రి అంటూ కొండయ్య తల్లి నాగమ్మ చాపేసింది. ఏంది చెల్లమ్మా మనలో మనకు మర్యాద లేందే. కొండయ్య పని బాగానే చేస్తుండని గుత్తేదారు కనకయ్య చెప్పిండు. చేతికింద ఇద్దరు పిల్లగాండ్లను కూడా పెట్టించిన కనకయ్య గుత్తేదారు మనోడ్ని బాగానే చూసుకుంటుండు. మెచ్చుకోలుగ అన్నడు చంద్రయ్య.

అంతా మీ దయ పిల్లగాడు రోజు మిమ్మల్ని తలచుకుంటూ బువ్వతింటడు.



"నాగమ్మా మా చంద్రయ్య బిడ్డ లక్ష్మిని కొండయ్యకు యిగ్యాలని అనుకుంటున్నాము. మీకు ఒప్పితేనే. మరి మీరేమంటారు. ఈడు జోడు బాగుంటుంది. లక్ష్మి కొండయ్యలు ఒకరినొకరు తెలుసుకున్నాళ్ళు ఈ పది నెల్ల నుండి నే చూస్తున్న అన్నడు రామయ్య.

'నాదేముంది అంతా ఆ భగవంతుని దయ. మీకూ పిల్లగాడికి నచ్చితెనాగ్గూడ నచ్చినట్టె. మరి నాక్కూడా ఓ ఆడపిల్ల వుంది దాన్ని కూడా ఓ అయ్య చేతిలో పెడితే నాకేంది దిగులుండదు. 'ఆ పనినే చూస్తాన్లే నాగమ్మా మల్లీశ్వరికి రెండు మూడెంట్లు ఆగుదాం. ఇంకా చిన్నపిల్లే గదా అన్నాడు రామయ్య నీ భరోసా మీద నాకు నమ్మకముందయ్య నీసాయం లేకుంటే మేము ఇంతగా ఉండే వాళ్ళమా కృతజ్ఞతా భావంతో అంది. నాగమ్మ.

ఓ మంచి రోజు చూసి పూలు పళ్ళు యిచ్చుకుందాం. కార్తీక మాసంలో పెళ్ళి చేస్తే సరి. అటు వానా కాదు చలి వుండదు. మరి యిచ్చిపుచ్చుకోడాల గురించి మాట్లాడుకుంటే బావుంటుంది. లోపాయకారిగా అన్నాడు చంద్రయ్య.

పిల్లగాన్ని అడిగి చెబుతా మీ మాట కాదంటాడా. అయినా ఈ కాలపిల్లగాండ్లను అడుగుతే మన పెద్దరికముంటుంది అంది తానూ లోపాయకారిగా నాగమ్మ.

'తెలివగలదే' అనుకున్నాడు మనసులో రామయ్య.

సరె చెల్లమ్మా వస్తాం. కొండయ్యకు చెప్పండి మేవొచ్చినామని.

కొండయ్య రాగానే రామయ్య చంద్రయ్య వచ్చినట్లు చెప్పింది. ఇంకా కొన్నాళ్ళు పోనీ ఇంకా నేను నా కాళ్ళు నిలదొక్కుకోవాలి. చెల్లమ్మ పెళ్ళి కానీ ఆ తరువాతనే చేసుకుంటాన్లే అన్నడు.

ఏదోరా ఇంటికొచ్చి పిల్లనిస్తమని అన్నోళ్ళకు కాదని ఏం చెబుదాంరా. నీకు లక్ష్మి నచ్చితే ఆపైన ఆలోచిద్దాం. 'అమ్మా! లక్ష్మి అన్నయ్య గుసగుస మాట్లాడుకుంటేనే చానాసార్లు చూసినా' అంది. మల్లీశ్వరి. 'నీ పెళ్ళి తరువాతనే మా పెళ్ళి. మొదట నీ పెళ్ళినేచేస్తా' అంటూ చెవి ముద్దుగా మెలిపెట్టిండు. అన్నా చెల్లెళ్ళ అనురాగం చూసి మురిసింది నాగమ్మ.

ఓ మంచి రోజు చూసి పూలు పండ్లు పెట్టుకున్నారు. మరి కట్నాలు కానుకలేంది అది కూడా చెబుతే బేఫికరుగా ఉంటది అన్నాడు చంద్రయ్య కొండయ్య తరఫున గుత్తేదారు కనకాలరావు ఇంకా గుర్రంపూడి నుండి కొండయ్య చిన్నాయిన, పెద్దనాయిన లొచ్చిన్రు. రామయ్య తాత శీనయ్య మేస్త్రీ చంద్రయ్య బామ్మర్ది దావతు చేసుకోవాలి తొందరగా కానీయండి అన్నారు.

మనలో మనకు కట్నాలు కానుకలేందయ్యా మీ తోడుండబట్టి మా పిల్లగాడు ఇంత కాడికి వచ్చిండు గుత్తేదారు కనకరావ్ సార్ అండదండతో తెల్విబారిండునా కొడుకు" అంది నాగమ్మ.

కట్నాలు కానుకలు లేంది పెళ్ళేంటి మామా మా కొండయ్యకు ఏం తక్కువని ఆయన కూడా చిన్న గుత్తేదారే కదా ఈడ యాపారం అంతా కొండయ్య చూసుకుంటున్నడు గదా ఇంకా పానగల్లు, కట్టంగూరు బైపాస్ రోడ్డు వెంబడి తుమ్మలు నకిరేకల్లు టేకుమట్ల కూడా సర్కారు తుమ్మ కొట్టేటందుకు పనికొప్పుకున్నాడు మా కొండన్న ముప్పై వేల, రెండు ఏటలు, గడియారం ఇంకా చెప్పు లతీఫ్ అన్నా బండి కూడా చెప్పు అన్నాడు వెంకటయ్య.

చంద్రయ్య ముఖం వెలవెలబోయింది. ఏందిది అన్నటు

రామయ్య తాతకేసి చూసిండు.

రామయ్య తాత తమాషా చూస్తుండు తడిక సందులో నుండి కొండయ్యకేసి బేలగా చూస్తుంది లక్ష్మి. నాకొక్కతే ఈ పోరి నాకున్నది రెండు గుంటల పొలం మా వూళ్ళో ఒక చవుడు మిద్దె మా తరువాత మా పిల్లకే చెందతయి గదా అంది చంద్రయ్య భార్య లక్ష్మికేసి చూస్తూ బిక్కుబిక్కుమంటున్న గుండెతో ఏందే అంత ఫికరు పడ్తావ్ నేను ఉన్నాగ మరేం దిగులు పడకు బిడ్డా అన్నాడు రామయ్యతాత.

'చంద్రన్నా నీ బిడ్డ నా బిడ్డ మనసులు కుదిరినై నీ కొక్కతే ఆడబిడ్డ నాకొక్కటే పిల్ల మన యిద్దరి సంగతి ఒకటే అందుకే, నీ పిల్ల నాకు కట్నం నా బిడ్డ నీకు కానుక. మనం రెక్కాడితే డొక్కలాడని బదుకులు ఇంకా కట్నాల కానుకలు ఏడ్పించి తెస్తాం' అంది నాగమ్మ.

మరి నీవేమంటావ్ కొండయ్యా నీ గడియారం లేదు, బండి లేదు, ఇదేం సంబంధమయ్యా ఆటపట్టించిండు లతీఫ్ సాబ్.

నారెక్కల కష్టం మీద ఇల్లు, గడియారం, బండి మా చెల్లి మల్లీశ్వరి పెళ్ళి కూడా చేస్తా ఇది. కొండయ్య జబ్బ అంటే గోలకొండ దెబ్బ తన కండలకేసి చూపిస్తూ" అన్నాడు. అబ్బో నీ కండలుంటే మా లచ్చి బంగారం తెలుసా అది నీ ఇంట్లో కాలుపెడితేనే ఇల్లంతా బంగారం అన్నాడు శీనయ్య మేస్త్రీ.



ఏరోయ్ మాకేమన్నా దావత్ ఉందా లేదా. పొద్దెక్కుతుంది. కడుపులో పేగులు అరుస్తున్నాయి.

తాంబూలాలు కానీయండి రామయ్య తాత నాగమ్మతో అనడంతో హుషారు వచ్చింది అందరూ చప్పట్లుకొట్టిండ్రు. కొండయ్య తల్లికి, చెల్లెకు కొండయ్యకు బట్టలు పెట్టిండ్రు. చంద్రయ్యకు చంద్రమ్మ లక్ష్మికి రామయ్య తాతకు కొండయ్య బట్టలు పెట్టిండు.

ఇచ్చిపుచ్చుకోవడం అయినట్టేనే ఇంగలేవండి. ఇస్తళ్ళు ఎయ్యిండ్రా. సిగ్గుపడకుండా బాగా తినండి ఇప్పటికే చాలా ఆలస్యం అయింది. పెళ్ళి పెద్దలు తొందర హడావిడితో దావతు చేసుకున్నారు. కాంట్రాక్టరు కనకాల్‌రావు కొండయ్య నేను వారానికి వస్తా ఈ లోగా ఎనిమిది లోడ్లు వేయించుకొని పాల్వంచకురా ఆడ నేను నిన్ను అందరికి పరిచయం చేస్తా. ఇక అక్కడి నుండే మన యాపారం ఈడ నీవు ఆడ నీవు అంటూ నా తరఫున ఒక మంచి గడియారం కొనుక్కో నాల్గువందల రూపాయలు కొండయ్య చేతికిచ్చాడు. కొండయ్యకు ఎంతో ఖుషీ అయి కనకాల్రావు కాళ్ళపై బడ్డాడు. లేలే పెళ్ళికొడుకా నేనేం చేశానని అంటూ దగ్గరికి తీసుకున్నాడు. అందరికి చెప్పి మోటారు సైకిలు మీదకెళ్ళి పోయిండు.

పెళ్ళి సంబంధం కుదరగానే మంచి బేరం తగిలిందని నాగమ్మ రామయ్యలు సంబరపడ్డారు. వారం రోజులు కాంట్రాక్టరు చెప్పినట్టే ఎనిమిది లోడ్లు లారీల మీద ఎక్కించి తాను పాల్వంచకు పోయిండు ఆడ కనకర్రావు లారీల లోడుచూడగానే సంతోషపడి కొండయ్యను పాల్వంచ కాడి నుండి కొత్తగూడెం పోయిండ్రు ఆడ కూడా కనకాల్రావు కొండయ్యను అందరికి పరిచయం చేశాడు. పాల్వంచకు వచ్చి తాను కట్టిస్తున్న మరో సినిమా హాలును చూపించుండు కనకాల్రావు.కొండయ్య ఖుషీగా ఉన్నాడు. కొండయ్య ఇంకా వారం రోజుల్లో సినిమా హాలు ఓపను అవుతది. చిరంజీవి వస్తడు మీ ఓళ్ళను లారీలో ఈడికి తీసుకరా అన్నడు గుత్తేదారు కనకాల్రావు.

ఇక పోతే చీకటి అయితే కష్టం అని వచ్చిన లారీలో తిరుగుమొఖం పట్టిండ్రు. దారిలో తల్లికి, చెల్లికి, లక్ష్మికి రిబ్బన్లు, గాజులు జాకిటు బట్టలు తీసుకున్నాడు. రామయ్య తాతకు, చంద్రయ్యకు రెండు కండువలు తీసుకున్నాడు. కనకర్రావు బాగా ఖుషీగా ఉన్నాడు. కమీషన్ కింద రెండు వేల రూపాయలు కొండయ్యకు యిచ్చిండు అన్న ప్రకారంగా.

సినిమా హాలు ఓపను చేసే రోజు వచ్చిందని ముందుగానే కనకాల్రావు చెప్పగానే ఒక లారీలో తన వాళ్ళందరిన్ని ఎక్కించుకొని పాల్వంచకు పోయి సినిమా హాలు సంబరం చిరంజీవితో పరిచయం కొండయ్య కనకాల్రావు చేయించే సరికి కొండంత సంబరమైంది చిరంజీవితో ఫోటో దిగిండు. చిరంజీవి మాట్లాడుతుంటే పోరగాండ్ల ఈలలు చప్పట్లు దండలు విసరేసిన్రు. కనకాల్రావు అందరికి అన్నాలు పెట్టించి ఆదరంగా పంపించుండు. గుత్తేదారు కనకాల్రావు కొండంత దేవుడు నీకు దొరికిండంటూ కనకయ్యను అందరు ఆకాశానికి ఎత్తిండ్రు.

కార్తీక మాసమొచ్చింది. పెళ్ళి ముహూర్తం కుదిరిందని కనకాల్రావుకు కొండయ్య తెలియజేసిండు. "నేను వస్తున్నా పెళ్ళి పనులు జరిపించు" అని ఫోను చేసిండు అందరూ సంబరపడుతూ వున్నదాంట్ల బంధువుల సాచ్చిగా, అమ్మోరు సాచ్చిగా ఉదయ సముద్రం సాచ్చిగా కార్తీక మాసం పంచమీ రోజున కొండయ్య లక్ష్మిని చేపట్టిండు. ఉషారుగా జోరుగా స్నేహితులు బంధువులు పెళ్ళి పిల్లను పెళ్ళికొడుకును దీవించున్రు బట్టలు పెట్టిండ్రు కొంత మంది చిన్నచిన్న కానుకలిచ్చిండ్రు.

అంతా భగవంతుని దయ అంటూ కొండయ్య తల్లి నాగమ్మ పెద్దలందరికి మొక్కింది. సంతోషంతో కాలం కరిగిపోయింది... కొత్తగూడెం నుండి కొండయ్య ఇంటికి వచ్చేసరికి అర్ధరాత్రి అయింది ఇంట్లో ఏడ్పులు అర్పులు వినబడుతున్నాయి ఒక్కసారి కొండయ్య గుండె గుబేలుమంది ఏమైందంటూ బయటి నుండే అర్చుకుంటూ వచ్చి చూసిండు తల్లిని మంచంపై పడుకోబెట్టిండ్రు రామయ్య తాత, చంద్రయ్య చుట్టుపక్కల వాళ్ళంతా జమయిండ్రు.

అమ్మకేమైంది తల్లి మంచం దగ్గరికిపోయి ఆదుర్దా, గాబరాగా చేయి పట్టుకొని ఏమైంది అమ్మా అని కొండయ్య నీవు మొన్న కొత్తగూడెం పోయినాక మీ అమ్మకు జొరమొచ్చింది. ఆర్ఎంపి డాక్టరు యిచ్చిన మందు ఇప్పించినాం. ఈ సాయంత్రమే కాలు, చేయి పడిపోయింది ఏడుస్తుంది. నా బిడ్డను పిలిపించండి. వాడ్ని చూడకుండా నే చచ్చిపోతానేమోనంటూ గగ్గోలు పెడుతుంటే నీ కంట్రాక్టరుకు ఫోన్ చేయించాం. ఆయనేమో అప్పుడే బయలుదేరిండని చెప్పిండు.

'వచ్చినావ్రా బిడ్డా నిన్ను చూడకుండానే చచ్చిపోతాననుకున్నా అంది లోగొంతుతో నాడి బలహీనంగా కొట్టుకుంటుంది. కొండయ్య బుగులు పడకు పచ్చవాతం వచ్చింది. రేపొద్దునే పెద్ద దవాఖానాకు పోదాం ఆడైతే పెద్ద డాక్టర్లు చూసి మంచి సూదులు మందులిస్తరు లేకుంటే మనకు దగ్గిర్లోనే వున్న 'కామినేని' దవాఖానాకు తీసుకపోదాం అన్నాడు రామయ్యతాత.

బిడ్డా నీ చెల్లి పెళ్ళి చేయి. నాకళ్ళముందే దాన్ని ఓ అయ్య చేతిలో పెట్టు ఇంకా కోడలను బాగా చూసుకో అంపకాలు పెడుతుంటే తల్లిని చూసి మల్లీశ్వరి కొండయ్య బోరుమన్నారు. ఊరుకో నాగమ్మ నీకిప్పుడేమైందని పిల్లలను గాబరా పెడుతున్నావు. నీవు ఫికరు పడితే పిల్లగాండ్లు పరేషాను అవుతారు అన్నాడు లతీఫ్‌సాబు. ఆ రాత్రి ఎవరి

కునుకు పట్టలేదు. టెంపో మాట్లాడుకొని కామినేని దవాఖానాకు తీసుకపోయిండ్రు. ఆడ నాగమ్మను పరీక్ష చేసి భయమక్కరలేదు వారం రోజుల్లో లేచి తిరుగుద్ది పెద్ద మనిషి కాస్త బలహీనంగా ఉంది ఇప్పుడిప్పుడే పక్షవాత లక్షణాలొస్తున్నవి ఇంజెక్షన్లుతో తగ్గిపోతుందని భరోసా ఇచ్చారా పెద్ద డాక్టర్లు. వారం రోజుల భారంగా గడిచినై ముసలమ్మ ఇంటికి తీసుకపోండని డాక్టర్లు చెప్పగానే కొంచెం గాబారా అయింది. ఏంది సార్ బేలగా పెద్ద డాక్టరును అడిగిండు కొండయ్య, ప్రాణానికి ముప్పు లేదయ్యా. కొంచెం బెడ్‌రెస్ట్ తీసుకుంటే కోలుకుంటుందని ధైర్యం చెప్పిన డాక్టరుకు చేతులుజోడించుండు!

'ఏరా కొండయ్యా నా కండ్ల ముందరే చెల్లి పెళ్ళి చెయ్యరా బాబూ. దాని పెళ్ళి చూసి నేను కళ్ళు మూస్తా' నేనూ పిల్లగాడ్నిచూస్తున్న నా చేతికింద పని చేస్తున్న గోపాలును కనుకున్నా అతడేమో వాళ్ళ తల్లితండ్రులకు చెప్పిండు. ఇయాలో రేపో నేను రామయ్యతాత చంద్రయ్య మామ పోయి సంబంధం ఖాయం చేసుక వస్తం. సరే అట్లానేగాని బిడ్డా నీవు సమజ్ చేసుకుంటే చాలు అంది నాగమ్మ.

గోపాలు సంబంధం ఖాయం చేసుకొని లగ్గం పెట్టించుకొచ్చిన కొడుకును చూసి సంబరపడింది నాగమ్మ. రెండు రోజుల్లో కోలుకుంది మంచం మీద నుండి లేచి అటు ఇటు కట్టె పట్టుకొని నడుస్తున్న తల్లిని చూసి ఊపిరి తీసుకున్నాడు కొండయ్య. కాలం తన పని తాను చేసుకుని పోతుంది. ముందస్తు ఎన్నికల కోలాహలం కాంట్రాక్టర్ కనకారావు పాలకవర్గాన్ని దగ్గరవడం వల్ల కొండయ్యకూ లాభం జరుగుతుంది.

తల్లికోరికపై మల్లీశ్వరికి గోపాలు పెళ్ళి చేసి తన బాధ్యత తీర్చుకుండు.

ఓ అర్ధరాత్రి ముసలమ్మ ప్రాణం గుటుక్కుమంది కొండయ్య దిగాలు పడిండు. రామయ్య తాత ఎంతో ఓదార్చిండు కొండయ్య ముసలి పానం ఎప్పుడో పోవాల్సిందే పండుటాకు రాలిపోవాల్సిందే. బేంబేలు పడకు నీవు బెంగపడితే పిల్లలు బిక్కముగాలు ఏసుకొని డీలా పడిపోయిండ్రు. లక్ష్మి అసలే ఒట్టి మనిషి కూడా కాదు. భగవంతుడు చల్లగా చూస్తే మీ అమ్మ లక్ష్మి కడుపులో పడుతుండవచ్చు. నీ తల్లి నీ యింట్లో కాలుపెడుతుంది. ఓదార్చారు చంద్రం లతీఫ్, పొద్దుగల్ల అందరూ కల్సి సర్కారు తుమ్మ తెచ్చి ఏడుకట్ల సవారిపై నాగమ్మను తీసుకపోతుంటే అందరు గొల్లుమన్నారు. మధ్యాహ్నమైంది. అమ్మ తుమ్మ ఒడిలోకి చేర్చి నిస్సారంగా ఇంటికి వచ్చిన కొండయ్యను ఏ విధంగా సముజాయించాలో అర్థం కాలేదు రామయ్య తాతకు. గుండెల్లో ఉన్న దిగులు పోయేటందుకు ఏడ్చిఏడ్చి పండుకున్న కొండయ్యపై జాలితో ఒళ్ళంతా నిమిరసాగిండు రామయ్య.

ఇంతలో లక్ష్మికి పిల్ల పుట్టిందని చంద్రమ్మ కొండయ్యకు రామయ్యకు చెప్పింది. వాళ్ళకు తల్లిపోయిన దుఃఖం ఒకవైపు బిడ్డపుట్టిన సంతోషం మరొక వైపు నిర్లిప్తంగా కొండయ్య చూపులు అర్థం కావడం లేదు. కొండయ్యా కొండయ్యా నీకు మళ్ళీ మీ అమ్మ ఇంట్లో కాలుపెట్టిందయ్య కొండయ్యను కుదుపులో కదిలించాడు రామయ్యతాత. ఇదంతా భగవంతుని మాయ ఒకర్ని చంపుతాడు వేరొకర్ని పుట్టిస్తాడు. నిన్న మొన్న చచ్చిన తుమ్మల పక్క నుండి వేరే పిలకలొచ్చినవి. అంతే లే లే బిడ్డను చూచివద్దాం అంటూ చంద్రయ్య గుడిసెకు కొండయ్యను రామయ్య తాత తీసుకువెళ్ళిండు.

లక్ష్మీ పొత్తిళ్ళలో అప్పుడే పుట్టిన పసికందును చూడగానే కొండయ్య సంబరపడ్డాడు. అప్పటి వరకున్న దుఃఖం కొంచెం దూరమైంది. ఆడోళ్ళు "అంతా మీ అమ్మ పోలికే" అన్నారు. పసికందును కొండయ్యకు చూపిస్తూ తల్లి గుర్తొచ్చి కళ్ళలో నీళ్ళు వచ్చినవి. మసకమసకగా పసికందు కనిపించింది గుండెల దగ్గరికి చేర్చుకున్నాడు కొండయ్య. మళ్ళీ చిగురించిన కొత్త సర్కారు తుమ్మలకేసి చూస్తూ...



---



# పొందిన ప్రతిసారీ...

**రామా చంద్రమౌళి**

నిన్ను అనువదిస్తే నేనవుతాను
అటు నిన్నూ, యిటు నన్నూ అవధులుగా సంకలీకరిస్తే ప్రపంచమౌతుంది
కళ్ళనిండా ప్రళయాలు ప్రచండిస్తున్నప్పుడు
మోకాళ్ళ నడుమ తలను దాచుకుని
నన్ను నేను తవ్వుకుంటాను
ఊటబావుల అట్టడుగు లోలోతుల్లోకి జారి జారి పోతూంటాను
లోతుల్లోకి పయనిస్తున్నకొద్దీ
దేన్నో పొందుతున్నట్టు తెలుస్తూనే ఉంటుంది
పొందిన ప్రతిసారీ కోల్పోవాలన్న ఆంతరంగిక అదృశ్య సంకల్పం
ఒక జ్వాలై దహిస్తూనే ఉంటుంది
అంతర్దహనంతోనే కదా "ఇంజన్" శక్తిసమన్వితమై
విశ్వాంతరాలను జయిస్తూ జయిస్తూ సోదాహరిస్తున్నది
అందుకే నన్ను నేను ఒక నిప్పురవ్వతో రగిలించుకుని
తపస్సించి, యోగించి గమ్యాలను నిర్వచించుకుంటాను
బూజుపట్టిన ఆకాశాన్ని
పక్షులు రెక్కలతో శుభ్రిస్తున్న దృశ్యం ఒక హిమబిందువులా
యింకిపోతుంది

హృదయంలోకి
వెంటనే గుంపులు గుంపులుగా
ఎన్ని వెలుతురు పిట్టలో - మనస్సు పిచ్చుక పిల్లలతో పులకించే ఒక గడ్డి గూడవుతుంది
ఎంత ప్రళయించుకున్నా
ఒక కొమ్మ ఓ చిగురును ప్రసవించడానికే
ఒక చేయి విస్తరించి విస్తరించి మరో చేతిని పొందడానికే
ఒక చినుకు మరో చినుకును స్నేహించి స్నేహించి
ఒక పరవశించే వర్షంగా మారడానికే
చూపులను దారులు దారులుగా పరచి
ఒక జీవితకాలం నిరీక్షించిన ఈ ప్రతీక్ష
చివరికి పతంగీదారం తెగిపోవడంతో ముగుస్తుంది పో
నిజానికి హృదయభాషలో ఒకర్నొకరు అనువదించుకున్నాక
మనిషి నుండి మరో మనిషి విడిపోవడమంటే
ఓ వర్షాన్ని కోల్పోయిన ఆకాశం ఒంటరిగా మిగలడం కాదా!

# 'మలుపు తిరిగిన రథ చక్రాలు'




**తెలంగాణాలో పోరాట అగ్ని కణాలు గర్భితంగా ఉంటూ అన్యాయాల్ని ఎదుర్కోవలసి వచ్చినపుడల్లా రగుల్కొం టున్నాయి. ఎందుకంటే బతుకు యిక్కడ ఎప్పుడూ సంఘర్షణతో రగులుతూ ఉంటుంది. ఈ సంఘర్షల్ని చిత్రిస్తూ వట్టికోట ఆళ్వారుస్వామి, దాశరథి రంగాచార్య, అల్లం రాజయ్య, సాహులాంటి రచయితలు నవలలను రాసారు. ఈ మధ్య అంపశయ్య నవీన్ కూడా 'కాలరేఖలు' అనే బృహత్ నవలను రాసారు. ఆ కోవలోనిదే సుజాతారెడ్డి యీ నవల.**

**డా. వెన్నవరం ఈదారెడ్డి**

**డా.** ముదిగంటి సుజాతారెడ్డి గారు "మలుపు తిరిగిన రథ చక్రాలు" అనే నవలను 1990లో రాసారు. ఈ నవలలో దాదాపుగా తెలంగాణాకు సంబంధించిన 1946-86 నాటి కాలం పొదగబడింది.

"తెలంగాణాకు ఏనాడు రాజకీయ ప్రతిపత్తి లేదు. తెలంగాణాకు విప్లవ ప్రతిపత్తి ఉంది. ఉద్యమ ప్రతిపత్తి ఉంది". అన్నవి దాశరథి రంగాచార్య ఈ నవలకు రాసిన ముందుమాటలోని మొదటి వాక్యాలు ఇవి అక్షర సత్యాలు.

తెలంగాణాలో పోరాట అగ్ని కణాలు గర్భితంగా ఉంటూ అన్యాయాల్ని ఎదుర్కోవలసి వచ్చినపుడల్లా రగుల్కొం టున్నాయి. ఎందుకంటే బతుకు యిక్కడ ఎప్పుడూ సంఘర్షణతో రగులుతూ ఉంటుంది. ఈ సంఘర్షల్ని చిత్రిస్తూ వట్టికోట ఆళ్వారుస్వామి, దాశరథి రంగాచార్య, అల్లం రాజయ్య, సాహులాంటి రచయితలు నవలలను రాసారు. ఈ మధ్య అంపశయ్య నవీన్ కూడా 'కాలరేఖలు' అనే బృహత్ నవలను రాసారు. ఆ కోవలోనిదే సుజాతారెడ్డి యీ నవల.

తెలంగాణాలోని ప్రజల బతుకులకు ఊపిరులూదడానికి జగన్నాథ రథచక్రాలు ఎప్పుడూ తిరుగుతూనే ఉంటాయి. మలుపులు తిరుగుతూ మరో ప్రపంచంవైపు మహా ప్రస్థానం చేస్తూనే ఉంటాయి.

భారతదేశంలో ఆంగ్లేయుల వలస పాలనకు వ్యతిరేకంగా ప్రజాస్వామ్య పోరాటం జరుగుతున్న కాలంలో, తెలంగాణాలో నిజాం పాలనకు వ్యతిరేకంగా కమ్యూనిస్టు నేతృత్వంలో సాయుధ పోరాటం జరిగింది. నిజాం పాలనలో మాత్రమే తమ అరాచకాలకు ఆలంబన దొరుకుతుందని దేశ్‌ముఖ్‌లు, జమిందార్లు, పెట్టుబడిదారులు,పటేల్ పట్వారీల వ్యవస్థలు బలాన్ని పుంజుకున్నాయి. నిజాంను వ్యతిరేకించే కమ్యూనిస్టులు వీరందరితో పోరాటాలు చేశారు. వీరి పోరాట ఫలితంగా 17-9-1948 నాడు హైదరాబాద్ రాష్ట్రం ఇండియన్ యూనియన్‌లో లీనమయింది. వలస పాలన పోయింది. నిజాం పాలన పోయింది. ప్రజాస్వామ్యం ఏర్పడింది. ఈ ప్రజాస్వామ్య ప్రభుత్వం ప్రజల భుక్తి సమస్యను భూసమస్యను పరిష్కరించ లేకపోవడంవల్ల కమ్యూనిస్టులు సాయుధ పోరాటం సాగించారు. ఇప్పుడు ప్రభుత్వంతో చర్చలకు కూడా పీపుల్స్‌వార్ వాదులు ప్రయత్నిస్తున్నారు. ఈ పోరాట నేపథ్యం నుండి సుజాతారెడ్డి ఈ నవలను రాసారు.

వలసవాదం నుండి ఇప్పటి విప్లవ వార్ వాదం వరకు సాగుతున్న పోరాటరంగానికి ఈ నవలలోని ప్రధాన నాయకుడు రమేష్ ప్రతినిధి. ఈ కాలాలలో మొగ్గదొడిగి, పుష్పించి, ఫలించిన ప్రజాస్వామ్య భావజాలానికి ప్రతినిధి సరళ పాత్ర.

వలసవాదం నుండి స్వాతంత్ర్యం వచ్చే నాటికి ఒక మలుపు. 17-9-48 నాడు నిజాం లొంగుబాటుతో రెండోమలుపు 1952 నాటి మొదటి సార్వత్రికల ఎన్నికలతో మూడో మలుపు 1956 నాటి రెండో సార్వత్రి ఎన్నికలతో నాలుగో మలుపు, 1961 నాడ జరిగిన ఎన్నికలతో అయిదో మలుపు (దాస ఓటమి వరకు). ఇలాంటి మలుపుల్లో కూడ బీద ప్రజలకు స్వాతంత్ర్య ఫలాలు అందలేదని ఆర్థిక దోపిడి ఆగలేదని, సమసమాజం సాధిం వరకు అడవి మార్గం పోరాట మార్గం వదలద నవలలో రమేష్ భావించాడు.

వలసవాదాన్ని తిరస్కరించి ప్రజాస్వామ్య దృష్టి బలపడుతుందని ప్రజాస్వామ్య ప్రభుత్వాలవల్ల దోపిడీ వ్యవస్థ రూపుమాపొచ్చునన్నది సరళ దృక్పథం.

ఈ రెండు మార్గాలను, ఈ రెండ పాత్రల ద్వారా ప్రేమతో కూడి మానవీయాంశాలతో కథను నడుపుత సుజాతారెడ్డి 'సరళ' అనే అద్భుతమైన పాత్ర సృష్టించారు.

సాధారణంగా ఇలాంటి నవల పోరాటంశాలు, వాదాల చర్చలు, ప్రపం విప్లవాల తీరు, సమాజంలోని అసమానత తీరు, వాటి తీవ్రతను వర్ణిస్తూ పాఠకుల ఉద్రేకాలను పెంచి, వివేచించుకునే సమయాని ఇవ్వకుండా సామాజిక చైతన్యాన్ని, విప్ల చైతన్యాన్ని కలిగిస్తున్నామంటూ నిబం రచయితలు భావిస్తుంటారు. అలాంటి వృథ శ్రమను సుజాతారెడ్డి ఈ నవలలో చేయలేద అల్పపదాలతో అనల్పార్థాన్ని సాధించడం కవిత శిల్పానికి ఎంత అవసరమో, చలం చెప్పినట ఎకానమీ ఆఫ్ వర్డ్స్ సాహిత్యానికెం అవసరమో, నవలా సాహిత్యానికి కూడ హృదయానికి తెలిసే భాషతో, మనస్సుకు అం కథతో, చేతికి చిక్కిన పాత్రలతో క్లుప్తంగా జీవి భాష్యాన్ని అందించే శిల్పాన్ని ఎన్నుకొన్నారు.

సుజాతారెడ్డి తన మలిమాటలో త నవలా శిల్పాన్ని గురించి యిలా చెప్పారు. "ఈ నవలలో సరళ పాత్ర ప్రజాస్వామిక విలువల ప్రతీక. దోపిడీ దౌర్జన్యపరుడై విలాసపురుషుడైన దేశముఖు రంగారావు సరళను కట్టబెట్టాలనడం, తర్వాత ఆమె అవినీతిపరుడైన దాసుతో పెళ్ళి కావడ ప్రజాస్వామ్య విలువలకు జరిగే హా సూచింపబడింది. విప్లవ వీరుడు రమే సరళమనుమరాలు బేబిని చేరదీయడం అత ప్రజాస్వామ్యంవైపు ప్రజల్లోకి రావడానికి ప్రతీ అదే రథ చక్రాలు మలుపు తిరగడం!" ఇల సుజాతారెడ్డి ప్రజాస్వామ్య దృక్పథ క్రమ పరిణామాన్ని మానవీకరించి నవలీకరించడ సామాన్య విషయమేమీ కాదు. ఈ రెండ పాత్రల నిర్వహణ సంప్రదాయ విమర్శ

సాహిత్యంలో కన్పించే రెండు విరుద్ధ రసాలను జమిలిగా పోషించటంలోని కష్టం యిందులో కన్పిస్తుంది.

ఈ నవల బతుకమ్మ పండుగతో ప్రారంభమవుతుంది. సరళలోని ఆర్ద్రమైన గుణం, ఇతరుల కష్టాల్లో పాలుపంచుకునే గుణాన్ని ఈ బతుకమ్మ పండుగ ద్వారానే రచయిత్రి ఆవిష్కరించి బతుకమ్మలను పేర్చటంతో ప్రారంభమై పాటలతో బతుకమ్మలను అర్చించి జలదేవతకు సమర్పించటంతో ముగుస్తుంది. బతుకమ్మ లాంటి సరళ జీవితము ఈ నవలలో బతుకమ్మ పండుగతో ప్రారంభమై ఆమె మృత్యువుతో ముగుస్తుంది. నవల సృష్టి స్థితిలయలో సరళ జీవన రాగం విన్పిస్తుంది. భావకవిత్వం అభ్యుదయ కవిత్వాన్ని అనుసరించినట్లు సరళ రమేష్‌ను అనుసరించింది.

ఇలాంటి బతుకమ్మ పండుగ రామచంద్రరావు ఊరు ఇందుర్లో జరిగింది. రజాకార్లు పోలీసోళ్ళ సహకారంతో ఇందూరు స్త్రీలపై ఉన్న బంగారాన్ని దోచుకోవడానికి కుట్ర పన్నాడు. దానికి రామచంద్రరావు సహకారమున్నది. ఆ నెపాన్ని రమేష్ దళంపై వేసి ప్రజల్లో సంగపోల్ల ఎడల చెడు అభిప్రాయాన్ని కల్గించటానికి పూనుకుంటాడు. రాంచంద్రరావు దొర యొక్క ఈ మోసాన్ని గ్రహించి రమేష్ దళం పోలీసులతో రజాకార్లతో పోరాడి స్త్రీల ఆభరణాలను కాపాడారు. ఆ కొట్లాటలో రమేష్ గాయపడి మొక్కజొన్న చేనులో స్పృహతప్పి పడిపోయాడు. ఆ సందర్భంలో సరళ తన దాసి కస్తూరి సాయంతో గడిలోనికి రమేష్‌ను తీసుకొచ్చిప్రాణాలు కాపాడింది. అంతకుముందే పేపర్ల ద్వారా రమేష్ ఉద్యమాన్ని తెలుసుకొన్న సరళ అతని రూపాన్ని, లక్ష్యాన్ని ప్రేమించింది. మనస్సు అతనితో పెనవేసుకొనిపోయింది.

గడిలో నడిచే అరాచకాలు ఆనాటి నైజాం రాజ్యంలో జరిగే అకృత్యాలకు నమూన. రామచంద్రరావు పట్నం నుండి తీసుకొచ్చిన పహిల్వానులతో రైతులను చంపుతూ, హింసిస్తూంటాడు. సాధారణంగా వర్గ దృష్టితో చూస్తే రామచంద్రరావు యింట్లో వున్న వాళ్ళందరికి బూర్జువా మనస్తత్వం ఉండాలి. కాని అలాలేదు. భర్త రాంచంద్రరావు అకృత్యాలూ కొడుకు మనస్తత్వాన్ని సహించలేదు. హెచ్చరించినా వారీ మనస్తత్వాలు మారలేదు. ఇక సరళ మనస్తత్వం సోషలిస్టు మనస్తత్వమే. ఇలా వీరి కుటుంబంలోని వ్యక్తుల చైతన్యధార కూడా నవలలోని రథ చక్రాల

**ఈ నవల బతుకమ్మ పండుగతో ప్రారంభమవుతుంది. సరళలోని ఆర్ద్రమైన గుణం, ఇతరుల కష్టాల్లో పాలుపంచుకునే గుణాన్ని ఈ బతుకమ్మ పండుగ ద్వారానే రచయిత్రి ఆవిష్కరించి బతుకమ్మలను పేర్చటంతో ప్రారంభమై పాటలతో బతుకమ్మలను అర్చించి జలదేవతకు సమర్పించటంతో ముగుస్తుంది. బతుకమ్మ లాంటి సరళ జీవితము ఈ నవలలో బతుకమ్మ పండుగతో ప్రారంభమై ఆమె మృత్యువుతో ముగుస్తుంది. నవల సృష్టి స్థితిలయలో సరళ జీవన రాగం విన్పిస్తుంది.**

మలుపుల వలనే మలుపులు తిరిగింది.

ఈ నవలలోని పురుష పాత్రలు (రమేష్-ప్రభాకర్-లుకాక్) బూర్జువా వర్గ మనస్తత్వానికి చెందినవే. రాంచంద్రరావు, రంగారావు, దాను పాత్రలు ఇందుకు నమూనాలు.

బూర్జువా వర్గం సోషలిస్టు వర్గంపై దాడి చేయడం లాంటిదే రమేష్‌ను, ప్రభాకర్‌ను, సరళను, కస్తూరిని దొరలు హింసించడం.

ఆనాడు ప్రజల్లో సామాజిక చైతన్యాన్ని కల్గించటానికి గ్రంథాలయోద్యమం బాగా పని చేసింది. ఈ గ్రంథాలయోద్యమానికి ప్రతినిధిగా రచయిత్రి ప్రభాకర్ పాత్రను చిత్రించింది. ఆనాడు గ్రంథాలయాలు వర్గాన్ని సోషలిస్టు భావాలవైపు మార్చిన సంఘటనలు బాగా కనపడతాయి. ఆనాడు కమ్యూనిస్టు నాయకులు దాదాపుగా భూస్వామ్య వర్గానికి చెందినప్పటికి కార్మిక, కర్షక పక్షపాతులుగా మమేకం కావడం కనిపిస్తుంది. ఈ క్రమంలో సరళ కస్తూరీల స్నేహం కనిపిస్తుంది. ఆడబాప అయినా కస్తూరిని సరళ స్నేహితురాలిగా, ఆత్మబంధువుగా ప్రేమించింది. కస్తూరి ప్రభాకర్‌ల పెళ్ళి కూడా కొత్తతరం ఆవిర్భవిస్తున్న దనడానికి గుర్తుగా భావించాలి. సరళ రమేష్‌ను ప్రేమించి, తనను భార్యగా స్వీకరించమని కోరడంలో స్త్రీ పురుష వైవాహిక సంబంధాల్లో వస్తున్న మార్పుల్ని గమనించవచ్చు. ప్రభాకర్ గ్రంథాలయ నిర్వహణ, రాత్రి పాఠశాల నిర్వహణ రామచంద్రరావు దొరకు నచ్చదు.

బూర్జువా వర్గం శ్రామిక వర్గాన్ని బాధించడమే కాదు, వాళ్ళకు తెలియకుండా తమ వర్గం వారికి కూడా అపకారం తలపెడతారు. అందుకే రాంచంద్రరావు దొర మనస్తత్వంవల్ల సరళ కష్టాలను ఎదుర్కొంది. అన్నారం దేశ్‌ముఖ్ రంగారావు తన క్రూర పురుషాహంకారంతో తన భార్యను శవంగా మార్చేసి విషాదానికి గురి చేశాడు. అలాంటి వానికి తన కూతురైన సరళను యిచ్చి రామచంద్రరావు దొర పెళ్ళి చేయటానికి పూనుకొంటాడు. ఈ పెళ్ళి సరళకు, ఆమె తల్లికి యిష్టంలేదు. ఈ సంగతి తెలుసుకొన్న రమేష్ దళం రంగారావును కాస్త ముందుగా చంపేసింది.

రంగారావు చనిపోయిన తర్వాత సరళ తనను స్వీకరించమని రమేష్‌ను వేడుకొంది. కాని రమేష్ ఒప్పుకోడు. ఈ సంఘటనలో మనకు అనేక విషయాలు తెల్సివస్తాయి. ప్రజాస్వామ్యాన్ని భంగపరిచే వ్యక్తులను, సంగపోల్లవర్గ దృక్పథం నిర్మూలిస్తున్నది కాని, ప్రజాస్వామ్యాన్ని ఆహ్వానించలేక పోతున్నది. ఏ విప్లవ ఉద్యమానికైనా, ఏ ప్రగతిశీల కార్యక్రమానికైనా మహిళల అండదండలు అవసరం అన్న విషయంలో రమేష్‌కు స్థిరమైన అభిప్రాయ మున్నట్లు కనబడదు. లేకుంటే భూస్వామ్య కుటుంబ స్త్రీలు కఠోరమైన సంఘ నియమాలను అనుసరించ లేకపోతారనే భావంతో సరళను గ్రహించలేక పోయి వుండవచ్చు. సరళను పెళ్ళాడి తన వ్యక్తిగత సుఖాలకు ప్రాధాన్యతనిస్తే సంఘ కార్యక్రమ నిర్వహణకు భంగం కలుగుతుందన్న భావంతో స్వీకరించి యుండకపోవచ్చు. సరళను స్వీకరింపచేసి కథను మరోలా నిర్వహించవచ్చు. కాని రచయిత్రి ఉద్దేశంలో సరళ ప్రజాస్వామ్యానికి ప్రతినిధి. వర్గ దృక్పథంతో కూడిన విప్లవ మార్గంతో ప్రజాస్వామ్య దృక్పథం జతకట్టలేదన్న దృష్టితో వారిద్దరిని ఒకటిగా చేయుగా సమానంతరంగా కథను నడిపారు.

ప్రజాస్వామ్య వ్యవస్థ సోషలిస్టు సమాజాన్ని నిర్మిస్తుందన్న అభిప్రాయంతో విప్లవ పార్టీలు ఏకీభవించవు. అందుకే విప్లవానికి ప్రతినిధి అయిన రమేష్ సరళను గ్రహించలేదన్నది రచయిత్రి కథా నిర్వహణాధ్వని. అయితే రమేష్ మనస్సు ఈ రెండు దృక్పథాల మధ్య తీవ్ర సంఘర్షణకు గురైంది అనటానికి సరళ అలౌకిక సౌందర్యం, ప్రేమ దృష్టి, నిస్వార్థ సేవాదృక్పథాన్ని కాదనలేకపోయాడు. తనలో వున్న సిద్ధాంత నిబద్ధ కర్కశదృష్టిని కూడా కాదనలేకపోయాడు. అయితే చివరికి విప్లవ మార్గంలోనే సాగిపోయాడు. మనసొక చోట, మార్గమింకొకచోటులా ద్వైధీ ప్రవృత్తితో రమేష్

మనస్తత్వం సాగిపోయింది.

ఇందూర్‌లో సరళ తండ్రి రాంచంద్రరావు దొరను, అన్న మహేంద్రను రమేష్ దళం చంపేసింది. గడినంతా ప్రజలు దోచుకున్నారు. ఈ సమయంలో రమేష్ సరళను ఆమె తల్లిని హైదరాబాద్‌కు పంపించాడు. అక్కడ ప్రభాకర్ సహాయంతో సురక్షితంగా వుండే విధంగా చూసాడు. తన తండ్రిని, అన్నను రమేష్ దళం చంపిందని తెలుసుకొన్న సరళ చాలా సంయమనంతో ఈ విధంగా విషయాన్ని అన్వయించుకున్నది "అవును కొన్ని వందల ఏండ్లుగా బానిసత్వంలో మగ్గిన ప్రజల హాహాకారం తన తండ్రిని, అన్నను బలితీసుకుంది" అని భావించింది.

వట్నంలో సరళ ఏకాంత జీవితాన్ని గడువుతూండగా తల్లి చనిపోయింది. తన అన్నల దగ్గరి నుండి ఎలాంటి సహాయం అందలేదు. తనను రమేష్ గ్రహించే స్థితిలో కూడా లేదు. అందుకే ఈ నవలలో విలన్ పాత్రకు ప్రతీక అయిన దాసుకు చిక్కకతప్పలేదు. ఇక్కడ కథ మరో మలుపు తిరిగింది. విప్లవ పార్టీలు సహకరించని కారణంగా ప్రజాస్వామ్యం బతికి బట్టకట్టలేని దశలోసమాజంలోని అరాచశక్తుల చేతిలో పడిపోతుంది. అందుకే సరళ దాసు చేతిలోకి వెళ్ళిపోయింది.

ఈ దాసు పాత్రను రచయిత్రి దొరగడిలో ఆడబాపలకు జరిగే అన్యాయాలకు ప్రతిరూపంగా చిత్రించారు. సరళ తండ్రి చెల్లెలు భర్త ప్రతాప్‌వల్ల మాలతి అనే ఆడబాపకు పుట్టిన వాడు ఈ దాసు. తర్వాత ఈ మాలతిని కొడుకుతో సహా కిష్టయ్య పట్నానికి తీసుకొని వెళ్ళాడు ఇలాంటి వాతావరణంలో దాసు పెరిగాడు. ఈ దాసు సరళ తనమామ కూతురు, తనకు దేవుడిచ్చిన భార్య అని భావించాడు.

ఈ పాత్రను మనో విశ్లేషణా సిద్ధాంతంతో విశ్లేషించే అవకాశం ఉంది. దాసు సుప్త చైతన్యంలో తన తల్లిని అనుభవించిన వాన్ని, తన పుట్టుకకు కారణమైన వాని కుటుంబానికి చెందిన స్త్రీలను అనుభవించాలనే దుష్టమైన కోరిక వానిలో కలిగింది. దానికి సరళ సాధనంగా భావించి, ఆమెకు యిష్టంలేకున్నా, పెళ్ళి చేసుకొని అనుభవించాడు. తత్ఫలితంగా సరళకు ఆశాలత అనే కూతురు పుట్టింది.

దాసుకు దొరల మీద ద్వేషం జీర్ణించి వుంది. అతని ద్వేషం ఇంటెలెక్చువల్ గాక ఎమోషనల్ కూడా. అతనిలో దొరల మీది ద్వేషం అనాది నుండి సమాజంలో అణగద్రొక్కిన జాతిపై ప్రతీకారం తీర్చుకునే మనస్తత్వం వుంది.

............ ☆ ............

**వట్నంలో సరళ ఏకాంత జీవితాన్ని గడువుతూండగా తల్లి చనిపోయింది. తన అన్నల దగ్గరి నుండి ఎలాంటి సహాయం అందలేదు. తనను రమేష్ గ్రహించే స్థితిలో కూడా లేదు. అందుకే ఈ నవలలో విలన్ పాత్రకు ప్రతీక అయిన దాసుకు చిక్కకతప్పలేదు. ఇక్కడ కథ మరో మలుపు తిరిగింది. విప్లవ పార్టీలు సహకరించని కారణంగా ప్రజాస్వామ్యం బతికి బట్టకట్టలేని దశలోసమాజంలోని అరాచశక్తుల చేతిలో పడిపోతుంది. అందుకే సరళ దాసు చేతిలోకి వెళ్ళిపోయింది.**

............ ☆ ............

అది దొరల జాతికి చెందిన స్త్రీలను అనుభవించాలనే కోరికగా మారింది. ఆ Instinct అతనిలో బలీయంగా పని చేసింది. అందుకే సరళను అనుభవించాలని పెళ్ళాడాడు గాని ప్రేమతోగాదు. ఇలాంటి ప్రతీకారం సాడిస్ట్ ఆనందం అతని ఆంతర్యంలో వుంది. మనోవిశ్లేషణతో కూడిన నవలల్లో ఈ విషయాన్ని రచయిత వాచ్యంగానో, ధ్వని రూపంగానో చెప్తాడు. చలం 'బ్రాహ్మణీకం' నవలలో గవళ్ళ రామయ్య పాత్ర యిలాంటిదే.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత పార్టీలో ముఖ్యంగా కాంగ్రెస్ పార్టీలో స్వార్థపరశక్తులు, వ్యక్తిత్వంలేని వ్యక్తులు ప్రవేశించి ఎలా గెలుస్తూ ఓడిపోయాయో తెల్పడానికి సృష్టించబడ్డ పాత్ర దాసుపాత్ర. పార్టీలోని స్వార్థపరశక్తులు ఎలా ప్రజాస్వామ్యాన్ని భ్రష్టు పరుస్తున్నాయో తెల్పడానికి దాసు పెళ్ళి పేరు మీద సరళను లొంగదీసుకోవడంలో తెలుస్తుంది. ప్రజాస్వామ్య వ్యవస్థలో నిజమైన సోషలిస్టు నాయకులు రాక, వారు విప్లవ మార్గంలో ప్రయాణించటంవల్ల ఎన్నికలు బూటకపు మార్గంలో నడిచే ప్రమాదం ఏర్పడింది. ఎన్నికలు బూటకం, ప్రజాస్వామ్యము ఓ ఫార్సు అని విప్లవ వర్గాలు అనడం, అలాంటి నిజాయితీపరులు ఈ ప్రజాస్వామ్య వ్యవస్థలోనికి రాకపోవడంవల్ల వచ్చిన పరిణామమే కాని అన్యం కాదని గ్రహించాలి. ఈ విషయం సరళ పాత్ర ద్వారా తెల్పివస్తుంది. ఈ విషయాన్ని సరళలో వచ్చిన చైతన్యం గుర్తించింది.

ఆధునిక యుగ చైతన్యాన్ని ప్రోగు చేయటానికి సహకరించిన గ్రంథాలయోద్యమ సంస్కారం కూడా ఈ విప్లవ వర్గ చైతన్యాన్ని ఆహ్వానించలేకపోయిందనడానికి ప్రభాకర్ రమేష్‌ను విమర్శించిన ఈ మాటలు నిదర్శనాలు. "ఉద్యమం! ఉద్యమం! -ఇంకాన్నెళ్ళాళ్ళు ఈ పోలీసులు మిలటరీ వారు వెంటాడే భయంకర జీవితం నువ్వు నీ పోరాటం ప్రజల కోసం! అంటున్నావు. ప్రజలకు న్యాయం జరిగేదాకా నీ పోరాటాన్ని ఆపనంటున్నావు. నిజమే కానీ – రక్తపాతంతో కూడిన నీ ఉద్యమాన్ని పోరాటాన్ని ఆ ప్రజలు కూడా ఎంత కాలం భరిస్తారు. ఎవరికీ సుఖశాంతులీయని ఆ మార్గాన్ని ప్రజలు ఎంతకాలం సమర్థిస్తారు? అని రమేష్‌ను ప్రశ్నించాడు. (పు. 148). అప్పుడు ప్రభాకర్‌తో రమేష్ "ప్రభాకర్! కొందరి చేతుల్లో మాత్రమే ఆస్తులు, అధికారాలున్నంత వరకు నా ఉద్యమం ఆగదు. ప్రజానీకం మీద దౌర్జన్యాలు ఆగిపోయిననాడే నా పోరాటం ఆగిపోతుంది. వర్గ భేదం సమాజంలో నశించిననాడే నా దీక్ష పూర్తవుతుంది." అని అన్నాడు. "అయితే ఇప్పుడు సరళ దాసును పెళ్ళాడక తప్పదన్న మాట! నీ కామ్రేడ్స్! నీ ఉద్యమం ఇదేనా నీక్కావల్సిందీ సరళ ఇప్పుడు ఏమైనా నీకు పట్టలేదన్న మాట!" అని అంటాడు. ఈ మాటలు దాసుతో సరళకు పెళ్ళికాని సమయంలో అన్న మాటలు. అంటే ప్రజాస్వామ్యాన్ని కుహనా స్వేచ్ఛావాదుల చేతుల్లో వుంచాలా అని ప్రభాకర్ రూపంలో మేధావులు విప్లవ వాదులను హెచ్చరించినట్లు ధ్వనిస్తుంది.

దాసు సరళను పెళ్ళాడి సాడిస్ట్ మనస్తత్వంతో అనుభవించినా, ఆమె మనస్సులో నిండుగా రమేష్ నిండి వున్నాడు. రమేష్ రూపు చైతన్యం ఆమె మనస్సును ఆక్రమించినవి. దాసుతో కాపురం చేస్తున్నా రమేష్‌నే మనస్సులో నింపుకున్న కారణంగా ఆశాలత పుట్టింది. సంతానంపై మనస్సు యొక్క ప్రభావమే అధికంగా వుంటుందని spiritualist భావిస్తారు. మాయాప్రవరుని చేత వరూధిని స్వరోచిని కన్నట్టుగా సరళ ఆశాలతను కన్నది.

ఆశాలత పెళ్ళి చేసుకొని కుమార్‌తో అమెరికా వెళ్ళిపోయింది. మేధావులు అమెరికాకు వలస పోతుంటే మాతృభూమి విలపించినట్లుగా సరళ బాధపడింది.

ఆశాలత భర్తతో, కూతురు బేబీతో తిరిగి ఇండియాకు వచ్చి సరళతో ఉండిపోయింది. తమ కూతురు బేబీని అచ్చం సరళను పోలినటువంటి అమ్మాయిని తల్లిదగ్గరనే ఉంచి ఆశాలత – కుమార్‌లు విమానంలో అమెరికా పోతున్నప్పుడు ప్రమాదం సంభవించి చనిపోయారు. వాళ్ళ మనస్తత్వం సరళ ప్రవృత్తితో కలియనందున వా

# రుదైన రచయిత
# సొదుం జయరాం



ముప్పయ్యేళ్ళకే తెలుగునాట ప్రసిద్ధ థకునిగా గుర్తింపు తెచ్చుకున్న సొదుం యరాం అక్టోబరు 30న కన్నుమూశారు. దుం జయరాం వయస్సు డెబ్బయ్యేళ్లు. భార్య, ంగ్గురు కుమార్తెలు వున్నారు. కడపజిల్లా లాపురం తాలూకా ఉరుదూరు వాస్తవ్యుడైన యరాంకు 'వాడిన మల్లెలు', 'సింహాద్రి స్వీట్ ం' విశేషమైన కీర్తిని తెచ్చిపెట్టాయి.

ఆయన కుటుంబానికి తీయోద్యమంతోనూ, వామపక్ష ఉద్యమంతోనూ సంబంధముంది. ఆయన అన్నయ్య గోవిందరెడ్డి మంచి చదువరి కాగా తమ్ముడు రామ్మోహన్ కూడా విమర్శకుడుగా, పాత్రికేయుడుగా సుపరిచితులు. రాచమల్లు రామచంద్రారెడ్డి ఆత్మీయుడుగా 'సంవేదన' పత్రిక నిర్వహణలో ఆయన పాలుపంచుకున్నారు. సాహిత్యంతోనే ఆగక విస్తారమైన అధ్యయనం చేశారు. తమ గ్రామ సర్పంచిగానూ బాధ్యతలు నిర్వహించారు.

మధ్యతరగతి కుటుంబాలకు జయరాం కథలు షాక్ ట్రీట్‌మెంట్ వంటివని రారా వ్యాఖ్యానించారు. మధ్యతరగతి మనుషులకు ఉన్న భ్రమల్ని జయరాం కథలు పటాపంచలు చేస్తాయని కొడవటిగంటి కుటుంబరావు వ్యాఖ్య. పాతికేళ్ళకు పైగా కథా సేద్యాన్ని వదిలిపెట్టిన ఆయన తిరిగి 1996 నుంచి కథలు రాయడం మొదలు పెట్టారు. ఈ సందర్భంగా ఆయనకు చిరకాల మిత్రులు, ప్రముఖ రచయిత కేతు విశ్వనాథరెడ్డి ప్రస్థానంతో ఇలా అన్నారు:

"సొదుం జయరాం అరుదుగా రాసిన అరుదైన రచయిత. తన చుట్టూ ఉండే జీవితం గట్టిగా కుదిపినప్పుడే కథలు రాశాడు. నలభై ఏళ్ళకు పైబడిన రచనా జీవితంలో రాసిన కథలు ఒక యభైకి మించి ఒకటోరెండో. అగమ్యం అనే ఒక నవల/పెద్దకథ రాశాడు. చాలా మంది రచయితలకు అయోమయంగా కన్పించే జీవితాన్నీ జీవన చలన సూత్రాలనూ జయరాం స్పష్టంగా పరిశీలించాడు. అందుకు అతని జీవితానుభవాలూ, మార్క్సిజం అవగాహనతో వెలువడిన రచనలూ, విమర్శలూ, వాటి నుంచీ ఏర్పడిన ప్రాపంచిక దృక్పథమూ దోహదపడ్డాయి. 2001లో పీడకల అనే కథను జయరాం రాశాడు. ఆ కథలో కోమాలోకి వెళ్ళిన ఒక సన్నకారు రైతుకు కలవస్తుంది. తనను తీసుకవెళ్ళడానికి వచ్చిన యమభటుల 'జీవితం మీద విరక్తి ఎందుకు?' అనే ప్రశ్న వేస్తారు. అప్పుడు ఆ సన్నకారు రైతు అంటాడు. "జీవిత పోరాట స్వేచ్ఛ బలహీనులకూ, పీడితులకూ ఉండదు. వాళ్ళు కష్టాన్ని నమ్ముకున్నా ఫలం దక్కే అవకాశాలు లేవు. ఈ అంతస్సూత్రమే జయరాం రచనలన్నిటిలో కన్పిస్తుంది. రచనలో అచంచలమైన సామాజిక దృష్టి, నిష్కపటమైన చిత్తశుద్ధి, కథా నిర్మాణంలో సౌష్టవమైన శిల్ప దృష్టీ ఉండే రచయిత సొదుం జయరాం. అతనివి వ్యథాభరితమైన అచ్చమైన తెలుగు జీవిత కథలు. మనసును కుదిపే కథలు. మంచి బతుకుల కోసం ఆలోచింపచేసే కథలు" ❖

---

యోజనం ఏమీ లేదని రచయిత్రి భావించి నుంచి వారిని తప్పించి వేసింది.

ఈ సమయంలో కస్తూరి కాపురం ళను ఆకర్షించింది. కస్తూరి సంతానం ళను తల్లిలా సంభావించారు. కస్తూరి భర్త భాకర్‌కు సరళ మీద అభిమానం క్రమంగా రుగుతూ వచ్చింది. ప్రజాస్వామ్యాన్ని ంటిపెట్టుకున్న కుటుంబాలు సంతోషంగా భివృద్ధి చెందుతున్నవనే విషయం కూడా వల్ల తెలిసివస్తుంది.

సరళకు అవసానకాలం దగ్గరికి చ్చింది. తన మనస్సులో ఆరాధిస్తున్న రమేష్‌ను ాడాలని ప్రభాకర్‌కు చెప్పింది. ఎక్కడో ్యరులో వున్న రమేష్ ప్రభాకర్ అందించిన ్రమానంతో సరళను చూడటానికి రువేషంలో వచ్చాడు. ఇక్కడ ప్రజాస్వామ్యం ప్లవ వాదాలు సరళ – రమేష్‌ల రూపాల్లో ట్లాడుతున్నట్లు రచయిత్రి చిత్రించారు.

"సరళా! నువ్వు పిలిస్తే నేనురానా! ప్పుడైనా రాలేదా? చెప్పు" అని రమేష్ న్నాడు. (పే.181)

"ఇన్నాళ్ళు నేను –నీతో–వస్తా–నన్నప్పుడల్లా – ఏదో వంకబెట్టి – నన్ను నీ వెంబడి – రానియ్యలేదు. ఇప్పుడు – నేను – నీకు దూరంగా వెళ్ళిపోతున్న – ఇక – నిన్ను – నేను కష్టపెట్టను" అంది సరళ.

"అతని స్పర్శ ఆమె అంతరాళంలో ఎంతో శాంతిని నింపినట్లు అనుభవం పొందింది".

రమేష్ చేతిలో బేబిని వుంచి యిక నుంచి ఆ పాప భారం అతనిదే అంది. కస్తూరి – ప్రభాకర్‌లకు బేబీని ఒప్పగిస్తే అది తమ అదృష్టంగా స్వీకరించేవారు. కాని రచయిత్రి అలా చిత్రించలేదు. రమేష్ చేతులకే బేబీని అప్పగింపచేసింది. "రోజుకొక చోటు, పూటకొక ఇంట్లో వుండే తాను బేబీని పెంచెదెట్లా" అని రమేష్ ఆలోచించాడు. సరళ మృత్యుముఖంలోకి వెళ్ళిపోయింది. బేబీని రమేష్ కౌగిలించుకున్నప్పుడు బేబీయే తనకాధారమన్న జ్ఞానం కల్గింది. "చివరికి నవోదయానికి నాందీ జరిగింది. సరళ చిరకాల వాంఛ నెరవేరింది" అంటూ సుజాతారెడ్డి నవలకు గొప్ప ముగింపు పలికారు. మారుతూ కొత్త సంస్కారంతో ఎదుగుతున్న భారతీయ ప్రజాస్వామ్యం సంస్కృతిలో విప్లవ చైతన్యం యిమిడి పోయి నవ చైతన్యంతో కాంతులీనడమే అలా కోరుకోవడమే బేబీని సరళ రమేష్‌కు ఒప్పగించటం.

మన భారతీయ ప్రజాస్వామ్య సంస్కృతికి ఎంత చరిత్ర వుందో. ఈ నవల పాత్రల మూలాలకు అంత చరిత్ర వుంది. మన సంస్కృతి వారసత్వానికి ఎంత భవిష్యత్తు వుందో, ఈ పాత్రలకు అంత అజరామరత్వం వుంది.

మలుపులు తిరిగిన కథ అయినా లక్ష్యాన్ని మరవని కథనం ఈ నవలలో వుంది. ఈ నవలకు రచయిత్రి నవలలోని పాత్రలకున్న సాంకేతికార్థాలను తెలియచెప్పక పోతే, పాఠకులు ఈ నవలలో శిల్పం చెదిరి పోయిందని చెప్పే అవకాశం వుండేది. కాని అలా జరుగలేదు.

ఈ సూచనలతో చదివితే ఈ నవల ఒక కావ్యానుభూతిని కల్గిస్తుంది.

❖

# ఇనుప గజ్జెల తల్లి

**అనంతపురం జిల్లా రచయితలు కరువు నేపథ్యంలో ఇటీవల 'ఇనుపగజ్జెల తల్లి" కథల సంకలనం తీసుకొచ్చారు. సంకలనమంతా ఒకటే కథ. అనంతమైన కరువు కథ. పద్దెనిమిది మంది రచయితలు రాసిన గొలుసు కథ. మోయలేని నిజాలులో కథకుడు అన్నట్టు బహుశా ఘటనలు విడిగా ఉండొచ్చు. కథలన్నీ ఒకటే. కన్నీళ్ళన్నీ ఒకే రకం. వాటి అంతిమసారం మృత్యువే. లేదా మృతప్రాయమైన బతుకు. ఈ రచయితలంతా మన చేయి పట్టుకొని కరువు ప్రాంతమంతా కలయజూపే ప్రయత్నం చేస్తారు. కరువు భూకంపంలా కాళ్ళ కింద భూమిని కదల బారేలా చేస్తోంటే ఉనికి కోసం మనికి కోసం మనిషి ఎంత విహ్వాలుదయిపోతాడో అందుకు సజీవ సాక్ష్యం ఈ సంకలనం.**



**జి.ఎస్. చలం**

**"వాని రెక్కల కష్టంబు లేనినాడు**
**సస్యరమ పండి పులకింప సంశయించు**
**వాడు చెమటలోడ్చి ప్రపంచమునకు**
**భోజనము పెట్టు, వానికి భుక్తిలేదు**
**ఆ యభాగ్యుని రక్తంబు నాహరించి**
**యినుపగజ్జెల తల్లి జీవనము సేయు"**

**-జాషువా**

పిల్లల్ని కంటూ వాళ్ళను అమ్ముకొని బతకవల్సిన దౌర్భాగ్యం మీకెప్పుడైనా దాపురించిందా? ఒక చావుని ఒడిలో దాచుకొని మరో చావు కోసం ఎదురు చూసే సంకటం మీకెప్పుడైనా తటస్థించిందా? పుట్టగానే అంత్రం ఏదన్నా వేసి చంపకపోయివా అమ్మా అని మీ పిల్లలు మిమ్మల్ని ప్రశ్నించే భయానక సందర్భం మీకెదురయిందా? ముందు పరుపు వెనక కరువు ఇలాంటి జీవన్మరణ సమస్య మీ ఆడవాళ్ళకు ఎప్పుడైనా కలిగిందా? కూటికోసం కాదు పశువుల మేత కోసం మీ భార్యల తాళిబొట్లు కుదువపెట్టే దరిద్రం మీరు అనుభవించారా?

ఆరుగాలం సతతహరిత ఛాయలలో విలసిల్లే వారికి ఇవేవీ ఊహకు కూడా అందని విషయాలు కాని ఇవన్నీ నగ్న సత్యాలు అంతర్జాతీయ పత్రికల ప్రశంసలకు పాత్రులై తొమ్మిదేళ్ళు ఈ రాష్ట్రాన్ని ఏలిన వారి దక్షతను వెక్కిరించే నిలువెత్తు నిదర్శనాలు.

అనంతపురం జిల్లా రచయితలు కరువు నేపథ్యంలో ఇటీవల 'ఇనుపగజ్జెల తల్లి" కథల సంకలనం తీసుకొచ్చారు. సంకలనమంతా ఒకటే కథ. అనంతమైన కరువు కథ. పద్దెనిమిది మంది రచయితలు రాసిన గొలుసు కథ. మోయలేని నిజాలులో కథకుడు అన్నట్టు బహుశా ఘటనలు విడిగా ఉండొచ్చు. కథలన్నీ ఒకటే. కన్నీళ్ళన్నీ ఒకే రకం. వాటి అంతిమసారం మృత్యువే. ఈ కథలు చదవక ముందు చదివిన తరువాత ఒకే రకమైన మనః స్థితి కలిగి ఉండడం అసాధ్యం కేవలం ఈ కథలు లేవనెత్తిన అనేక అంశాలకు సంబంధించిన గురించి కొంచెం వివరించేందుకు ప్రయత్నిస్తాను.

మనిషి తన ప్రాథమిక అవసరమైన ఆహారాన్ని కేంద్రంగా చేసుకొని అభివృద్ధి చెందాడు. ఆహారాన్ని సేకరించడం లగాయతు ఆహారోత్పత్తి దశ వరకు ఈ పరిణామ క్రమంలో నాగరికత సంస్కృతి వృద్ధి చెందింది. ఐతే అదే ఆహారం కోసం తన సంస్కృతీ నాగరికత ధ్వంసం కావడం మనిషికెంత విషాదం. తిండిచ్చే వాడికి తిండి లేకుండా చేసి కనిష్ట స్థాయిలో కూడా బతికే అవకాశం లేకుండా చేసి ఆత్మహత్యకు పురికొల్పడం ఇప్పుడు రాజ్యస్వభావంగా మారిపోయింది. దీనికి కారణమేమిటి మూలాలెక్కడున్నాయి. సొంటేర్లు కథలో జల్లప్ప స్వగతం వినండి.

"ఊర్లో రైతులకు కూలీలకు అంతో ఇంతో పని అన్నో ఇన్నో డబ్బులు ఉండిన కాలమది. అవన్నీ ఎవరో తుడిచేసినట్టు ఎట్లా మాయమయ్యాయో? రాని వర్షాలు, పారని ఏరు, నిండని కాలువ, పాడుబడ్డ మాగాణి ఇవేనా కారణం? వర్షాలు పడి పంటలు పండినప్పుడు కూడా తనకు అప్పే కదా మిగిలింది. అయితే అప్పుడు అప్పులున్నా కళ్లెదుట పని చేతిలో చేవ ఉండేవి. పనిలో ఆనందం. అప్పుతీర్చే విశ్వాసం ఉండేవి. మెల్లగా అప్పులు బతుకును మింగేశాయి. అన్నిటికి మూలమేమిటో?" గట్టు మీద కూర్చొని చేతికి మట్టి అంటకుండా వ్యవసాయంతో వ్యాపారం చేసేవాడు తప్ప, చెమటోడ్చి పండించిన వాడెవడూ అప్పు లేకుండా లేడు. ఊర్లో రైతులు మీదబడి బతికే వడ్డీ వ్యాపారులెవరూ రైతులని ఎప్పుడూ అప్పు లేకుండా ఉంచరు. తను పండించిన దానికి ధర నిర్ణయించే అవకాశం లేని వ్యవసాయ విధానంలోనే ఈ లోపమంతా ఉంది.

వరల్డ్ బ్యాంకు సంస్కరణల ఫలితంగా 91 నుంచి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న విధానాలు రైతాంగ ప్రయోజనాలకు ప్రాణసంకటంగా పరిణమించాయి. అనేక కారణాల వలన రైతుకి కనుచూపు మేర పని లేకుండా చేసినపుడు ఇక ఆనందం ఎక్కడది ఆత్మ విశ్వాసమెక్కడిది. ఇదంతా ఆలోచించినప్పుడు "వలసెలిల పోతాండా"లో గంగప్పకు "ఇది కథ కాదు"లో ముత్యాలమ్మ భర్తకు "కాటేసిన కరువు"లో నాగప్ప తండ్రికి పురుగులు మందు తాగించిందెవరో "వ్యసనం"లో బక్క రైతుకు దాన్ని కొనిపెట్టిందెవరో "అలజడి"లో పుల్లన్నకు ఉరితాడు పేనిందెవరో అర్థమవుతుంది.

సామాన్యంగా ఒకస్త్రీ వేశ్యగా మారడానికి దారితీసే పరిస్థితులు రెండు (1) మోసం, (2) దారిద్ర్యం. మోసం వలన నిస్సహాయురాలైన స్త్రీ వేశ్యగా మారుతుంది. దారిద్ర్యం వలన వేశ్యగా లేదా దొంగగా మారుతుంది. స్త్రీని మనిషిగా కాక అనుభవయోగ్యమైన ఒక వస్తువుగా మార్చిన పితృస్వామిక వ్యవస్థలో ఆమె దొంగకన్నా వేశ్యగా మారే అవకాశాలెక్కువ. "మహమ్మారి" కథలో ఈశ్వరమ్మ ఏజెంటు చేతిలో మోసపోతుంది. కువైట్ తీసుకెళతానన్న వాడు బొంబాయిలో వదిలేస్తాడు. తార్పుడుగాళ్ళు రాబందుల్లా తయారయి పోతారు. దిక్కులేని స్థితిలో ఆమె ఈ ఊబిలో దిగవలసి వస్తుంది. "కాటేసిన కరువు" కథలో నాగప్ప చిన్నప్పుడు బతుకు తెరువు కోసం పట్నం పోయి పని దొరకక దొంగగా మారతాడు. పదేళ్ళ తరువాత దొంగ

బతుకు వద్దు అనుకొని ఇంటికి తిరిగి వచ్చేసరికి పరిస్థితంతా మారిపోతుంది. అప్పటికే తండ్రి ఆత్మహత్య చేసుకుంటాడు. చెల్లి పడుపు వృత్తిలో ఉంటుంది. నగరం నాగప్పను దొంగగా మారిస్తే తల్లిలాంటి పల్లె సైతం చెల్లిని వేశ్యగా మారుస్తుంది. చివరకు తనకు నచ్చిన వాడితో లేచిపోతే ఆమె ద్వారా ఐదు వేలు పుచ్చుకున్నందుకు తల్లి తప్పనిసరై కూతురుకు బదులు బొంబాయి వేశ్యాగృహాలకి బయలుదేరబోతుంది. ఇంతకన్నా దారుణమేముంటుంది.

పురుషుడు స్త్రీని మానసికంగా కుంగదీసి శారీరకంగా లొంగదీసుకొనే ఆయుధం అత్యాచారం. సంఘంలో శీలం పోయిన దానిగా ముద్రవేసి ఏకాకిని చేసి అశక్తురాలిని చేసి చివరకు తాననుకొన్న ప్రయోజనాన్ని పొందడం ఒక పాశవిక పద్ధతి "ఇది కథ కాదు"లో భర్త ఆత్మహత్య చేసుకుంటే భార్య కూరగాయలు అమ్ముకుని బతుకుతుంది. అప్పిచ్చినవాడు ఆమెపై కన్నేస్తాడు. కాని లొంగదు లొంగదీసుకోవడానికి తన చీనీ తోటలోకి పనిలోకొచ్చిన ఆమెకూతురిపై అత్యాచారం జరుపుతాడు. డాక్టర్లు, పోలీసులు పైనలున్నోడికి తొత్తులనే సంగతి వేరే చెప్పేదేముంది. చిట్ట చివరకి ఆమె వాడికి ఉంపుడుగత్తెగా మిగిలిపోతుంది. అప్పిచ్చిన వాడికి తీసుకున్న వాడు మాత్రమే కాదు వాడి కుటుంబమూ ప్రచ్ఛన్నంగా దాసోహమై ఉంటుంది. కుటుంబంలోని అందరి జీవనాడుల్ని చేత బట్టుకొని వాళ్ళని కీలుబొమ్మల్నిచేసి ఆడించగలడు. ఈ సాలెగూడు వ్యూహంలో ఇంట్లోని స్త్రీలు సైతం శలభాలే. ఈ రెండు కథల్లోనూ భర్తల ఆత్మహత్యల కారణంగా దిక్కూమొక్కూ లేక తల్లులకు ఆడ పిల్లలకు వొళ్ళమ్ముకునే దౌర్భాగ్యం దాపురించింది. మగవాళ్ళయితే పురుగు మందు తాగో, ఉరేసుకొనో, గిలగిలా తన్నుకొని ఒకేసారి చనిపోతారు. కాని ఆడవాళ్ళు మాత్రం నిరంతరం చస్తూ బతుకును లాక్కొస్తారు. "కరువు" పీల్చిన మనుషుల" కథలో అయితే రామప్ప మనిషిగా చచ్చిపోయి పడుపు వృత్తిలోనున్న కూతురి సంపాదనతో పురుగులా బతికేస్తుంటాడు.

కరువు కొలిమిలో మనుషుల మధ్య ఆత్మీయతలు ఆవిరైపోతుంటే మరోపక్క మనుషులతో మూగజీవాలుకున్న బంధాలు బలీయంగా ఆవిష్కరించడం ఈ కథల ప్రత్యేకత. "నెర్లు" కథలో కరువు బాధకి అవ్వ ఎద్దుని అమ్మేస్తే అది రెండు రోజులు తరువాత తిరిగి


**ఈ రెండు కథల్లోనూ భర్తల ఆత్మహత్యల కారణంగా దిక్కూమొక్కూ లేక తల్లులకు ఆడ పిల్లలకు వొళ్ళమ్ముకునే దౌర్భాగ్యం దాపురించింది. మగవాళ్ళయితే పురుగు మందు తాగో, ఉరేసుకొనో, గిలగిలా తన్నుకొని ఒకేసారి చనిపోతారు. కాని ఆడవాళ్ళు మాత్రం నిరంతరం చస్తూ బతుకును లాక్కొస్తారు. "కరువు" పీల్చిన మనుషుల" కథలో అయితే రామప్ప మనిషిగా చచ్చిపోయి పడుపు వృత్తిలోనున్న కూతురి సంపాదనతో పురుగులా బతికేస్తుంటాడు.**


వచ్చేస్తుంది. "నా కష్టాలు నూరున్నా పడతాను మీదుడ్లు మీరు తీసుకుపోండి" అని డబ్బులు తిరిగి ఇచ్చేస్తుంది. "కొండ చిలువ" కథలో పెన్నయ్య భార్య మెడలో తాళిబొట్టు కుదువపెట్టినా కరువు కాలంలో పశువులను సాకడం శక్తికి మించిన పనికావడంతో వాటిని అమ్మేస్తాడు. అతను ఇంటికొచ్చేసరికి అవి కట్లు తెంచుకొని వచ్చేస్తాయి. పేగు బంధానికి మించిన జీవబంధాన్ని తెంపుకోలేక వాళ్ళకి డబ్బులిచ్చి పంపేస్తాడు. "వలసెల్లి పోతాండా" కథలో అప్పులు తీర్చలేక ఆత్మహత్యకు ప్రయత్నం చేసి బయట పడిన రైతు, కొంత బరువైనా తగ్గుతుందని పశువులను అమ్ముకొస్తాడు. పాడి పశువులతో కళకళలాడిన కొట్టం శూన్యమయిపోవడం. వాటివల్ల పొందిన మేలు మరవలేకపోవడంతో ఆ డబ్బును విసిరేసి పశువులను తిరిగి తీసుకురమ్మంటుంది. కాని ఆమె కోరిక బతుకు బండ కింద పడి నలిగిపోతుంది.

మానవ సంబంధాల విషయానికొస్తే "సొంటేర్లు" కథలో విధవరాలైన కూతురికి మనవడికి ఆశ్రయమిచ్చినందుకు జల్లప్ప కొడుకు కోడలు వేరైపోతారు "ఏం నీకి నేను పుట్టలేదా! ఆముండొకటేనా పుట్టిండేది ఉన్నదంతా దాని రొమ్మున పెడతండావు నీ రోగాలకు పెట్టుకుట్టాండావు" అని కొడుకు పెట్టిన పేగు మెలికి తట్టుకోలేక మానసికంగా కుంగి చావు బారిన పడతాడు. "మహమ్మారి" కథలో ఈశ్వరమ్మ ఏ కుటుంబ సభ్యుల కోసం తన జీవితాన్ని కొవ్వొత్తిలా కాల్చుకుందో చివరకు వాళ్ళే దూరమవుతారు. ఎయిడ్స్ రోగాన పడి ఆసుపత్రిలో ఒక ఆత్మీయమైన పలకరింపు కోసం ఒంటరిగా ఆశగా ఎదురు చూస్తుంది.

నరనరానా విస్తరించిన వినిమయ ప్రపంచంలో రాగద్వేషాల ఉనికి వ్యక్తుల స్వభావాల మీద కాక సామాజిక సంక్షోభాల మీద ఆధారపడి ఉంటుంది. "మానాన్న ఆత్మహత్య చేసుకున్నా బాగున్ను" అని ఒక కూతురు అనుకుందంటే సామాజిక చలన సూత్రాన్ని అర్థం చేసుకున్నప్పుడు ఆ తండ్రి మీద మనకు జాలి కలుగుతుంది. కారణం కథకుడు చెప్పినట్లు కరువులో ఏ విలువలూ బతకవు.

అన్ని పాపాలకు ఆకలే తల్లి అయితే మరి ఆకలి తల్లికి జన్మనిచ్చిన ఆ ఇనుపగజ్జెల తల్లిని సృష్టించిందెవరు? వర్షాలు కురువకపోవడం. భూగర్భ జలాలు అడుగంటి పోవడం వెరసీ పంటలు పండకపోవడం దాన్నే పాలక పక్షాలు, మీడియా, కూడబలుక్కొని పదేపదే ప్రసారం చేస్తున్నాయి. కాని ఇది సహజమైన కరువు కాదని, కృత్రిమ కరువని ఆలోచిస్తే ఇట్టే అర్థమవుతుంది.

"రాయలసీమ కరువుకి వానలు రాక పోవడం ఒక్కటే కారణం కాదేమో" అని చేటపెయ్య కథలో అంటే దానికి సమాధానం "కరువు కురిసిన ధాత్రి" కథలో దొరుకుతుంది. "చెట్లు నరుకుతా వుండారంటే మిల్లులు, జిన్నులు, ఫ్యాక్టరీలు ఎక్కువవుతా ఉన్నాయంట. గాలి సెడిపోతావున్నాదంట. లారీలు, బస్‌లు, మోటారు సైకిళ్ళు, ట్రాక్టర్లు వీటి పొగ గాలిని సెడగొడుతాండాది" సహజ సిద్ధ వర్షాలకు అవసరమైన అటవీ సంపదనంతా తెగ నరికి సొమ్ము చేసుకొని మరో పక్క కృత్రిమ వర్షాలు కురిపించేందుకు చేస్తున్న ప్రయోగాలు ఎలా అర్థం చేసుకోవాలి. ఇది ఒక చేత్తో బాంబులు కురిపించి మరోచేత్తో ఆహార పొట్లాలు విసరడం కాక మరేంటి?

అనంతపురం జిల్లా కరువుతో కునారిల్లిపోతున్న కొద్దీ అక్కడ రోడ్లపై తిరిగే ఫ్యాన్సీకార్ల సంఖ్య పెరిగిపోతుంది. సహాయ పథకాలతో ప్రాజెక్టులతో వందలాది కోట్లు ఏమయినాయో ఇప్పుడు అర్థమవుతుంది కదూ!

అందరికీ నీళ్ళివ్వడమనేది సంక్షేమ రాజ్యంలో ప్రభుత్వ కనీస కర్తవ్యం. అది పాటించకుండా పుష్కలంగా ఉన్న నీటి వనరుల్ని ప్రైవేటీకరిస్తూ నీటి వనరులను ఏ వర్గాలు నియంత్రిస్తున్నాయో రతనాల సీమను రాళ్ళసీమగా మారుస్తున్న మహారాజులెవరో మీకీ కథలు చదివిన తరువాత తప్పనిసరిగా అవగతం కాగలదు.



# వ్యక్తిగతం

జాతశ్రీ




ఓరారి, తిర్పిగా... జాంపం
కాలిగజ్జె కట్నావురా?...
దుంపదెగ, ఏ పనీ సక్క
జెయ్యవు గదా! "బొంతగ
దేరాలో చతికిల కూచొని, మ
తాళ్ళు సరిచేసిన కొమరాలు, దా
పక్కనుంచుతూ" నీరసం
అన్నా
మాదవ నిక్కబొడి
వెంట్రుకలకు నీళ్ళతడి రాసి, ఎడ
చేత్తో అదుముకుంటూ, పగి
అద్దం ముక్కలో చూస్తూ త
దువ్వెనతో దువ్వుకునే తిరపా
తండ్రికేసి చూడకుండా
"ఓరయ్య, బసవన్న ఉషారుగలే
మంకేస్తందు" అన్నా

తిరపాలు పక్కనే కూర్చొని సన్నాయి పీకల్ని పరిశీలిస్తూ, సరిచేసుకుంటున్న రాంపండు, తమ్ముడి నెత్తిణో మొట్టికాయేసి, "నీ మడతనాలిక మట్టిగరవ, సుబంపలకరా'య్యంటే తద్దినాలెప్పుడన్నాట్ట... నీ అసంటి మిడిమాళపోడు" అన్నాడు.

తిరపాలు, అన్నకేసి కొరకొరా చూసి, కొండముచ్చులా పళ్ళిగిలించి, దూరంగా జరిగాడు.

కొమరాలు డేరాలోంచి బయటికొచ్చాడు. దాపున తంగెడు దుంగకు కట్టేసి ఉన్న గంగెద్దుకేసి చూశాడు.

గంగెద్దూ చూపు కలిపింది. తల నిలువునా ఆడిస్తూ అదోలా అరచింది. ఆ అరుపులోని అర్థాన్ని పసిగట్టిన కొమరాలు కన్నుల్లో నీళ్ళు తిరిగాయి. దగ్గరగా వచ్చి గోముగా దాని గంగడోలు దువ్వుతూ, "ఆకలయితుందార, జాంపండూ?" అన్నాడు. కొమరాలు గందెద్దుకు పెట్టుకున్న ముద్దుపేరు – జాంపండు. దాని డొక్కల్ని తడుముతూ, "ఒక్కపూట ముద్దాలిసెమైతే... అన్నీ తెల్సిన మద్దే గిలగిల్లాడతడు. నోరు లేనోడు. రొండు దినాలుగ అనుంగ పిరికెడు సొప్ప మురకజూసింది గాదాయె! ఆడిది సుత పానవే గద! కడ్పు నకనకలాడ్తంటే గోస పెట్టకుండుంటడా?" కొమరాలు తనకు తానే గొణుకున్నా, అది కాస్తా తిరిపాలు చెవిన బడ్డది.

"నీత్తల్లి... కడ్పు గట్టేసుకుని సొప్ప కట్టకొంటాని కడిగినా, అమ్మేటోళ్ళు కరువాయె! ఇగ బసవన్న బతికేదెట్ట?" అన్నాడు తిరపాలు.

తిరపాలు మాటనుగానీ, వాణ్ణిగానీ లెక్కేసుకోకుండా, కొమరాలు గంగెద్దు కేసి దీనంగా చూస్తూ "రేయ్, జాంపండూ, ఇయ్యాల ఇల్లిల్లు గోసపెట్టయినా నీ కడుపు నింపుత... నీ కాళ్మొక్త, మాట దక్కియ్యి" అంటూ గంగెద్దు ముంగాళ్ళ ముందు కూర్చొని "తిర్పిగా, గజ్జెల పట్టీలు దే..." అన్నాడు.

తిరపాలు కదలకముందే రాంపండు బొంత సంచీలో ఉన్న గజ్జెల పట్టీలు తీసుకొస్తుంటే, గమనించిన గంగెద్దు తల అడ్డంగా ఊపింది. అలా ఊపుతుంటే పసుపురంగేసి ఉన్న దాని కొమ్ముల చివరల్లో అమర్చిన చిరుగజ్జెలు ఘల్లుమన్నాయి.

కొమరాలు గుండెలు గుభేలు మన్నాయి. "ఏంద్రా, జాంపండూ... నీకియ్యాలేవయింద్రా... ఆట కొద్దంటన్న వేంద్రా? మాటబోద్దిగదరా!..." అంటూ బేలగా గంగెద్దు కేసి చూస్తుంటే అంతకు రెట్టింపు బేలతనం దాని కన్నుల్లో కదిలాడింది.

"ఎట్టా, రాంపండూ... జాంపండు ఆటకి మంకేస్తండు, పెద్దాసావితో మాటొస్తది గదరా!" అన్నాడు కొమరాలు.

"మంకేస్తండని మానుకుంటే ఆ దొర ఉరికిచ్చి సంపుతడు. కిందో, మీదో పడి మాట నిల్పుకోవాల." తండ్రితో అని, రాంపండు, "నీ దండం పెడతరా, మాట దక్కియ్యి. మారాజు కాళ్ళబడి నువ్ దిన్నంత సొప్పడక్మొస్త. తౌడు కుడితి తాపిస్త. నీ

ాదొట్టు" గత రెండు రోజులుగా చెయ్యని పనికి చెంపలేసుకుంటూ
న్నాడు రాంపండు.

అయినా గంగెద్దు తల అడ్డంగా ఊపుతూ, కాలు దువ్వే
మరాలుకు కాలివ్వకుండా వెనుకడుగేసింది.

"బసవన్న నీరసంగున్నడు. ఆటాడాలంటే వాడి వొంట్లో సుత
ాత్తెంత ఎత్తుండాల" తిరపాలు దాపుగా వస్తూ అన్నాడు.

కొమరాలుకు కోపం సర్రునెగసింది. "మాకు తెలుసో... నువ్
ా్రా... నీ మదత నాలిక ముత్తేలమ్మ కొరక... పెద్దమడ్సితో
రకాసొస్తదని నే నొణికి సస్తాంటే..." అని, గంగెద్దు ముందు కాలొకటి
లవంతంగా లేపి, తొడమీద పెట్టుకొని, ఆ కాలికి తాను రెన్నెళ్ళ
తం మంత్రించి కట్టించిన గుర్రపు వెంట్రుకల తాడును పైకి నెట్టి,
జ్జల పట్టీ చుట్టి గట్టిగా ముడేశాడు.

మరో కాలందుకొని, తొడ మీదుంచుకొన్న కొమరాలు,
డియంగా రాంపండుకేసి కన్నేసి, 'రే, రాంపండూ... కాలు వొణికిస్తాంద్రా
జాంపండు" అన్నాడు దీనంగా.

"ఒణికియ్యక, ఉషారుగెట్టుంటదు?... రెండు దినాలుగ సొప్ప
యరక జూసిండా? కాత్తె అనుంగ కుడితి తాపినవా?... నీయవ్వ...
ాగపడ్డ పచ్చిరొట్టల్లా తెచ్చి దాని ముంగలేస్తివి, పొరుదు సుత సురువు
సిందు" అన్నాడు తిరపాలు.

"ఏరా, జాంపండూ... నా పరువు
స్తావురా?" చూస్తూ అన్నాడు కొమరాలు.

"గుండె సెదరకురయ్యా... కిందో, మీదో
డి ఆటయిందనిపిద్దాం. గట్టి గడిగితే బసవన్నకి
ొంట్లె నలతగుందని, దండం పెడదాం. మా రాజు
ళ్ళ మీదపడి, ఓ మోపు సొప్పదుగుదాం... మనకి
వ్వలేకుంటే మానె!" అన్నాడు రాంపండు.



"అదీ అయింది. నిన్న మాపిటేల ఈదుళ్ళకి
ొయ్యొస్తా, స్త... మాట నికరానికి నిలబడి 'బసవన్నకి
రికెడు సొప్ప దానం సెయ్యండి దొరా...' అంటే ఆ
ొరాజు పెద్దగా నవ్వి, 'బువ్వదుగుపెడత, గుడ్డదుగు
ుస్త, మరీ కావాలంటే నాల్రూపాయ లెక్కువడుగు,
దన్ను... సొప్ప సంగతెత్తకు. ఊర్లె గొడ్లకి సొప్ప
దువై, ఆటిని కటికోళ్ళకి తోలేస్తున్రు గాదురా!... ఎనకట ఆసామంటే...
ద్ద – పశూల దొడ్డీ, ఊరి బయట గడ్డివాపులూ, ఉండేయి. ఇయ్యాల
నబడతన్నాయిరా?... ఒక్క టాట్టరుంటే జరిగిపోతాంది. అన్నాడురా
ొర.'' అని కొమరాలు అంటుంటే, ఆ వెనుకనే గంగెద్దు
లంకరించేందుకు బొంతలూ, రంగు చీరలూ భుజానేసుక నిలబడిన
రపాలు, "అరి గొడ్లు తినకుండనే బతుకుతున్నాయా?" అన్నాడు
ంగ్యంగా.

"మరదే, రెటవత వంటే... ఆసాముల్తో మనకి సాపతేందిరా?
న్నాడు కొమరాలు పెడితెనే గద, బతికేది? మనవేవన్న కానూర్న
చ్చెవడుగుతున్నవా?... తాతల్నుంచి ఊరు మన్దేగద, ఆరిళ్ళల్ల
ళ్ళిళ్ళొచ్చినా, పేరంటాలొచ్చినా, పురుళ్లొచ్చినా, పండగలొచ్చినా...
సవన్న నాడిచ్చేది మనవే గద." గంగెద్దు వీపున బొంత, చీరలూ కప్పుతూ
ని, మూపురానికి పచ్చరంగు బొంత టోపీ తొడిగాడు తిరపాలు. టోపీ
వరల్లో కుట్టి వున్న రంగురంగుల ఊలుదారాల కుచ్చులు డాంబికంగా
న్నాయి.

రాంపండు, గంగెద్దు మెడలో గంటల పట్టీ కట్టాడు. పట్టీపై
ంటల మధ్య కుట్టిన పూలు అందంగా ఉన్నాయి. తిరపాలు కుంకుమ
బ్బా తెచ్చి, ముందుగా తాను బొట్టు పెట్టుకొని, అదే వేలితో గంగెద్దు
నొసటన, జానెడు పొడవున పెద్ద బొట్టుదిద్ది, నాలుగడుగులు వెనక్కేసి
చూశాడు.

గంగెద్దు అలంకరణ చూడముచ్చటగా ఉంది.

"ఓరయ్య, బసవన్నకి దిష్ఠి తగులుద్ది, గుడ్డకాల్చి దిష్ఠితియ్",
అన్నాడు రాంపండు. అలంకరణకంటే, దాని ఆకలి కడుపే కనబడింది.
లోతుకు పీక్కుపోయిన డొక్కలు, బక్కచిక్కి బయటకు నిక్కపొడుచుకొస్తున్న
ఎముకలు, కళాకాంతులు తగ్గిన బుసికళ్ళు అస్తిపంజరానికి బొంత
కప్పినట్టుగా ఉంది. దాని మొహం దీనంగా, దివాలెత్తిన రాయలసీమ
రైతు మొహంలా ఉంది. చినుకు కోసం మూడేళ్ళుగా ఏడ్చీ, ఏడ్చీ,
చెంపలపై ఉప్పునీళ్ళ అట్టలు గట్టిన తెలంగాణా తల్లిలా, నకనకలాడే
ఆకృతికి 'ఉపమాలంకారం'లా ఉంది.

కొమరాలులో ఉద్వేగం... తన అస్సహాయతకు అద్దంలా,
నిర్దయకు నిలువెత్తు ప్రతిరూపంలా కన్పించే గంగెద్దును చూస్తుంటే తాను
కొలిచే దేవుడే తను గుండెల్ని కసాపిసా తొక్కుతున్నట్టుగా గిలగిలలాడాడు.
ఎడమకన్ను అదిరిపడింది.

"ఓరయ్య, కానియ్... వొళ్ళు కాకెక్కుతాంది" అన్నాడు
తిరపాలు.

కొమరాలు తేరుకుంటూ, తన కొడుకులకేసి ఓ మారు చూసి,
డేరా బయట పడేసున్న చింపిరిగుడ్డ నందుకొని, మట్టి
దులిపి, గుండ్రంగా చుట్టి, అగ్గిపుల్ల గీసి అంటించాడు.
రాంపండు అందించిన పగిలిన కుండ పెంకులో
మండేగుడ్డ నుంచి, గంగెద్దు మొహం మీద గుండ్రంగా
తిప్పుతూ, తనకే వినపడేలా చిన్నగా, "ఇరుగుదిష్ఠి,
పొరుగు దిష్ఠి..." అని మొదలేసి, మరేదో గొణిగి,
మంటపై మూడుసార్లు ఉమ్మేసి, గుడ్డను దారి కడ్డంగా
పడేసి, "జాంపండుని నడిపియ్యరా... రాంపండూ"
అన్నాడు.

అప్పటికే రాంపండు సన్నాయి కర్రల సంచి
భుజానికి తగిలించుకొన్నాడు. గంగెద్దు ముకుతాడు
విప్పి, 'పదరా, బసవన్నా...' అంటూ గంగెద్దును మంట
మీదుగా అడుగేయించి, వెనక్కి చూడకుండా
ముందుకు కదిలాడు. మద్దెల చంకన వ్రేలాడేసుకొన్న
తిరపాలూ అనుసరించాడు.

కొమరాలు చెవిపై దోపుకున్న మోదుగాకు చుట్టను ముట్టించి,
భుజానున్న ఎర్రంచు కండువా నెమిలి పించంలా తలకు చుట్టుకొని,
ఓసారి డేరాకేసి చూసి, కదిలాడు. ఎండ కరకర లాడుతోంది.

"రొండ్రోజుల నుంచి, సొప్ప నవిలింది లేదాయె! కోసెడు
దూరం నడ్సి, జాంపండు ఆటాడతడో, లేదో..." అనుకుంటూ ముందు
కదిలే గంగెద్దు చూస్తూ... చూస్తూ... నడుస్తూ, చూస్తుంటే... టే... ఆ
చూపు కాస్తా గతంలోకి గంతేసింది.

✤ ✤ ✤

ఇప్పటిదా!?...

రేపో, మాపో పదేళ్ళు నిండే కథ!

రాంపండుకు రేపో, మాపో, పదేళ్ళు నిండుతాయనుకున్న
రోజుల్లోని కథ!

లింగన్న గూడెం పటేల్ దొరవారి తల్లి తద్దినానికి తన తండ్రి
వెంకట్రాముడితోపాటు వెళ్ళి. తను గంగెద్దును ఆడించిన తీరుకూ,
దాంతోపాటు వేసిన అడుగుకూ, పాడిన పాటకూ జనమంతా ఈలలు...
చప్పట్లు...! చిన్న చిన్న గంతులో, వెనకడుగో కాదు... ఏకంగా గంగెద్దు
మొత్తాన్ని తన గుండెల మీద నిలుపుకోవడం, దాని నోటిలో మెడ

నుంచి గుండ్రంగా తిరగడం – జనాలకు చెమటలు పట్టించాయి. తను, ఆ వయసులో, తన ప్రాణాన్ని ఫణంగా పెట్టి ఆడిన ఆటకు నివ్వెరపోయిన సీతమ్మ తల్లులు దోసిళ్ళతో కాదు చేటలతో ధాన్యం పెట్టారు. పట్వారీ దొర పిల్చి పాతిక బండి రూపాయలు దోసిట్లో పడేస్తే, ఆట పెట్టించిన పటేల్ దొర – ఏకంగా మూడునూర్లు జేసే ఏడాది గిత్తదూడనే తన తల్లిపేరు చెప్పుకొమ్మని చెప్పి, దానంగా యిచ్చాడు. ఒక్కటనుకొని పోతే... కులానికో ఆట ఆడక తప్పలేదు. ఆఖరికి చిల్లరమల్లర కులాలు కూడా... ఆ పది రోజులూ జనాలకు మరో మాటా, మంతీ లేదు. తన ఊసులే! మాయ ఉందని కొందరూ, గంగెద్దుకు మంత్రమేశారని మరికొందరు...

పటేల్ దొర దానం చేసిన ఆగిత్తదూడకి ఆనాడే 'జాంపండు' అని తను ముద్దుపేరు పెట్టుకోవడం జరిగింది.

గంగెద్దుల కోసం సాధారణంగా ఎవరూ గిత్తల్ని కొనరు. పెద్దపెద్ద రైతులు పెళ్ళిళ్ళలోనో, చనిపోయిన తమ పితరుల పేరునో... దానంగా యిస్తారు. పనికి లొంగకమంకేసే వాటినీ, కాడికి మర్లబడే వాటినీ, గుదిబండేసినా దొంగబుద్ధివదలని వాటినీ, అవిటితనంతో పుట్టిన వాటినీ యిస్తారు.

అలా ఇచ్చినవి మరీ ముదురువయితే, మారకం పెట్టి లేగల్ని సంపాయించి, గుంటూరు దగ్గరున్న జంగాలపల్లెలోని జంగం బసవన్న దగ్గర వదిలిపెడతారు. గంగెద్దుల వాళ్ళు!

జంగం బసవన్న ఆషామాషీ మనిషేంగాదు. గంగెద్దులోళ్ళ గురువు. లేగ దూడల్ని అప్పగిస్తే, ఆరేడు నెలల్లో ఆటలన్నీ నేర్పించి, గంగెద్దుగా ముద్రేస్తాడు. గంగెద్దులకే కాదు, ఎలుగుబంట్లకీ ఆటలు నేర్పిస్తాడు. ఆట నేర్పీ, ఆరేడు నెలలు వాటి ఆలనా పాలనా చూసినందుకు గిత్త ధరలో సగం పైగానే యిచ్చుకోవాలి. ప్రతి శనివారం గిత్తలకి సాంబ్రాణి పొగేసి, పూజ చేసి, అరటిపండూ, బెల్లం తినిపిస్తాడు. ప్రతి ఆదివారం గిత్తల చెవుల్లో ఏదో చెట్టు పసరు పోస్తాడు. ఆ చెట్టేదో ఎవరికీ తెలీదు. అతనూ చెప్పడు. ఆ పసరు కనికట్టేమిటోగాని, ఆ పసరు పోస్తూనే గిత్తదూడలు తెల్ల ఉసిరిక తలమీద బెట్టిన పాములైపోతాయి. గంగెద్దుగా ముద్రపడిన గిత్తలు మరో దానికి – పనికిరావు. తన యజమాని కంటి సైగలకూ, చేతి కదలికలకూ, చెర్నకోల ఝాడింపులకూ... అది శిక్షణ పొందిన రీతిలో కదులుతుంది. అవే గంగెద్దుల ఆటలు!



తన జాంపండు మరీ లేతదవడంతో ఆటలన్నీ సులువుగానే అలవడ్డాయి. దాంతో, తాను ఏనుగెక్కినంత సంబరంతో, జాంపండు మీద కొండంత నమ్మకంతో రాంపండుని భుజానెక్కించుకొని, ఇంటిదాన్ని వెంటేసుకొని దేశం మీదపడ్డాడు...!

ఒకూరా?.. ఓ పరగణానా?... వానా వరదా అడ్డగిస్తే తప్ప, తానే ఊరిలో నికరంగా మూడు దినాలకు మించి నిద్ర తీసింది లేదు. మిగతా బిచ్చపు దాసరుల్లా తాగి, తందనాలాడిందీ లేదు. కనీసం గంజాయి దమ్ముకొట్టిందీ లేదు. ఎలకలో, పిల్లులో, ఎంద్రకిచ్చులో దొరికితే వండుక తినడం తప్ప పెద్ద జల్సాలు చేసిందీ లేదు.

ఆ రోజుల్లోనే పెనుగంచిప్రోలు తిరపతమ్మ దేవర తిరనాల్లో, ఆటకి పోతే పుట్టిన చిన్న కొడుక్కి, పురుడు చల్లగయినందుకు, ఆ తల్లికి దండం పెట్టుకొని, ఆ తల్లిపేరే పెట్టుకొన్నాడు.

ఆపై ఐదారేళ్ళు తన బతుకులో గుణించుకోదగ్గ ఉప్పెన లేవీ లేకుండా గడిచింది. ఏడెనిమిది నెలలు గంగెద్దు ఆటలతో దేశం మీదా, నాలుగయిదు నెలలు సొంతూరులో గుడిసెపట్టునుంటూ, కాస్త 'కలిగినోడి'గా ఆ కులంనోళ్ళలో నానుతూ వచ్చాడు. వరసకీ, వ్యవహారాని – కుల పంచాయితీలో పై పెట్టున కూర్చొనే రీతిలోనే సాగింది బతుకు

రాంపండుకు మీసకట్టు రావడం చూసి, ఇంటి దాని మా మీద పోశించెర్ల పోరిని కోడలిగా, మూడొందలు ఓలి గట్టి మనువాడట జరిగింది.

ఆ పోర్దాని కాలి మాయో, కనికట్టో, తెల్వదుగాని, అ గుడిసెల అడుగేసిన్నాట నుంచి, బంగారం లాటి తన కొడుకు రాంపం – కాకి బంగారంలా మారిపోయాడు.

తల్లిని గిట్టకపోవడం, జాంపండు ఆటకు ఎగేసి గుడిసెపట్టు కోడల్పోరితో కులకడం, గుసగుసలూ, ఆ యికయికలూ, పకపకలూ.. గుడిసెలో నెమ్మది లేకుంటపోతుంటే, ఇంటి దాని పోరుపడలేక, కోడల్పో అయ్యనీ, కులపోళ్ళనీ కూర్చొబెట్టి, మూడు రాత్రులు పంచాయ నడిపించి... చివరి కెట్టయితేనేం, యిడాకులు తీసుకోవటం జరిగింది ఆ కోడల్పోర్ది పోతా, పోతా తననీ, తన యింటిదాన్నీ, నోరు పట్ట తిట్లు తిట్టి, దోసిళ్ళతో దుమ్మెత్తి గుడిసెకేసి గుమ్మరించి వగలా ఏడ్చేడ్చుకుంట పోయింది.

ఆ 'మందార' నోటి మర్మమేందోగాని, అదన్నట్టే మూ నెలలు తిరక్కుండానే చీకటేల పురుగు ముట్టి, తన యింటాదది మూన్నెళ నవినీ, నవినీ... వొళ్ళంతా పొక్కులొచ్చి కాటిపాలయింది.

రెండేళ్ళ నుంచి ఇంటిది లేకపోవడం, కాలమ కన్నెర్ర జేయడం... తన బతుకు కిందెత్తునయింది ఇంటిది బతికున్న రోజుల్లో ఆటలో వంతమాటకి భ ఉషారుండేది. మనిషి ఆటాడితే... మద్దెల వరసని బ మనిషే అడుగు మారుస్తాడు. గంగెద్దు ఆటలో – దా అడుగును బట్టే మద్దెల దెబ్బ పడాల. అప్పు గంగెద్దాటలో మజా దొరుకుద్ది.

ఇప్పుడా పని తిరపాలు చేస్తున్నాడు. లే వయసైనందున వాడి వరసంతా అల్లాయి – పుల్లాయి అన్నట్టుగా ఉంటుంది. ఆటలో సినిమా పాటల పాడినంత తేలిగ్గా గంగెద్దుల పాటలు పాడలేడు మాటెంత పెడసరమో, మనిషీ అంతే!

తన ఆట రోజురోజుకీ తేలిపోతుందని తెలిసొస్తుంటే మరి దిక్కూ దారీ తోచక కొమరాలు, ఆటకి ప్రాధాన్యత యివ్వకుండా గంగెద్దు అలంకరించి సన్నాయీ, మద్దెల వాయిస్తూ, ఇంటింటికీ తిరి భిక్షమడుక్కొనే 'బిచ్చపు దాసరి'గా మారిపోయాడు. నెలకో, రెన్నెళ్ళకి కాస్త పల్లెతనం పలకరించిన చోట మాత్రమే, పెద్ద మనుషుల్ని కలి గంగెద్దాట పెట్టడం ఆరంభించాడు.

నెలక్రితం కొమరాలు కూనారంలో ఆటపెడితే చూసి ఉబ్బితబ్బిబయిన ఆ ఊరి పెద్దాసామి, తన మనమడి నామకరణం నాడ ఆటపెట్టమని, రోజు చెప్పి, బయానాగా యాభై రూపాయలిచ్చాడు.

ఆ మాట నిలుపుకునేందుకే కొమరాలు కూనార బయలుదేరాడు తప్ప, ఆటాడితే తన జోలె నిండుద్దనీ, గంగెద్దు కిం చొప్ప దొరుకుతుందనీ కానేకాదు.

కొమరాలే కాదు. వృత్తి కళాకారులందరి పరిస్థితీ అలా వుంది. గతంలో గ్రామం మధ్యలో ఆటపెట్టి, అదో హక్కులా అనుబంధంలా చాటలతో ధాన్యాన్ని కొలుచుకున్న కళాకారులు – కళ వదిలేసి కూలిబతుకులు అలవాటు చేసుకొంటున్నారు. గ్రామ గ్రామా – మీసాలు మేలేసి, ఆడి పాడి అలరించిన కళాకారులు – కనిపించడ లేదు. జేగంటలు, జమిడికలు, అందెలు, వీరణాలు, తప్పెటల

27

తంబురలు, కోలలు కనుమరుగై పోయినయ్. ఆ కళాకారులు అర్ధాకలితో శ్వాసిస్తున్నారు. వారి పిల్లలు సత్తుగిన్నెలు పట్టుకొని, ఇల్లిల్లూ యాచిస్తూ - జీవితం కాని, కాకూడని జీవితం - జీవిస్తున్నారు. మానవతకూ, ప్రజాస్వామ్యానికీ ప్రశ్నార్థకంగా 'అనాధ, అధోలోక బాల్యాల్ని' అనుభవిస్తున్నారు.

ఇదీ మన సంస్కృతి, సంపత్తి అని గర్వంగా చెప్పుకొన్న వేవీ... ఇవాళ కాకుండా పోయాయి. ఆలోచనల్లో, ఆరాటాల్లో వ్యక్తిగతాలే తప్ప, అభిమానుబంధాలు ఆవిరైపోయాయి. మూగజీవాల పరిస్థితి మరీ దారుణమయింది. ఆహార ధాన్యాల కోసం గోదాములున్నాయిగాని, కోట్లాది పశువుల దాణా కోసం ఏ గోదాములూ లేవు. మన తాతలు, తండ్రులు ప్రేమించిన ఉమ్మడి బతుకుల్ని, పోషించిన విలువల్నీ పరిహాసం చేస్తూ, అనుబంధాలకు దూరంగా వ్యక్తిగతాల్ని అనుభవిస్తున్నాం. పొరుగు వారి అవసరమూ, మన అవసరం లాటిదనే భావన వదిలేసి, మార్కెట్ మనస్తత్వాల్ని అలవర్చుకొంటున్నాం.

చినుకు పిరమై, పంట శూన్యమై, ప్రజలకు తిండిగింజలు యితరేతరంగా దొరికినా, పశువుల ఆకలి గురించి ఆలోచించేవారు ఎవరూ లేరు. పశువులూ - సమ్మెల్లో, ధర్నాలో చేస్తే తప్ప వాటిని కరుణించే వారు ఉండరేమో! ఏమో!!...

భిక్షగా కాదు. గడ్డి ఖరీదుక్కూడా దొరకని వైనానికి నివ్వెరపోయాడు కొమరలు రెండు రోజులుగా తన జాంపండుకు పిరికెడు చొప్ప సంపాయించలేకపోయిన తన నిస్సహాయత మీద తనకే అసహ్యం!



❖ ❖ ❖

"ఓరయ్యా... ఊరొచ్చే, కాలాడియ్" గంగెద్దు వెనుక నడిచే తిరపాలు వెనుకనున్న తండ్రితో అన్నాడు.

పెద్దాసామి వాకిలిలోని చింతచెట్టు నీడలో ఉన్న బండి మొగరానికి గంగెద్దుని కట్టేసి, తలగుడ్డతో మొహం తుడుచుకొన్నాడు రాంపండు.

తిరపాలు ఓ వరస మద్దెల వాయించాడు.

కొమరాలు, రాంపండుతోపాటు పెద్దాసామి గడపలో నించొని, తలకు చుట్టుకొన్న ఎర్రంచు కండువా తీసి పట్టుకొని, "దండం పెడతం, దయగల మారాజు, బసవన్న ఆట సురువు జెయ్యనా దొరా?..." అన్నాడు.

వసారాలో పట్టా కుర్చీలో కూచొని పొర చుట్ట చుట్టుకునే పెద్దాసామి.

"ముందుగాల నా పేరూ, మా అమ్మ పేరూ సెప్పుకుంట, ఓసారి ఊరంతా తిరగరా" అన్నాడు.

కొమరాలుతోపాటు రాంపండూ తలూపులూ వంగివంగి దండం పెడుతూ అప్పుడే ఇంటిలోంచి వచ్చిన పెద్దసావి భార్యతో.... "దండం పెడతన్న దొర్సాని తల్లీ.... బసవన్నని కొత్తెదయ జూడాల, ఆకలితో నకనకలాడ్తాండు తల్లా..." అన్నాడు.

పనులు అంతగా ఉండని రోజుల్లో పల్లె జనానికి పగటివేళ కాస్త తీరుబడిగా ఉంటుంది. చాలా మంది చింత నీడకు చేరి నిలుచున్నారు. ఊరు తిరిగొచ్చిన కొమరాలు, జనాలకు దండం పెడుతూ చుట్టూ తిరుగుతున్నాడు. అప్పటికే పెద్దాసామి ఓ పొడవాటి బెంచీతోపాటు తన పట్టా కుర్చీ వేయించుకొని, తన కుటుంబంతో సహా కూర్చున్నాడు.

కొమరాలుకు జనాన్ని చూసేసరికి ఉషారొచ్చింది. గంగెద్దులో మాత్రం ఉషారు మచ్చుకయినా కనిపించడం లేదు. ఆకలి - దాని చూపుల్ని నిలకడగా ఉంచడంలేదు. చుట్టూరా చూస్తుంది. ఆకలి తీరడం దాని ప్రథమ లక్ష్యంలా ఉన్నట్టుంది.

తిరపాలు మద్దెల వాయిస్తూ, గంగెద్దు ఎదురుగా నిలుచుంటే, కొమరాలు దానితోక మెలిపెడుతూ, చెర్నకోల ఆడిస్తూ...

దూడూ... బసవన్నా,
ఆసాం గోరికి దండంబెట్టు...
దొర్సానమ్మని దండంబెట్టు...
చిందొర్సానికి, చిందొరగోరికి...
పేరు పేరునా దండంబెట్టు..." అంటూ పాటెత్తుకున్నాడు.

ఆ వెంటనే రాంపండు గంగెద్దు ముకుతాడు పట్టుకొని, పెద్దాసామి దగ్గరకు నడిపిస్తే, గంగెద్దు తల నిలువునా ఆడించింది. అలా నాలుగుసార్లు నలుగురికీ... చుట్టూ నిలుచున్న జనం చప్పట్లు కొట్టారు. ఆ వెనుక గంగెద్దు గుండ్రంగా తిరుగుతూ తలాడిస్తుంటే, జనం ఈలలు... చప్పట్లు!

ద్యాన్సెయ్యమంటూ తిరపాలు పాటెత్తుకుంటే రాంపండు దాని ముంగాళ్ళ మీద చెర్నకోలని తాకించాడు.

"థిల్లానా... థిల్లానా... నా కసికళ్లదానా..." పాటతోపాటు తిరపాలు మద్దెల వాయిస్తుంటే గంగెద్దు కుమ్మరి మట్టి తొక్కినట్టు కాళ్ళనాడిస్తుంటే... జనం మనసారా నవ్వుతూ, నవ్వుతూ... చప్పట్లు!

ఆ పాటయ్యాక, కొమరాలు గంగెద్దును అత్తగారి మీద కొత్తకోడలిగా పోల్చుతూ.. వెనకెనక్కి నడిపించడంతో అది పూర్తిగా డీలా పడిపోయింది.

కొమరాలు గంగెద్దు దీనస్థితిని గమనించాడు. కాని ఆట ఆపుజేస్తే పెద్దాసామి ఊరుకునే రకం కాదు. ఊరి జనం ఉమ్మేసి, పెట్టే పిరికెడూ పెట్టకుండా పోతరు. "జాంపండూ... మాట దక్కియ్యి" అని లోలో గొణుక్కొని, చుట్టూ నిల్చున్న జనాలకి దండంపెట్టి, గంగెద్దు ముంగాళ్ళ మీద కూర్చొని, గంగడోలు నిమురుతూ, దాని నాలుగు కాళ్ళూ తొడల మీదకు లాక్కొని... గంగెద్దు మొత్తాన్నీ భరిస్తూ, బాధను అణిచిపెట్టుకొని, గొంతు చించుకుంటుంటే... మద్దెలకు తోడు జనం చప్పట్లతో ఊరు మార్మోగింది. పెద్దాసామి మీసాన్ని మెలేసి నవ్వుకున్నాడు.

మరొక్క ఆట! అదొక్కటయితే మాట దక్కుద్ది. కడుపు నిండుద్ది. చొప్ప దొరుకుద్ది. అనుకొని కొమరాలు, నేల మీద తన ఎర్రంచు కండువా పరిచి, జనం చుట్టూ తిరుగుతూ చేతులు పబ్బంపట్టి... 'దయగల రాజులు, సీతమ్మ తల్లులు... యీ పేదోడి గుండెల మీద బసవన్న గంతులు చూడండి. మెచ్చిన దొరలు - ఈ బసవన్నకో తుండుగుడ్డ, పంచెగుడ్డ... కుంచెడు వొడ్లు, సోలెడు కందులు, పిరికెడు మిర్పకాయ... దయగల తల్లులూ.. దయజూడండి.." అంటూ వెల్లికిలా పడుకొన్నాడు కొమరాలు.

రాంపండు గంగెద్దును పట్టుకున్నాడు. తిరపాలు మద్దెల వాయిస్తున్నాడు. జనాలు ప్రాణాలు ఉగబట్టుక నిలుచున్నారు. దూరదూరాల్లో ఉన్న వారు దాపుగా చేరుతున్నారు. పొలాలకేసి వెళ్ళేవారు పని మరిచి నిలబడిపోయారు. పొలాల నుంచి వస్తున్న వారు ఇల్లు మరిచి చూస్తుండిపోయారు. అడవి నుంచి కట్టెలు తెచ్చేతను మోపు కింద పడేసి... బీడు నుంచి గడ్డిమోపుతో వచ్చినతను గడ్డిమోపుని పక్కగా నిలబెట్టి... అంతా నిలువు గుడ్లేసుక నిలుచున్నారు. గుండెల మీద గంగెద్దు నాలుగు కాళ్ళూ నిలిపి, మనిషి బతగ్గలడా? గుండెల చితకవూ? అందరి మొహాల్లోనూ అదే ప్రశ్న! అదే కుతూహలం! భయం... బాధ!!

చప్పట్లతో, ఈలలతో, మద్దెల మ్రోతతో అప్పటి వరకూ దద్దరిల్లిన ఆ ప్రదేశం ఒక్కసారిగా నిశ్శబ్దానికి నిలయమై పోయింది.



# నిజంగా కలుసుకుంటాం...

జాన్ హైడ్‌కనుమూరి

ఒకే తోటలో పూసిన పూలుగా
కత్తిరించబడినప్పుడు
ఒక్కటై జట్టుకడతాం
అంతలోనే
ఒంటరి బొకేలుగా విడిపోయి వెళ్ళిపోతుంటాం
ఎవరోవొకర్ని అభినందించడానికి

కలసిన పరిచయాల కరచాలనపు స్పర్శను తనలో దాచుకొని
జారిపోయాననుకొనే కాలం
అసంకల్పితం కాదు అందుకే
అది దాచుకోలేక
మనల్ని వర్తమానంలో కలుపుతూనే వుంటుంది

అక్షరాల నెగళ్ళల్లో
చలికాసుకుంటున్న వెచ్చదనం
తగులుతున్నప్పుడు
అప్పటిదాకా వెచ్చదనం కోసం
వేసుకొన్న వస్త్రాలను విప్పుకుంటూ
కలుసుకుంటూంటం

పదాల చౌరస్తాలలో
విభేదాన్ని భుజానవేసుకొని
చెరోదారై విడిపోయినా
నిరంతరం చలించే జ్వలించే అక్షరం
ఏవో బంధాల్ని కూరుస్తున్నప్పుడు
భుజానవేసుకొన్న విభేదాన్ని
కన్పడకుండా ఓవర్ కోటు వేసుకొని
పలకరింపుల నవ్వుల్ని పులుముకుంటూ
కలుసుకుంటూంటం

ఒకరికొకరము తెలియని ధృవాలలో
రేఖల వృత్తాలు గీసుకుంటున్నప్పుడు
అక్షాంశ రేఖాంశాల పరిభ్రమణంలో
ఎక్కడోవొకచోట కలుసుకుంటాం
వెల్లువెత్తిన భావాలను
కెరటమై ఎగసిపడినప్పుడు
ఆనందాన్ని పువ్వులుగా పూయించి
అభినందనతో వెంటవచ్చిన పరిమళం
పదేపదే శ్వాసకు తగులుతున్నప్పుడు
కలుసుకుంటూనే వుంటాం

ప్రయాణికుల్లా తటస్తపడినప్పుడు
ఎన్నో మజిలీల స్టేషన్లను వెనుకకు నెట్టేస్తూ
నవ్వుల జల్లులో తడుస్తూనే
హఠాత్తుగా ఆగే స్టేషన్లో
మనల్ని మనం కత్తిరించుకుంటూ దిగిపోతుంటాం
తెగిపడిన ముక్కలు మాట్లాడే పలుకులను
కలుసుకున్న క్షణాలన్ని
జ్ఞాపకాలుగా ప్రోది చేసుకుంటూ
చేదుకుంటూ కలుసుకుంటూంటం

కలవాలనుకొనే
కుతూహలపు దారుల్లో
ఎదురెదురుగా పోతున్నా
ఆగలేని ఒన్ వేలలోపడి దాటిపోయినప్పుడు
చూపులతోనే మూగతరంగాలలో
స్పృశించుకుంటూ కలుసుకుంటూంటం
కాని...
తన్నుతాను వెతుక్కుంటున్న వాడు
కాలాల దారుల్లో
నిన్నూ, నన్నూ నిద్రలేపి
పదాలబంధాల ఫ్రేములలో పెట్టి
బూతద్దపు నేత్రాలతో వెతుక్కుతున్నప్పుడు
అక్షరనాదమై
వెతుకులాటల జీవనాదంలో
నిజంగా కలుసుకుంటాం

---

జనం శ్వాసను ఉగ్గబట్టారా?... అనుకునేంత నిశ్శబ్దం!

రాంపండు గంగెద్దును కొమరాలు దాపున నిలిపాడు.

వెల్లికిలా పడుకున్న కొమరాలు గంగెద్దు ముందు కాళ్ళను గోముగా నిమురుతూ ఓ కాలిని ఛాతీపై నుంచుకొన్నాడు.

జనం శ్వాసించడం మర్చిపోయినట్టుగా ఉంది వాతావరణం!

కొమరాలు గంగెద్దు మరో ముందు కాలునూ ఎత్తి ఛాతీపై ఉంచుకొన్నాడు.

గంగెద్దు - నీరసంగా ఉంది. ఆకలిగా ఉంది. కళ్ళు వాలిపోతున్నట్టుగా ఉంది. మనుష్యుల మధ్య నుంచి పారిపోయి అడవిన బడి బతకాలని ఉంది. చిరాగ్గా ఉంది. బాధగా చుట్టూ చూసింది. దాని కంటికి గడ్డిమోపు... పచ్చపచ్చని గడ్డిమోపు కనిపించే సరికి కళ్ళు రెపరెపలాడాయి. నోటిలో లాలాజలం ఊరింది.

మరుక్షణమే - ఆకలితో రెండ్రోజుల్నుంచి నకనకలాడే ఆ గంగెద్దు, చెంగున ఎగరడంతో దాని ముందు కాళ్ళు కొమరాలు ఛాతిని బలంగా తాకాయి. గంగెద్దు గడ్డిమోపు కేసి మరో గంతేసే సరికి, దాని వెనుక కాళ్లూ మరోసారి, మరింత బలంగా కొమరాలు ఛాతిని తాకాయి!

గంగెద్దు బెదిరి తమ మీది కొస్తుందన్న భయంతో జనం చెల్లాచెదురయ్యారు. కొమరాలు వేసిన చావుకేక ఎవరి చెవినా పడలేదు. పట్టించుకోనూలేదు. అందరి చూపులూ గంగెద్దు మీదనే ఉన్నాయి. గంగెద్దు చూపులు గడ్డిమోపు మీద ఉన్నాయి.

మరో రెండంగల్లో అది గడ్డి మోపు మీద పడి ఆబగా, గబగబా గడ్డి తిన సాగింది.

కొమరాలు ఛాతికి తగిలిన గంగెద్దు కాళ్ళ దెబ్బలకు అతని గుండెలు చితికి, రక్తం కదిలి, నోటి నుంచి రక్తం చిందరవందరై... ఆ క్షణమే కొమరాలు తల వాల్చేశాడు...!

❖

# 'బెస్ట్ సెల్లర్'
# ఆర్థర్ హెయిలీ

ఒక పుస్తకం బెస్ట్ సెల్లర్ కావటంలో రచనా సామర్థ్యం, వాసి కన్నా మార్కెటింగ్ వ్యూహం, పబ్లిసిటీ ఎక్కువ ముఖ్యం, బెస్ట్ సెల్లర్ ఒక వ్యాపార వస్తువు. కమాడిటీ.
ఒక సక్సెస్‌ఫుల్ కమర్షియల్ నావెలిస్ట్ (న్యూయార్క్ టైంస్ పత్రిక యిచ్చిన కితాబు) ఆర్థర్ హెయిలీ యిటీవల బహామాస్‌లో తన ఎనభై నాల్గవ ఏట మరణించాడు. ఈయన రాసిన నవలలు యిప్పటికి నూటయాభై మిలియన్లు (ఇది పదేళ్ళ నాటి అంచనా) అమ్ముడుపోయాయట.
ఈయన భార్య షీలా తన వైవాహిక జీవితం గురించి రాసిన పుస్తకం పేరు "ఐ మారీడ్ ఎ బెస్ట్‌సెల్లర్"



పార్థసారథి

"నాకు కొన్ని అభిమాన పత్రిక లున్నాయి. వాటిని చదవాలంటే అభిమానం అడ్డొస్తుంది." అంటూ చమత్కరించాడు ఆరుద్ర. అలాగే కొందరు సాహిత్య ప్రియులకు బెస్ట్ సెల్లర్లు చదవటమంటే అడుసు తొక్కినట్టుగా వుంటుంది.

బెస్ట్ సెల్లర్లకు పుట్టినిల్లు అమెరికా. పారిశ్రామిక విప్లవం తర్వాత ఫ్యాక్టరీ ఉత్పత్తులను అతి తక్కువ సమయం (షెల్ఫ్‌టైం)లో అత్యధికంగా అమ్ముకోవటం ఒక కీలక వ్యాపార వ్యూహంగా మారింది.

తొలిదశలో ఇంగ్లండులో పెన్నీ నావెల్స్, అమెరికాలో సీసైడ్ రొమాన్సులు (జాక్ లండన్ 'ఐరన్ హీల్'లో ఈ ప్రస్తావన వస్తుంది) మార్కెట్టును ముంచెత్తాయి. ఇక్కడ వచ్చిన కొవ్వలి లక్ష్మీనరసింహారావు నవలలు (సహస్రాధిక నవలా రచయిత) కొందరికైనా గుర్తుండే వుంటాయి.

ఈ బెస్ట్ సెల్లింగ్ నవలలకు పాపులర్ నవలలని ముద్దుపేరు. డికెన్స్, మార్క్‌ట్వేన్ లాంటి వాళ్ళ రచనలు బహు ప్రాచుర్యం పొందినవే. (పండిత, పామర రంజకాలు) కాని అది బెస్ట్ సెల్లర్లు కావు. అవి వందేళ్ళలో అమ్ముడుపోయినన్ని కాపీలు ఈ పుస్తకాలు కొద్ది వారాల్లోనో, నెలల్లోనో అమ్ముడుపోయి కొత్త బెస్ట్ సెల్లర్లకు పుస్తకాల షాపుల్లో స్థానం కల్పించాలి.

ఒక పుస్తకం బెస్ట్ సెల్లర్ కావటంలో రచనా సామర్థ్యం, వాసి కన్నా మార్కెటింగ్ వ్యూహం, పబ్లిసిటీ ఎక్కువ ముఖ్యం, బెస్ట్ సెల్లర్ ఒక వ్యాపార వస్తువు. కమాడిటీ.

ఒక సక్సెస్‌ఫుల్ కమర్షియల్ నావెలిస్ట్ (న్యూయార్క్ టైంస్ పత్రిక యిచ్చిన కితాబు) ఆర్థర్ హెయిలీ యిటీవల బహామాస్‌లో తన ఎనభై నాల్గవ ఏట మరణించాడు. ఈయన రాసిన నవలలు యిప్పటికి నూటయాభై మిలియన్లు (ఇది పదేళ్ళ నాటి అంచనా) అమ్ముడుపోయాయట.

ఈయన భార్య షీలా తన వైవాహిక జీవితం గురించి రాసిన పుస్తకం పేరు "ఐ మారీడ్ ఎ బెస్ట్‌సెల్లర్"

ఆర్థర్ హెయిలీ పుస్తకాలను వండే పద్ధతేమిటో ఆవిడ మాటల్లోనే తెలుసుకుందాం.

"ఆర్థర్‌కు ఉత్కంఠభరితంగా కథ చెప్పటం తెలుసు. అంతేకాదు. ఏ కథా వస్తువు ఎప్పుడు రాస్తే బాగా అమ్ముడుపోతుందో మొదట అధ్యయనం చేస్తాడు. కొన్నిసార్లు సర్వే కూడా చేసి తెలుసుకోవలసి వుంటుంది. ఒక్కొక్క పరిశ్రమ గురించి సాంకేతిక పరిజ్ఞానం సమకూర్చుకుని దాన్ని కథగా చెబుతాడు. ఉదాహరణకు - మనీ ఛేంబర్స్ - బ్యాంకుల గురించి, ఎయిర్ పోర్ట్ - విమాన పరిశ్రమ, వీల్స్ - కార్లు, హోటల్ - హోటళ్ళ గురించీ, ఓవర్ లోడ్ - విద్యుచ్ఛక్తి, ది ఈవినింగ్ న్యూస్ - మీడియా.

మొదట పబ్లిషర్లతో కలిసి కూర్చుని కథా వస్తువు నిర్ణయిస్తాడు. తరువాత అనేక మంది సంబంధిత వ్యక్తుల్ని యింటర్వ్యూలు చేసి, ఆ పరిశ్రమను పరిశీలించి కథ అల్లుతాడు. ("ఇతని నవల లన్నింటిలోనూ ఒకే పాత్రలు, ఒకే ప్లాటు ఒకే కథన సంవిధానం. కేవలం సబ్జెక్టు మాత్రమే మారుతుంది." అని పెదవి విరుస్తారు కొందరు) సినాప్సిస్ రాసి మళ్ళీ పబ్లిషర్లతో మీటింగ్‌లో వాళ్ళ సలహాలు, సూచనల మేరకు మార్పులు చేర్పులు చేసి మార్కెట్ ధోరణికి అనుగుణంగా కథ తయారు చేస్తాడు. (బెస్ట్ సెల్లర్లను సబ్ కల్చర్‌గా పరిగణిస్తారు. సోషియాలజిస్టులు) వందేళ్ళ క్రితం అప్టన్ సింక్లెయిర్ మాంసం పరిశ్రమ గురించి రాసిన "జంగిల్ (నవల)" ఫ్యాక్టరీ చట్టాలను మార్చటానికి ప్రభుత్వం మీద ఒత్తిడి తెచ్చింది. ఏ పరిశ్రమ గురించి, లేదా మరేమి రాసినా హెయిలీ లాంటి వాళ్ళ (సిడ్నీ షెల్డన్, జెఫ్రీ ఆర్చర్, జాన్ గ్రిషాం, టాం క్లాన్సీ యిత్యాదుల) నవలల ప్రధాన ఉద్దేశం కాలక్షేపం. ఏకబిగిన చదివించటం.

అమెరికా చేసిన (చేస్తున్న) కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారంలో హాలీవుడ్ సినిమాలు, పాపులర్ నవలలు ముఖ్యపాత్ర పోషించాయని అందరికీ తెలుసు. ఈ మీడియా కుట్రల గురించి చాంస్కీ తన "మాన్యుఫాక్చరింగ్ కాన్సెంట్ (తెలుగులో - మార్కెట్ మాయాజాలం)లో చర్చించాడు.

పుస్తక వ్యాపారులకు దండిగా లాభాలు ఆర్జించి పెడుతున్న ఈ బెస్ట్ సెల్లర్ల తయారీ పరిశ్రమ (మార్కెటింగ్, డిస్ట్రిబ్యూషన్) అధ్యయనాన్ని ఎంబిఏ కోర్సుల్లో చేర్చాలని డిమాండ్ పెరుగుతున్నదట.



# ఒక పక్షి - ఒక ముసలి సత్రం

**సిరికి స్వామినాయుడు**



రెక్కలొచ్చిన పక్షి
పచ్చని కొమ్మనూ పొదిగే రెక్కనొదిలి
పశ్చిమ తీరానికెగిరి పోతోంది
వేటగాడు విసిరిన నూకల కాశపడి
చిక్కుల ఆకాశంలో చిక్కుకుపోతోంది
నియాన్ కాంతుల్లో
ఉషోదయాల్ని కలగంటోంది
కమ్మని చిగుళ్ళకు బదులు
కంప్యూటర్ చిప్స్ తింటోంది

గూటిలోంచి చావుకేక విన్పిస్తే
కాలిగోటినొప్పి కుంటిసాకై రాలేనంటుంది
చితి మంటల కెరటాల్ని
శాటిలైట్ విండోల్లోంచి చూస్తుంటుంది
చిగురాకు దొన్నలో
చితాభస్మాన్ని పంపలేదని చిరాకుపడుతుంది

ఏ కన్నీటి రుతువులోనో వాలిన సైబీరియన్ పక్షికి
పుట్టి పెరిగిన చెట్టు పోగేసిన పెంటలా కన్పిస్తుంది
గూటిలో గలగలా పారే సెలయేరు తెగి
పరదేశీ ఎరువు కూతల మురిక్కాలువ ప్రవహిస్తుంది
తడి ఆవిరై
గుండెలో యిసుక తీరాలు విస్తరిస్తాయి
ఆనందం పూవులై విరియక ముందే... పక్షి
ఆత్మీయతను కాలదన్ని ఎగిరి పోతుంది
ముసలి పక్షుల కళ్ళలో
మళ్ళీ శూన్యావరణం అలుముకుంటుంది
కోటి ఆశల కొమ్మల మీదెగరేసిన గాలిపటాలు తెగి
దుఃఖపుదారాలు మిగిలి పోతాయి
కొమ్మల కిటికీల్లోంచి
ఎదురు చూడటమే వాటి దినచర్య

యిపుడు...
అన్ని నిరాదరణల నడుమ శిథిలమైన గూడు
కట్టెలు పేర్చిన కావేరి
వేయి శిశిరాల్ని మోస్తున్న చెట్టు
ఓ ముసలి సత్రం

# కంచి - ది నేమ్ ఆఫ్ ది రోజ్

**పినాకి**



మరమరాలూ, అపరాధ పరిశోధన నవలలూ యిష్టపడని వాళ్ళెవరూ వుండరు. హంతకుడెవ్వరో వుత్కంఠభరితంగా, చివరి పేజీ దాకా దాచిపెట్టే మామూలు కథ కూడా కొందరి చేతుల్లో కావ్య రూపాన్ని సంతరించుకుంటుంది. ఫ్రెడెరిక్ డ్యూరెన్ మాట్, అంబర్టో ఇకో లాంటి రచయితలు డిటెక్టివ్ కథలను తాత్వికాన్వేషణ స్థాయికి తీసుకెళ్ళారు.

క్రీ.శ.1327 ఇటలీలోని ఒక ఆబీ. అంటే మఠం. అందరూ సన్యాసులే. ఉపవాసాలూ, కఠోర తపస్సూ, నిరంతర భగవన్నామస్మరణా, బ్రహ్మచర్యమూ. ఐహిక విషయాలకు ఆడమ దూరంగా గడిపే బతుకులు.

అలాంటి అతి పవిత్ర ఆశ్రమంలో వరుస హత్యలు జరుగుతాయి. అపరిచితులకు ప్రవేశం లేనిచోట హంతకులు ఆంతరంగికులు కాక మరెవ్వరు? కాని అంతకన్న ముఖ్యం. కారణమేమిటి?

క్షణభంగురమని, ఈ తుచ్ఛ జీవిత సుఖాల్ని విసర్జించి, పరలోక ప్రాప్తి కోసం రెండు చేతులా ప్రార్థించే మునిపుంగవులకు చంపటానికి చేతులెలా వచ్చాయి? చీమకైనా కీడు దలపరాదు. సర్వచరాచర జగత్తులో వ్యాపించి వున్నదా భగవదంశే.

ఒకటి కాదు రెండూ కాదు ఏడు హత్యలు.

ఆధ్యాత్మిక పుణ్యక్షేత్రాన్ని సేవించుకోవటానికి ఇంగ్లండు నుంచి వస్తాడు బ్రదర్ విలియం.

దేవుడు సర్వశక్తిమంతుడు. దేవుడికీ, దేవుడి ప్రతినిధులకూ లొంగ వుండాలి. మతం అధికార వ్యవస్థలో భాగం.

చిరునవ్వు తిరుగుబాటు. అందువల్ల ఘోరనేరం.

అలనాటి క్రిస్టియన్ మతాచారాలు, తాత్విక చర్చలు, వివాదాలు, మఠాలలోని మఠాలు గూడు పుఠాణీలు - పండితులనూ, సామాన్య పాఠకుల్నీ అలరించేలా రాసిన అంబర్టో ఇకోనవల - ది నేమ్ ఆఫ్ ది రోజ్ కథ యిది.

చారిత్రక నవల పాండిత్య ప్రక ఆధ్యాత్మిక సిద్ధాంతాలు, పరిశోధనా గ్రంథ మాత్రమే లభించే సమాచారం, అప పరిశోధన నవలలో పొందుపరిచాడు. ఇలా పుస్తకాలవల్ల డిటెక్టివులకు కూడా విమర్శక సాహితీకోవిదుల దృష్టిలో గౌ స్థానమేర్పడుతుంది.

ఏడు రోజుల్లో జరిగిన వర హత్యల మిస్టరీని బ్రదర్ విలియం ఛేదిం వైనమే ఈ కథ.

కంచి గురించి యిలాంటి రాసేవాళ్ళ కోసం తెలుగు పాఠకు నిరీక్షిస్తున్నారు.

పోలీసులు చెయ్యలేకపోతే, వ మఠం నుంచి మరో సన్యాసి వ పరిష్కరించినా బాగుండును. సన్యాస రహస్యాలు సన్యాసులకే బాగా తెలుస్తా చదువుకున్న సన్నాసులు కూడా వున్నారట

# అమ్మీ! జే సలాం

అన్వర్




**'ఆఫీసు హోగయే బాద్ మే క్యాకర్తా బేరా?' సాయంత్రం ఐదు గంటలప్పుడెప్పుడో ఆఫీసు పని అయిపోయినా రాత్రైతేకానీ ఇంటికి రాని నన్ను అమాయకంగా అడిగేది అమ్మీ. జవాబు చెప్పేంత వోపిక, అవసరం నాకు అన్పించేది కాదు.**

అమ్మీ అమాయకమో, అమాయకమే అమ్మీనో నాకు తెల్వకపోయేది. 'అల్లా దయవల్ల నీకు వుద్యోగమొచ్చిందని" నాకు వుద్యోగం వచ్చిన కొత్తలో ఓసారి అన్నది అమ్మీ. నాకప్పుడు బాగా కోపమొచ్చింది. 'దీవానీ! చదువుతున్న డిగ్రీని మధ్యల్నే ఆపి మెడికల్ కాలేజీల టెక్నికల్ కోర్సు ట్రైనింగ్ ఎందుకు చేసినవనుకున్నవ్? గది చేసినందుకే గిప్పుడు గీ వుద్యోగం వచ్చింది. గిప్పుడు కాకపోతే ఆ తర్వాతైనా వచ్చు. గంతేకనీ ఇండ్ల అల్లా దయ ఏమీ లేదు' అన్నాను.

అమ్మీ నాతో మాట్లేడేదే తక్కువో, ఎక్కువో నాకు తెల్వదు కనీ నేను మాత్రం చాలా తక్కువగా మాట్లాడేది అమ్మీతో. నాతో ఏం మాట్లాడినా ఓ ప్రశ్న లాంటిదే అడిగేది అమ్మీ. నేను జవాబు చెప్తే చెప్పేది. నాకిష్టం లేకపోతే లేనేలేదు. చదువురాని అమ్మీ ఏది చేసినా నాకంతంగా నచ్చకపోయేది. ఇల్లూ వాకిలి వూడ్చుడం, వంట చేయడం, బట్టలుతకడం, బోళ్ళుతోమడం, పిల్లల్ని ఎత్తుకోవడం, ఇంకా ఇలాంటివే సమస్త పనులతోపాటు ఇంటివి బయటివి అన్నీ పనులు ఒక నౌకరానీలాగా చేసేది. మొదటి వర్షాలు కురిసిన తర్వాత ఏమైనా కూరగాయల గింజలు ఇంటి వెనక జాగాలో అమ్మీ పెట్టే ప్రయత్నం చేసినా మా అబ్బ ఇంజనీరు లెక్క అక్కడనీ, ఇక్కడనీ అక్కడ కాదు ఇక్కడనీ, ఇక్కడ కాదు అక్కడనీ, అసలొద్దనీ ఇంకేమేమో అనేవాడు. ఇల్లు అబ్బది కాబట్టి గోడ మీద మొలకొట్టినా, ఇంటెనక భూమిల ఏదైనా గింజనాటినా అంతా అబ్బ ఇష్టప్రకారమే కావాలి. ఐతే, ఇవన్నీ అబ్బ ఇష్ట ప్రకారమైనా ఆయన లొల్లికి అంతే వుండకపోయేది. నీళ్ళు చేదినా, చేదకపోయినా, బకీట్లు నింపినా, నింపకపోయినా కష్టమే! అట్ల ఇట్ల కాకుండా బకిట్లల్ల కొంచెం నీళ్ళుంచినా కష్టమే. తనకు తప్ప ఎవ్వరికి ఏమీ తెల్వదనీ, ఎవ్వర్కి ఏమీ చేయరాదనీ, తను తప్ప ఎవ్వరూ ఏమీ చేయలేరని అబ్బ మనస్తత్వం. ఇంట్ల ఎవరైనా ఏదైనా చేసినా కష్టమే. చేయకపోయినా కష్టమే. రోజుకు పద్దెనిమిది గంటలకు పైగా అదే పనిగా అరవడం మా అబ్బ అలవాటు. ఐతే, గివన్నీ తిట్లే. గిండ్ల పన్నెండు గంటలకు పైగా మా అమ్మీని, నానీని, ఖాలాలను, మామాలను వీళ్ళతోపాటుగా నన్ను, అన్నను, వదినను, పిల్లలను, తమ్ముళ్ళను, మా అక్కచెల్లెళ్ళను అందర్ని తిట్టేవాడు. చేతికి ఏది దొరికితే దాన్తో ఇసిరి కొట్టేటోడు. గింత చేసినా మా ఖాందాన్‌ల కానీ, మా ఇంట్లకానీ అబ్బను ఛీ అన్నోళ్ళే లేరు. పోనీరా! అబ్బ కదా అనేటోళ్ళు. గియ్యాల కొత్తనా గట్లనుడు అనేటోళ్ళు. వుత్తుత్తగనే ఎందుకంటడురా అనేటోళ్ళు. ఇగ అందర్ని తిట్టి అలుగుడు ఆయన వంతే. అలిగి బండల పని, కంపపని, కట్టెలపని ఇంకేమేమో పనులు చేసుడు ఆయన వంతే. అట్ల చేస్తాంటే దెబ్బ తగులుడో, రక్తం కారుడో అయితే మళ్ళీ కొంపలు కూలినట్టు అరుసుడు ఆయన వంతే. గిదంతా అమ్మీ బరించుకుంట ఎట్ల బతికేదో కానీ మా బతుకంతా నరకంలాగుండే.

ఐతే, వాడలోల్లను, బయటి వాళ్ళనొక్కళ్ళనీ కూడా తిట్టని మహానుభావుడు మా అబ్బ. ఇంగ వాడల ఎవ్వరింట్లైనా గొడవైనా గవాండ్ల ఇండ్లల్లకు పోయి వాళ్ళ గడ్డం పట్టుకొని బతిమాలుడు, కడుపుల తలపెట్టి గవాళ్ళను సముజాయించుడు, ఆ కోపంల వున్నోళ్ళను మా ఇంటికి తీసుకొచ్చి కూసోపెట్టి గదిగిదీ మంచిచెడు గవాళ్ళకు చెప్పేటోడు. ఏ దునియాల కనపడుతడు, ఏ సినిమాల కనపడుతడు మా అబ్బలాంటి మనిషి అనుకునేది నేను. గిట్ల ఈయన లెక్క ఇంకెవ్వరైనా ఇంకెక్కడైనా వుంటరా అనుకునేది. అబ్బ మాకేమో శత్రువు, పూరందరికి ఆప్తుడు అన్పించేది నాకు.

స్నేహం, స్నేహం, స్నేహాలు చేయబట్టి నేను ఇంట్లకెళ్ళి బయటి కెళ్ళింనంటే ఇంట్ల రోజూ ఎప్పటిక్క జరిగే గొడవంతా వెంటనే మరచిపోయేటోన్ని. వాస్తవంగా, నేను బయటుంటే అమ్మీ కానీ, అబ్బకానీ ఇంకెవ్వరూ కూడా గుర్తుకు రాకపోయేది నాకు. నేను కూడా గుర్తు చేసుకోకపోయేది. ఎప్పుడైనా అమ్మీ పైసలిస్తనని ఇయ్యకపోయినప్పుడు 'దీవానీ-హౌళది. ఇయ్యాల పైసలిస్తనన్నది. అని గుర్తొచ్చేది అమ్మీ. కాలేజీకో, పుస్తకాలకో, నా అవసరానికి నేను పైసలడిగినప్పుడో పైసలు ఇచ్చేది నాకు. నా కోసం పైసలిచ్చుడు ఎంత కష్టమైనా, ఇంట్ల ఎల్లకపోయినా గొడవెందుకు నాతో అని ఇచ్చేది అమ్మీ. ఇచ్చుకుంట మళ్ళీ అడగకు అనేది. పెద్ద ఇచ్చినవ్ తీ-మళ్ళా అడగకు అంటాంది అనేటోన్ని. ఎప్పుడైనా పైసలడిగితే 'కల్ రేతిం' అనేది. 'కల్ నైదియేతో దేఖో' బెదిరించుకుంట అనేటోన్ని. అమ్మీ ఎప్పుడు మాట తప్పలేదు. ఎందుకురా పైసలు అని అడగాలనుకునేది. ఐనా నన్నెప్పుడు అడగలేకపోయేది. ఫీజు కట్టిన్నో లేదో అన్న సంశయం వున్నా అడగలేకపోయేది పైసలేం చేసినవురా అని.



పొడవైన రైలు డబ్బాలాంటి మా ఇంట్ల మూడు రూముల తర్వాత వరండా, అక్కడ బాయి, బాత్రూం ఉండేది. తర్వాత రెండు రూపాయలు. దాని తర్వాత ఖాళీ జాగా. ఇంట్ల నేనున్నంత సేపు ముందురూమో, రెండో రూములోనో లేదంటే ఖాళీ జాగాల వుండేటోన్ని ఎక్కువగా. అప్పుడప్పుడు అమ్మీ నా ముందునించి అటు ఇటు తిరిగేది. ఏమైనా అడుగుదామనుకొని నా ముందుకొచ్చిందో లేదో అడగలేక వెళ్ళిపోయేది అట్ల ఒక చిత్రవధ అనుభవిస్తున్న అమ్మీ పరిస్థితి మొత్తం అర్థమైపోయేది నాకు. నేను 'క్యాహై' అని ఎందుకనాలనుకునేటన్ని. 'దీవానీ! ఏదో అడుగుదామనో, చెప్పుదామనో చెప్పలేకపోతుంది. క్యాహౌ అంటే చెప్తది కావచ్చు అనుకునేటోన్ని.' అమ్మీతో మాట్లాడేది ఏందీ అనిపించేది నాకు. ఇంట్ల టేపు రికార్డర్‌ల పాట, పాటతోపాటు నేను పాడేపాటే నాలోకంగా వుండేది.

ఇంట్లో వున్నానంటే ఎవరెవరో వచ్చేది నా కోసం. నా కోసం ఎవరో వచ్చిండ్లు అని పొయ్యి దగ్గర వున్న అమ్మీకి వెంటనే తెలిసిపోయేది. మా ఇంట్ల కనీసం ఛాయ్ తాగకుండా పోయిన నా మిత్రులు చాలా తక్కువ. అమ్మీ నాకు, స్నేహితునికి ఛాయ్ తీసుకొస్తే వచ్చి ఫ్రెండ్ వెళ్ళిపోయి అప్పుడప్పుడు ఇంట్ల నేనొక్కణ్ణే వుండేటోన్ని. అమ్మీ ఏమంటది. నేనే అనేటన్ని కిరణ్ వచ్చి ఇప్పుడే పోయిండు. కొంచం ముందుగాల తేవొద్దా ఛాయ్ అని. ఎప్పుడు ఏమన్నా సంజాయిషే ఇచ్చేది అమ్మీ. పొయ్యి మీద అన్నముండే. దింపేటట్టు లేకుంటే అనేది.

ఎప్పుడైనా నేను రాత్రి ఇంటికి రాకపోతే - తెల్లారే నాలుగు గంటలకే ఇంటి ముందు అరుగు మీద కూసునేదట అమ్మీ. ఎవరైనా 'ఏందీ! పొద్దున్నే లేసిన వక్కా అని అంటే' రాత్రి కొడుకు రాలేదమ్మా అనేదట. అట్లనే నేనొచ్చేంత సేపు కూసునే వుండేది. బాగా తెల్లారినా నేనింకా రాకపోతే ఇంట్ల చిన్నచిన్న పనులు చేసుకుంటనే వచ్చి అరుగు మీద మళ్ళీ కూసునేదట. తెల్లారిగట్ల నేను ఆ గల్లీలకి వచ్చిన్నో లేదో అరుగు మీద అమ్మీ నా కోసం ఎదురు చూస్తూ కూర్చున్నది కనపడేది. నేను కనపడితే చాలు - కనపడ్డ వెంటనే అరుగు మీదికెళ్ళి లేసి ఇంట్ల కెళ్ళిపోయేది. అప్పుడప్పుడు 'రాత్రి నువు రాకపోతే నిద్రపట్టలేదు. పూకే నువ్వే పిలిచినట్టు అయ్యింది. రాత్రంతా ఎన్నిసార్లు తలుపుతీసినా నువ్వు కనపడలేదు - అనేది. లేకపోతే 'కిరణ్ ఇంటికి పోయినవేమో' అనుకున్నా అనేది. ఆ రాత్రి కిరణ్ ఇంట్లకాదు, గిరి ఇంట్ల వున్నా, వెంకట్ రూంల వున్నా, శ్యాం తోటి వూరికి పోయిన అని ఆ రాత్రి ఎక్కడున్నానో చెప్పాలనిపించేది కాదు. పైగా 'దీవానీ క్యా! రాత్రి తొమ్మిది దాటినంక నేను ఇంటికి రాకపోతే రానట్టేనని చెప్పిన్నా! నా కోసం రాత్రంతా సూడొద్దు. పొద్దున్నే ఎవరు లేవకముందే లేచి అరుగు మీద కూసొద్దు. ఇంకా, కొడుకు రాలేదని ఎవరికి చెప్పొద్దు అని ఎన్నిసార్లు చెప్పినా నీకు అర్థం కాదా ఏందీ - 'ఇంకోసారి నా కోసం సూడకు. తలుపు కొట్టినట్లయ్యిందట - తలుపు...' అనుకుంటనే ఇంట్లకు పోయేటోన్ని.

మరి గిట్ల చెప్పినోనివి రాత్రి తొమ్మిది దాటింతర్వాత కూడా ఇంటికి చాలాసార్లే వచ్చినవ్ కదా అని అమ్మీ ఎప్పుడూ అనకపోయేది. తొమ్మిది దాటింతర్వాత ఇంటికి రానని అన్నోన్ని తొమ్మిది దాటింతర్వాత ఎన్నోసార్లు ఇంటికిపోయిన.

ఇగ, ఆమ అమ్మీ గురించి నాకు కొన్ని ఆశ్చర్యాలు వుండే చిన్నప్పుడూ, పెరిగిన తర్వాత కూడా! మా ఇంటిముందు పొద్దున్నే ఏడెనిమిది మంది దాకా కూరగాయలు అమ్ముకునేటోళ్ళు 'కూరగాయలు, కూరగాయలు' అని అర్సుకుంట నిలబడేటోళ్ళు. అంతో, ఇంతో ఇచ్చి ఒక్కొక్కరి దగ్గర అమ్మీ ఏదో ఒకటి కొనేది. అప్పుడప్పుడు అమ్మీ వాళ్ళ దగ్గర తీసుకోకపోతే 'అక్కా! ఏదో ఒకటి తొందరగా తీసుకోరాదూ - బోణీ చెయ్ తల్లీ! అవతల ఎండపొద్దెక్కేతాందీ' అనేటోళ్ళు. అమ్మీ లోపలెక్కడో పనిల వుండి బయటికి రాకపోతే' అమ్మీలేదు అమ్మీలేదు ' అనేటోన్ని. దీనంగా, భారంగా వాళ్ళు పోతాంటే నవ్వొచ్చేది నాకు. అమ్మీకొంటే వాళ్ళ కూరగాయలు తొందరగా అమ్ముడు పోతాయనే ఆశ వాళ్ళదని నాకు తర్వాతర్వాత తెలిసింది. అట్లనే మా వూర్లే ఒక ఆర్.ఎం.పి. డాక్టర్ వున్నడు. రాత్రిళ్ళు మేం నిద్రల వున్నప్పుడెప్పుడో తలుపు సప్పుడయ్యేది ఎవరో పిలిచినట్టు. ఎవరు పిలిచినా, తలుపు కొట్టినా మేమెవ్వరం పోయి తలుపు తీసేటోళ్ళం కాదు. అమ్మీయే తలుపు తీసేది. ఎవ్వరొచ్చినా, ఎప్పుడొచ్చినా వాళ్ళను కూసోండ్లి, కూసోండ్లి అనేది అమ్మీ. అయితే డాక్టర్ మాత్రం ఎప్పుడు కూసోకపోయేటోడు. చిన్నగా, తొందర తొందరగా అమ్మీకి ఏదో చెప్పేటోడు. 'నువ్వు తొందరగా రా అక్కా' అనేది మాత్రం మాకు వినపడేది. డాక్టరొచ్చిండంటే అమ్మీ ఒక్క నిముషం కూడా లేటు చేయకుండా వెంటనే డాక్టరుతో వెళ్ళిపోయేది అమ్మీ. 'దేఖో - సోయేక్యా. డాక్టరాయే. మై జల్దీ ఆతీ. తుం వుటకే బైటో. బచ్చే డర్తే అని వరండాల పడుకున్న అబ్బాను లేపి చెప్పిపోయేది అమ్మీ. డాక్టరెప్పుడొచ్చినా అమ్మీ ఎందుకు పోతదో అర్థం కాకపోయేది మాకు. ఒకటి రెండుసార్లు నేను కూడా వస్తనని ఏడిస్తే 'మా అమ్మీకాలు

మంచిదిరా. తేదీ అమ్మీపోయి నిలబడితే కష్టమయ్యే కాన్సు కూడా తొందరగా అయితది. ఎవరికైనా కాన్సు కష్టమైతే ఇంజక్షన్లిచ్చినా కానపుకాకపోతే డాక్టర్సాడు అమ్మీని తీసుకపోడానికి – జల్దీ ఆతీ, సోజావో అనేటోడు' అబ్బ. మాకు అప్పుడప్పుడు నిద్ర పట్టేది. భయంభయంగా వున్నప్పుడు నిద్రపట్టకపోయేది. అమ్మీ వొచ్చెంత – వరకు అబ్బ పాన్ చేసుకొని, నోట్లో వేసుకొని నములుకుంట బయట అరుగు మీద ఎదురు చూస్తూ కూర్చునేటోడు.

మమ్ముల్ని, ఇంటిని వదిలి అమ్మీ ఎప్పుడు ఏ వూరికి పోకపోయేది. ఐనా ఎక్కడసుత సుట్టాలు లేరు మాకు. మొరెండో అక్కను పర్వతగిరికి ఇచ్చినం. అమ్మీ ఏమైనా – పోతే పర్వతగిరికి పోయేది. పోవడానికి పదిహేను రోజుల ముందు నుండి చెప్పేది వూరికి పోతా అని. పద్నాలుగు రోజుల వరకు సరే అని కానీ, పో అని కానీ అని ఏమీ చెప్పేటోన్ని కాదు. అమ్మీ ఇంట్ల లేకపోతే నేను ఇంట్ల వుండననీ అమ్మీకి తెలుసు. ఒక వేళ వుంటే ఇంట్ల చెల్లెలు వండే వంట నేను తిననసుకునేది. ఏదైనా లొల్లి చేస్తనేమోనని, అన్నం ఎవరు పెట్టినా తిననేమో అనుకునేది. అమ్మీ నా గురించి పడే ఆరాటంవల్ల ఇదంతా అర్థమయ్యేది నాకు. సంవత్సరాల తర్వాత ఎప్పుడో ఒక్కరోజు ఒకే ఒక్క వూరికి పోయే అమ్మీ ఎన్నో రోజుల ముందు నుండి ఆతృతపడేది. పొద్దున పోయి సాయంత్రంరా అని అంటే వాళ్ళు రానీయరేమో అనేది. తెల్లారే వస్తాను అనేది. అమ్మీ అక్క దగ్గర వున్న ఆ రోజంతా ఎన్ని వందలసార్లు గుర్తు చేసుకునేదో నన్ను. కిరణ్, గిరి, శ్యాం అన్నీ ఇళ్ళు నావే. ఎక్కడో అక్కడ వుండేది ఆ రోజు నేను. ఒక్కసారైనా గుర్తు చేసుకోకపోయేటోన్ని అమ్మీ ఇవ్వాళ ఇంట్లదేని కానీ, అమ్మీ ఇవ్వాళ వూరికి పోయిందని కానీ.



అమ్మీ లేని ఇంట్ల వున్నట్లయినా వుండదనే విషయం అమ్మీ శాశ్వతంగా లేకుండా పోతనే తెల్సింది. 'బతుకంతా నువ్వు అమ్మీతో మాట్లాడింది కొంచమేరా?' అని నా మనస్సు ఇవ్వాళ రోజుకు వందసార్లయినా ఎక్కిరిస్తది నన్ను. ఎంత మాట్లాడకుండా వుండిందో కానీ నేను జీవితమంతా భద్రంగా దాచుకునే కొన్ని మాటల్ని అమ్మీ మాట్లాడింది అప్పుడప్పుడు. నేను గ్రేన్ మార్కెట్ల సోడాలు అమ్ముకుంట 'సోడాలు, సోడాలు' అని అరుస్తాంటే 'విన్నరా! చదువుకునేటోనివి నువ్వు సోడాలమ్ముతాంటే చాలా బాధైంది' అన్నదోసారి.

ఎన్ని కావ్యాలు రాస్తాను అమ్మీని బతికించుకోవడానికి. నా పెళ్ళయిన తర్వాత నాకు కొడుకు పుడుతడని ఎందరెందరో, ఎవరెవరో దీవించిన్రు నన్ను. అమ్మీ ఎక్కడికి పోతది. అమ్మీ పుట్టింది నాకు. అమ్మీ ఎడమ కన్ను పక్కన వుండే పుట్టుమచ్చ అమ్మీ చనిపోయిన తర్వాత ఇప్పుడు నా ఎడమ కన్ను పక్కనున్నది. అమ్మీ సమాధి మట్టి కొంచెం నా ఎదల తావీజుగా వుంది.

అమ్మీ బతికినంతకాలం అమ్మీని ఒక అమ్మీలాగ చూడలేదు నేను. ఒక దొర పని వాళ్ళ మీద చూపించినంత పెత్తనం, జులుం, రుబాబ్ చూపించిన అమ్మీ మీద. అమ్మీని ఇప్పుడు బతికించుకునుడే నా రుబాబ్ అనిపిస్తది నాకు.

ఐదుగురు కొడుకుల్ని ఐదుగురు బిడ్డల్ని కన్న నీ తల్లి రోజురోజుకు నీ గురించే చెప్పేదని వాడలవున్న అమ్మీతోటోళ్ళు చెప్తుంటారు. నాకు. ఏం చెప్పేది నా గురించి అని అడిగేటట్టు వుండకపోయేది వాళ్ళను. నేను కనపడితే చాలు అమ్మీ గురించి చెప్పడం వాళ్ళకు అలవాటు. చెప్పుకుంటనే ఏడ్వడం అలవాటు. వాళ్ళు ఏడ్సుకుంటనే నన్ను 'ఏడవకు బిడ్డా! వూకో. సచ్చి ఎక్కడున్నదో ఆ తల్లి. మిమ్ముల్ని ఆగంచేసి పోయింది' అనేటోళ్ళు. కొడుకులు సంపాయిస్తాంటే కనీసం సుఖపడకుంట పోయింది. అక్క దురదృష్టమో, పోరగాళ్ళ దురదృష్టమో అనేటోళ్ళు.

బాగా సదివిండు బేటా అనుకునేది నా గురించి అమ్మీ. నా కోపాన్ని చూసి ఎట్లా బతుకుతడో అనుకునేది. బక్కగా వుండేటోన్ని. కోపంగా వుండేటోన్ని. ఎప్పుడు కంటినొప్పితో బాధపడేటోన్ని. కంటి నొప్పున్నప్పుడు కన్ను బాగా ఎర్రగా వుండేది. నా కన్ను గురించి 'ఎర్రచీరలెక్క వుంటది' అని చెప్పేదంట. 'ఎట్ల పోతదో నా బేటా కన్ను నొప్పి' అనేదట. ఇప్పుడెట్లా వున్నది కొడుకా నీ కన్ను అడుగుతరు శాంతమ్మ, దుబ్బుల లచ్చుమ్మ, కోమటోళ్ళమ్మ. ఇప్పుడు నొప్పి లేదు – కన్ను ఎఱ్ఱగా కూడా అయితలేదంటే 'అయ్‌పాయ్‌తీ! నీ తల్లి పోయింది. నీ బాధపోయింది' అనేటోళ్ళు. వాళ్ళు అట్ల అంటే చెప్పుతోని చెంపమీద కొట్టినట్టే అన్పించేది నాకు. 'నీ తల్లిపోయింది –నీ వల్ల ఆమె బాధపోయింది' అన్నట్లనిపించేది నాకు.

అమ్మీ బయటికి పెద్దగా ఎప్పుడూ నవ్వలేదు. ఎప్పుడు కూడా ఏడ్వలేదు. నరకం లాంటి మా ఇంట్ల అమ్మీ అలవాటైనట్లే వుండేది. ఎప్పుడూ నవ్వు ముఖమే. జరం లాంటిది ఎప్పుడు రాలేదు అమ్మీకి. నిద్రపట్టకపోతే రాత్రిళ్ళు లేచి కూసునేది. అన్ని పనులు ఒక్కతే చేసుకునేది. అంతేకానీ ఎక్కువ సేపు నిద్రపోయి పడుకున్నది లేకపోయేది.

అమ్మీ నా గురించి ఏమేం చేసేదో అబ్బా అంతా చూసేటోడు. వినేటోడు. అమ్మీని పట్టుకొని నువ్వు వానికి చెప్పి వూరికి పోవుడేంది అనేటోడు. తన పెద్దరికమంతా అయిపోయిందనుకునేటోడు. ఇంట్ల వున్నది తింటడు, వాని కోసం ప్రత్యేకంగా చేసుడేంది అనేటోడు. అబ్బకు రాని తిట్టులేదు. తిట్టినతిట్లు అవసరమనిపిస్తే మళ్ళీ తిట్టేటోడు. లేదా తిట్టనితిట్లు తిట్టకుండా రోజంతా తిట్టుతునే వుండేవాడు. ఈయన తిట్లవల్ల, ప్రవర్తనవల్ల 'అబ్బ' అని ఆయనను నోరారా తిట్టబుద్ధికాకపోయేది. ఈయన తిట్లల్ల బూతు, రోత వుండేది. చాలాసార్లు సంపుతే బాగుండు అనుకునేటోన్ని. ఇప్పటి దాకా మేమిద్దరం మాట్లాడుకున్నదే లేదు. చాలాసార్లే గొడవయ్యింది. మా ఇద్దరికి. ఔరే అంటే తూజారే అనీ, ఏందిరా అంటే నువ్వేందిరా అనుకునేటోల్లం. మాటి మాటికి, తల్లికి పుట్టినోడివైతే ఇంట్ల వుండొద్దు అనేటోడు. ఇది నీది కాదు నీ అబ్బ జాగీరు అనేటోడు. గింత మాటన్న తర్వాత రేపటి నుంచి ఇంట్ల వుండాల వద్దా అనుకునేటోన్ని. రాత్రిళ్ళ గొడవైతే అట్లనే బయటికి పోయేటోన్ని. వాడలన్నీ తిరుక్కుంట స్టేషన్ వరకు పోయేటోన్ని! మల్లేశమన్న బండికింద గద్దితట్ల పడుకునేటోన్ని. ఎప్పట్కి ఏదో విధంగా, ఎందుకో అందుకు ఇంట్ల రోజంతా గొడవే గొడవ. తిట్లే తిట్లు. అబ్బ పుణ్యమానీ నాక్కూడా తిట్లన్ని వచ్చేవి. కానీ తిట్టే అవకాశాన్ని చాలా తక్కువగానే ఉపయోగించేటోన్ని.

డిగ్రీల ఇంటెనక వున్న రూం నేనే వాడుకునేది. ఒక రోజు గోడలపైన రెండు వాక్యాలు బ్రష్‌తోని రాయించిన. నా రూంల నేను ఏం చేస్తనో అమ్మీకేం తెలుసు. సాయంత్రం ఛాయ్ తీసుకొచ్చి టేబుల్ మీద పెట్టుకుంట గోడల మీది రాతల్ని చూసింది. ఏం రాసినవు గోడల

మీద – అడిగింది. దీవానీ, వాటి గురించి నీకు తెల్వదు గనీ 'స్మైల్ అండ్ స్మైల్ త్రూ ఏ లైఫ్ టైం' అంటే 'జిందగీ తమాం హస్తేహస్తే జీనా' అన్నాను. యేక్యాహై అని గోడ మీది ఇంకో వాక్యం గురించి అడిగింది. పింకి ఎవరని ఎవరైనా అడిగితే ఎలుగు నీడలవైపు ఏలు చూపించు'. 'అప్ నీ దిల్‌రుబా కోన్‌హై బోల్కే అగర్‌సే కోయీ పూచే రోష్నీ ఛావోంకే తరప్ వుంగ్లీ బతావో' అన్నాను. ఛాయ్ పీ–తండీ హోతీ అంటే ఛాయ్ తాగితే కప్పు తీసుకొని నవ్వుకుంట వెళ్ళిపోయింది. కొన్ని రోజుల తర్వాత తలపట్టుకొని నారూంలో దివాళ తీసినట్టు కూర్చున్న నన్ను 'క్యా లిఖా దీవారోంపే! ఐసా క్యోం బైఠా' అడిగింది. అక్షర జ్ఞానంలేని అమ్మీ మహోన్నతమైన వ్యక్తిత్వంతో నాకుపదేశం చేస్తున్నట్టనిపించింది. చాలాసేపటి తర్వాత అమ్మీని చూద్దామని తలఎత్తితే ఎదురుగా అమ్మీలేదు.

ఒకసారి జీవితాంతం తలఎత్తుకోలేని పరిస్థితి నాకెదురైంది. నేను ఉద్యోగం కోసం ఇంటర్వ్యూ ఇచ్చి వచ్చాకా బాల్‌బాడ్‌మింటన్ ఆడటానికి ఒక టోర్నమెంటుకు వెళ్ళాను. పోతు పోతూ టోర్నమెంట్ పాంప్లెట్, టోర్నమెంట్ అడ్రస్ ఇంట్లఇచ్చి నాకు కాల్ లెటర్ వస్తే ఈ అడ్రస్‌కు ఎవరినైనా పంపితే నేను వస్తానని చెప్పాను. టోర్నమెంట్ అయిపోయినంక అయిదు రోజులకు ఇంటికొచ్చిన నాకు టి.వి. మీద నాకొచ్చిన ఉత్తరం చింపి వుండడాన్ని చూసి ఇష్టమొచ్చినట్టు అందర్ని తిట్టిన. కాల్‌లెటరొస్తది – చదవమని చెప్పింది నువ్వేకదా – అని అమ్మీ మెల్లగా చెప్పే ప్రయత్నం చేస్తే 'నీకు సదువొస్తే కదా కాల్ లెటర్ ఏంటిది, ఉత్తరం అంటే ఏంటిది' తెలిసేది అని అరిచిన. ఉత్తరాల్ని ఎవడు చింపిండో నాకు కావాలని ఎంత అరిచినా చింపిన వాళ్ళెవరో ఎవరు చెప్పలేదు. స్నానం చేసి, అన్నంతిని ఇంటెనకాల కుర్చీ ఏసుకొని ఉత్తరాన్ని చదువుకుంట కూర్చుంటే చదువుతున్నంత సేపు ఎక్కడలేని భయమేసింది. చాలా సిగ్గనిపించింది. కవిత హైదరాబాద్ నుంచి రాసిన ఉత్తరమది. 'నాలుగు రోజులు హైదరాబాద్‌ల అత్తమ్మ వాళ్ళింట్ల వుందామని వచ్చాను. కానీ, నువ్వే మాటిమాటికి గుర్తొస్తున్నావు. నీ గురించి ఇక్కడ అందర్కి చెప్పాను. నిన్ను తేవొద్దా అని అడిగింద్లు. ఏం చేయాలి. నిన్ను చూడకుండా వుండలేకపోతున్నాను. ఈ హైదరాబాద్‌కు వచ్చినప్పటి నుంచి నీకు నాలుగు ఉత్తరాలు రాసినా, ఈ ఉత్తరాన్నే పోస్ట్ చేస్తున్నాము. ఇక్కడ వుండలేకపోతున్నాను. రేపే వస్తున్నాను. ఇంటికి రాగలవు' అని వుంది. ఇలాంటి వుత్తరాన్ని చదివిన అమ్మీ అబ్బ నా మీద దామీద ఎగరాల్సింది పోయి, నన్ను నిలదీయాల్సింది పోయి నా తిట్లనీ, నా అరుపుల్నీ భరించింద్లే కానీ 'ఇదంతా ఏంటిదీ'? నీ వ్యవహారం బయటపడ్డది కాబట్టి తట్టుకోలేక అరుస్తున్నవని ఎవ్వరు కూడా ఒక్క మాట అనలేకపోయారు. ఈ విషయం జరిగినప్పటి నుండి అమ్మికి అర్థం చేసుకునే శక్తి వుంది అనుకునేటోన్ని. నాతో స్నేహంగా వుంటున్న కవిత అమ్మీకి బాగా తెలుసు. నన్ను చూడకుండా వుండలేని కవిత రాతల్ని అమ్మీ అపార్థం చేసుకోలేదు. ఇంటెనకాల కూర్చొని ఉత్తరాన్ని చదివిన నేను కొన్ని గంటల వరకు ఇండ్లుకు రాలేకపోయాను. 'క్యాహైగే అమ్మీ! కవిత క్యాక్యావోకీ లిఖీ ఖత్‌యే' అన్నాను. నవ్వి వూరుకుంది అమ్మీ. నన్ను నిలదీయకపోవడం వల్లనే, ప్రశ్నించకపోవడంవల్లనే నేనెవర్ని ప్రేమించలేకపోయాను. నన్ను ఎవరెవరో ప్రేమించినట్లు చేసినా ఓ స్నేహితునిగానే వుండిపోయాను అందరికి. ఐతే, తప్పు చేసిన్నో ఒప్పుచేసిన్నో కానీ నా బతుకుల ప్రేమ లేకుండా పోయిందనిపిస్తది.



మానస విషయంలో కూడా అమ్మీ నా గురించి తప్పేమీ అనుకోలేదు. నాతో తప్ప ఎవ్వరితో మాట్లాడనని ఖరాఖండిగా మా ఇంట్లనే అమ్మీతో చెప్పిన మానసను అమ్మీ చిన్నపిల్ల తత్వంగానే తీసేసింది తప్పా అమ్మాయిల విషయంలో ఏ ఒక్క రోజు కూడా నాతో గొడవ పడలేదు. నేనెవర్ని ప్రేమించట్లేదని అమ్మీ నన్ను బలంగా నమ్మడంవల్లనే నైతికంగా వున్నతంగా వుండే ప్రయత్నాలు చేశాను. విశృంఖంగా వుంటుందని చెప్పి గీత నన్ను 'అన్నయ్య'అన్నందుకు నేను ఒక బాధ్యతగా వ్యవహరించాను గీతతో, 'బద్ హో బద్‌నాం న హో' (చెడిపోయినా పర్లేదు చెడ్డపేరు తెచ్చుకోకు) అని ఆరాటపడ్తున్న లోకం గురించి 'మేడిపండు చూడు మేలిమై వుండు' అన్నట్లనిపించేది. అందుకే. 'చెడ్డపేరొచ్చినా పర్లేదు చెడిపోవద్దనేది' నా ఆవేశంగా వుండేది. ఈ చెడ్డపేరు తెచ్చుకునే క్రమంలో కూడా అమ్మీ నన్నెప్పుడు ఏమీ అనలేదు. అనుకోలేదు.

స్నేహితులకు వున్నట్లుండి డబ్బు అవసరమైనప్పుడు నేను అమ్మీకి చెప్పి ఎక్కడైనా తెలిసిన వారి దగ్గర ఇప్పించమని ఫోర్స్ చేసేవాన్ని. ఇప్పించక తప్పదు. కాబట్టి రెండుసార్లు బయట డబ్బిప్పించింది. కానీ నా స్నేహితులు ఆ డబ్బు మళ్ళీ తిరిగి నాకివ్వనేలేదు. అందుకే అమ్మీకి కొన్నిసార్లు భయపడేది నేను. పైసలేమైనయ్ అని అడుగుతదేమోనని అనిపించేది. కానీ ఎప్పుడు అడగలేదు అమ్మీ.

ఎన్నితీర్ల కష్టపెట్టిన్నో అమ్మీని, సరిగ్గా గుర్తులేదు కానీ ఎంత చెప్పినా తక్కువే. ఓసారి దయాకర్ నాతో 'ఏంపనున్నది. రోజూ సాయంత్రం మిర్చీల బండికాడనే నిలబడుతడనీ' మీ అమ్మ చెప్పిందన్నాడు. చాలా కోపంతో పోయి 'నాకేం పనిలేదా? వూకే మిర్చాల బండీకాడనే వుంటనా? ఒకవేళ వున్నా కూడా గట్ల చెప్తఅవ? మూతిపళ్ళు రాలగొడ్తా' అన్నాను అమ్మీతో, 'నేనట్ల చెప్పలేదు. గట్లెందుకు చెపుత నేను' అని అమ్మీ ఎన్నిసార్లు చెప్పినా వినలేదు నేను. "మిర్చీల బండికాడనే వుంట. ఏం చేస్తవ్?' అరిచిన నేను. కొన్ని రోజుల వరకు గిట్లచెప్తదా అని అమ్మీతో మాట్లాడబుద్ధికాలేదు. కానీ, అమ్మీ అట్ల చెప్పలేదని తర్వాత తెల్సింది నాకు. అమ్మీ మీద అబద్దం చెప్పిన నా ప్రియమిత్రుడనుకున్న దయాకర్‌తో అప్పటి నుంచి దోస్తానా మానేశా. అమ్మీతోటినే మాట్లాడేదే తక్కువంటే గిట్లగొడవలల్ల ఆకాస్తా మాట్లాడుడు కూడా వుండకపోయేది. జీవితంలో ఒక్కరోజైనా ఒక్క ఐదు నిమిషాలైనా అమ్మీతో మాట్లాడని పనికిమాలిన కొడుకును దునియాలో నాలెక్క ఇంకెవ్వరుండరని నా మనసు నన్నెప్పుడు బాధపెడుతనే వుంది.

అమ్మీని మరిచిపోకుండా వుండడానికి మరో ప్రత్యేక కారణం. అమ్మీ చేతి వంటలు అద్భుతంగా వుండేవి. టమాట వండినా, టమాట ఎగ్‌వండినా, చికెన్ వండినా, దాల్ చేసినా, ఖట్టా చేసినా, ఏ కూర చేసినా చాలా బాగుండేవి. మా ఖాందాన్‌ల ఎవ్వరి ఇంట్ల పెండ్లైనా, ఏదైనా కార్యక్రమమైనా వంటల దగ్గర అమ్మీ నిలబడేది. అందర్కి దగ్గరుండి తినిపించేది. ఇప్పుడు మా ఇంట్ల అమ్మీ కరువైనట్లే మా ఖాందాన్‌ల కారోబార్‌లల్ల బరువు బాధ్యతలు స్వీకరించే పెద్దదిక్కు కరువైంది. ఇప్పటి దాకా నేను రుచికోసం ఇష్టంగా, ఎక్కడెక్కడో, ఎన్నెన్ని చోట్లో రకరకాల వంటకాలు తిన్నా కూడా మా అమ్మీ వంటల రుచి నా నాలుక మీద ఇంకా వుంది.

లేని అమ్మీ గురించి మాటిమాటికి ఆలోచించడం, ఆ

జ్ఞాపకాలు నెమరువేసుకోవడం మాత్రమే కాకుండా ఒక బేటాగా, నా ధర్మంగా ఏం చేస్తే అమ్మీ పాలరుణాన్ని తీర్చుకుంటానో అర్థం కాకపోయేది.

నాకైతే అమ్మీని మించి గొప్పవారు ఈ భూమ్మీద మరెవరు పుట్టలేరనిపిస్తది. తల్లికి, కొడుకుకి ఏమైనా తేడా వుందా అని ఆలోచిస్తే కొడుకు తల్లికాలేకపోవడమే - అనిపిస్తది నాకు.

ఈ ప్రపంచానికి అమ్మీ విలువైన కానుకలిచ్చింది - కొడుకులు, బిడ్డలు, ఈ కొడుకులు, బిడ్డలు - నిరసనలు, హేళనలు, అవమానాలు ఇచ్చారు తల్లికి. ఎక్కడ బాధవుందో అక్కడ 'అమ్మీ' వుందనుకుంటాను. ఎవరికైనా తల్లిలేదంటే పిల్ల గురించి తపించే ఆర్తి లేదన్నట్టే.

చిన్న పిల్లలు ఏది చేసినా మామూలుగానే వుంటుందన్నట్టు అమ్మీ గురించి నేను ఏం చేసినా - ఎంత చేసినా తక్కువే. అమ్మీని గుర్తు చేసుకుంటే మనసంతా వర్షం కురుస్తున్నట్లు, అమ్మీ మాటెత్తితే ఒక సంగీతపు వరద హృదయాన్ని ముంచెత్తినట్టు - అమ్మీలేని బతుకు 'తుఫాను పట్టిన సముద్రం మీద ఈదుతున్నట్టే వుంది' అమ్మీ జీవితం సామాన్యం - అమ్మీ కష్టం అసాధ్యం అని అన్పించేదెప్పట్కి. ప్రశాంతమైన కాజల్‌కీ ఆంఖే అమ్మీ. అమ్మీ యాదీ విషాద మనోహరం.

అమ్మీ! తుమ్హారీ యాద్ దిల్‌మే కాంటేకే జైసా చుబ్ రహాహై. బాధే తెలీని నాకు అమ్మీ లేని బాధ తెలుస్తుంది. దుఃఖం తెలీని నాకు దుఃఖమాగడంలేదు.

ఏ తల్లి సంకలో బిడ్డను చూసినా ఎనలేని సౌందర్యమనిపిస్తది నాకు. తల్లిని కోల్పోయానేనని నా హృదయంలోంచి ఓకేక బయటికొచ్చినట్టే వుంటది ఎప్పుడు. అమ్మీ నువ్వు మళ్ళీ పుడుతావో లేదో అన్న ఆలోచన లేదు నాకు. చిన్న పిల్లల్లో నువ్వే కన్పిస్తున్నావు. - మాట్లాడకుండా నవ్వుకుంటూ... నా అమ్మీ జ్ఞాపకాల్ని పరిమళం చేస్తున్న పిల్లలందరికి తలవంచి నమస్కరిస్తుంటాను.

బార్ బార్ ఆతీహై మధుర్‌యాద్ మా తేరీ.
గయీ లేగయీ తూ జీవన్‌కీ సబ్‌సేబడీ ఖుషీ మేరీ!

అరణ్యమైనా ఆకాశమైనా అమ్మీ కాళ్ళముందు తలవంచాల్సిందే!

అమ్మీ కూర్చున్న పొయ్యికి, అమ్మీ కూర్చున్న అరుగుకి
సలామ్ సలామ్
అమ్మీ! తుజే సలామ్



# రెండుదారులు ఒకటైసాగితే!

**వల్లభాపురం జనార్దన**

పడతీ పురుషుడు
ప్రకృతి పూసిన పూలు
ఒకరు గులాబీ
మరొకరు మోదుగు పువ్వు
బంగారం - యినుములు
స్త్రీ పురుషులు
అంతరంగ స్వరూపం వెలుగు చీకటి
సుకుమారం - లాలిత్వం - లావణ్యంతో
దారుఢ్యం -దర్పం - ఆధిపత్యంతో
మెరుస్తారు
నడుస్తారు
మెదడు - రక్త పరిమాణాలు భిన్నాలు
ఆలోచనల్లో భిన్నకోణాలు
దయాకరుణలను పరిమళింప చేస్తారు
కరుకుదనంతో విరుచుక పడతారు
కబుర్లతో కష్టసుఖాలలో కలిసిపోతూ
సహనంతో గమ్యానికి బాటలు వేస్తూ
సానుభూతి ఓదార్పులతో బాసటగా నిలుస్తారు
దారుఢ్యంతో గోడకడతారు
దర్పంతో లొంగదీసుకుంటూ
ఆధిపత్యంతో అహంకార ముద్రవేస్తారు
ఒకరు గులాబీ
మరొకరు మోదుగు పువ్వు
అంతరంగ మథనాలు
ఆకార పరిభాషలు వేరు
ఏ ఒక్క దారికీ సంపూర్ణత్వం లేదు
రెండుదారులు ఒకటై సాగితేనే నిండుదనం
ప్రకృతి పరిమళానికి జిలుగుతనం

# వక్రరేఖ

**నవీన్**

పెత్తనమెవడిదో విత్తనమూ వాడిదే
అప్పులు తప్ప మిగతావన్నీ నకిలీలే
పహారా కాయాల్సిన వాడే
అదృశ్యహస్త తిమింగలాలకి
బతుకుల్ని తాకట్టుపెడ్తుంటే
యిసకై రాలిపడ్తోన్న సహారాలు
రాజ్యం గీసిన వక్రరేఖలు వెన్నెముకలు
సముద్రాన్ని రుచి చూస్తాను
అతడి జీవితమే
జలఖడ్గమై నాలుకను కోస్తోంది
ఆకాశంలోకి చూస్తాను
అతడి కన్నీరే, మేఘాల మొహం దాచేస్తోంది
అతడు బాకీలోడొచ్చినప్పుడల్లా
పిల్లి వేటాడుతోన్న ఎలుకదిగులు
సేద్యానికి పట్టిన సంస్కరణల తెగులు
దళారీ నక్కల మోసంతో
పులి'బాబు'కి చిక్కిన కుందేలు
ఇరాక్ కళ్ళల్లోకి చూస్తే
ఇండియా రైతు కన్పిస్తాడు
రూపాలు వేరైనా, ఇరువురూ
అంకుల్‌శాం పంజరంలో సర్కస్ పక్షులే!
"మేరా నంబర్ కబ్ ఆయేగా"
అమాయకప్పిల్లాడిలా
ఆత్మహత్యల వరుసలో నిలబడ్డ అతణ్ణి
ఆలింగనం చేసుకుని, ఆత్మవిశ్వాసాల మెట్లెక్కిద్దాం!
ఛిద్రమవుతోన్న రేపటి స్వప్నాల్ని
చిరంజీవుల్ని చేద్దాం.

# పరాయీకరణ అంటే ఏమిటి?

**ఉత్పాదనే పరాయిదైనపుడు ఉత్పత్తి ప్రక్రియ కూడా పరాయీకరణే. అంటే కార్మికుని శ్రమ పరాయీకృతమే పరాయీకరణ ప్రక్రియే ఎందుకంటే శ్రమ శ్రామికునికి బాహ్యమైనది, అంటే అది తన అంతరిక స్పందనతో చేసేది కాదు. స్వచ్ఛందంగా, లేక ఇష్టంగా చేసే శ్రమ కాదు. అది నిర్బంధ శ్రమ. అందుకే అది ఒక అవసరాన్ని తీర్చేందుకు చేసే పని కాదు, బాహ్య అవసరాలను తీర్చేందుకు ఉపయోగపడే ఒక సాధనం మాత్రమే. ఆత్మను చంపుకొని చేసే శ్రమ. ఇతరుల కోసం చేసే శ్రమ పరాయితనం సంతరించుకున్న శ్రమ.**

**డా॥ తక్కోలు మాచిరెడ్డి**

'ఎలియనేషన్' అనే ఆంగ్లపదానికి తెలుగు పర్యాయపదం 'పరాయీకరణ' 'ఎలియనేషన్' అనే పదం లాటిను భాషకు చెందిన అలెన్సు నుంచి వచ్చింది. పరాయీకరణ అర్థంలోనే, Estrangement (సంబంధ విచ్ఛేదన) అనే పదం కూడా వాడతారు. ఆంగ్లంలో పరాయీకరణకు సమానార్థకంగా హిందీలో 'ఆల్‌గావ్' పృధక్కరణ్' లాంటి పదాలు వాడుతున్నారు. 'పరాయా' అనేపదం హిందీ లో వుంది కాబట్టి 'పరాయీకరణ్' అనే పదం హిందీలో కూడా వాడవచ్చని నా అభిప్రాయం. పరాయీకరణ ను సూచించేందుకు కార్ల్‌మార్క్స్ జర్మన్ భాషలో వాడిన పదాలు Entansserung, Entfremdung పరాయీకరణే కాక, దూరంగా వుంచడం, విడిచి పెట్టడం, అమ్మడం, హస్తాంతరణ చేయడం అనే అర్థాల్లో కూడా ఈ పదాలు వాడతారు జర్మన్‌లో.

హంగేరి దేశానికి చెందిన ఇస్తవాన్ మెస్జోరస్ అనే ఒక మేధావి పరాయీకరణపై ఒక గ్రంథం రాశాడు. ఆయన చెప్పిన ప్రకారం, క్రీ.శ. 14వ శతాబ్దంలో ఈ పదాన్ని మతపరంగా వాడేవారు. దేవుని కృప పొందలేక పోవడాన్ని, దేవుణ్ని పూజించ నిరాకరించే స్థితినీ లేక దైవజ్ఞాన రాహిత్యాన్నీ ఈ పదం సూచించేది. 15వ శతాబ్దాంతంలో ఈ పదాన్ని అధికారం, ధనం, ఆస్తిని మరో వ్యక్తికి దఖలు పరచడం అని అర్థంలో వాడేవారు. కానీ, ఎవరినైనా బలవంతంగా ఆస్తి నుంచి వేరు చేయడం అనే అర్థంలో ఎక్కువగా ఈ పదప్రయోగం జరిగేది. 19వ శతాబ్దం మధ్య నుంచి ఈ పదం కుటుంబం విచ్ఛిన్నం కావడం అనే అర్థంలో వాడేవారు. తర్వాత్తర్వాత, ఈ పదం శక్తిహీనత, అసమర్థత, ఆదర్శహీనత, ఒంటరితనం, పరాయితనం అనే అర్థంలో వాడబడేది మరీ ముఖ్యంగా ఆధునికతా వాదులూ, అస్తిత్వ వాదులూ ఈ పదాన్ని విరివిగా వాడారు, వాడుతున్నారు.

ఫ్రెంచి పునరుజ్జీవనయుగానికి చెందిన దిదెరో, రూసో అనే ఇద్దరు తత్వవేత్తలు కొంతవరకూ పరాయీకరణ ను అర్థం చేసుకున్నారు. దిదెరో 'నీ' 'నా' అనే భేదం, పలువురి సంక్షేమం ఏదో ఒక వ్యక్తిపై ఆధారపడటం, పరాయీకరణకు దారి తీస్తాయి. అంటాడు. విరిగిన కోర్కెలు, కాల్పనిక అభిరుచులు, కృత్రిమ అవసరాలు ఉత్పన్నమవుతాయని చెబుతూ, అవసరాల్ని తగ్గించుకుంటే ఈ సమస్యలుండవని నైతిక హితవు చెబుతారాయన.

ప్రకృతినుంచి మనిషి వేరవుతున్నాడనీ, సభ్యత మనిషిని భ్రష్టు పట్టిందనీ, సభ్యత రాక ముందు మనిషి ఆదిమ సహజ ప్రవృత్తులతో నైసర్గికంగా ప్రవర్తించే వాడనీ, ధనం రాకతో మనిషి తన సహజ స్వభావం కోల్పోయాడనీ, సహజ ప్రవర్తన, సభ్య ఆచరణల మధ్య వుండే అంతరమే పరాయీకరణ అని అంటాడు రూసో. ధనం, ఆస్తి ఈ పరాయీకరణ కు కారణం అని చెప్తాడు ఆయన. ఈ పరాయీకరణ కు పరిష్కారం అమ్ముడు పోకపోవడమే అనే. నైతిక మార్గం చూపిస్తాడు రూ.సో నైతిక దృక్పథాన్నే మరింత ముందుకు తీసుకుపోయాడు మహాత్మాగాంధీ.

మార్క్సుకు ముందు హెగెల్ పరాయీకరణను ప్రస్తావించి విస్తృతంగా వ్యాఖ్యానించాడు. ఆయన భావనను ఆత్మాశ్రయ దృక్పథంలో చూశాడు. ఆత్మాశ్రయాన్ని వస్తుగతంగా మార్చే ప్రక్రియలో పరాయీకరణ జనిస్తుందని అంటాడు ఆయన. ఆత్మ చైతన్య వికాసానికి ఇది అవసరమని భావిస్తాడు. మనిషి మస్తిష్కం కొన్ని కృతులను సృజించినపుడు, అది సృజనకర్త నుంచి వేరు పడి వస్తుగతం అవుతాడు పరమ సత్ రూపాలే పరాయీకరణ, నిష్పరాయీకరణ (Dealienation) లు అని అంటాడు హెగెల్. ప్రకృతి నిరపేక్ష మనసు (Absolute mind) యొక్క ఆత్మ పరాయీకరణ అని నిర్వచిస్తాడు ఆయన.

హెగెల్ భావనల్ని ఫ్యూయర్ బా అనే తత్వవేత్త విమర్శిస్తాడు. ప్రకృతికి హెగెల్ చెప్పిన నిర్వచనాన్ని వరాస్తం చేస్తూ. దేవుడే ఆత్మపరాయీకృత (Self-alienated) మానవుడు అని సిద్ధాంతీకరిస్తాడు. తనకంటే ఉన్నతుడూ, ఉత్కృష్టుడూ అని తాను కల్పించుకున్న పరమసత్ అనే దేవునికి తానే బానిస యై పూజిస్తాడు మానవుడు. ఇది పక్కా పరాయీకరణ. దేవుని అస్తిత్వాన్ని నిషేధించినపుడు మాత్రమే దీన్నుంచి నిష్కృతి అంటాడు ఫ్యూయర్ బాఖ్.

కార్ల్ మార్క్సు ఈ భావనను ఖండిస్తాడు తన ఆర్థిక తాత్విక రాతప్రతులు 1844 లో. మతపదమైన పరాయీకరణ కు సంబంధించినంత వరకూ ఫ్యూయర్ బాఖ్ తో ఏకీభవిస్తాననీ, కాని, ఇది అనేక రకాల పరాయీకరణల్లో ఒకటి మాత్రమేనని అంటాడు మార్క్సు. మనిషీ, ప్రకృతి అవాస్తవికమని తలచడమే తప్పు. సామ్యవాద సాధనకు మత నిర్మూలన లాంటి మధ్యస్తత అక్కడ లేదంటాడు.

ఆయన. కానీ,

దైవభావనతో మనిషి కొంతవరకూ పరాయీకరణకు గురవుతున్నాడనేది వాస్తవమే నంటాడు. దార్శనికత, కళ, నైతికతలాంటి రూపాల్లో ఆత్మికంగానూ, సరుకు, డబ్బు, పెట్టుబడి రూపాల్లో ఆర్థికంగానూ, రాజ్యం, న్యాయం, సామాజిక సంస్థల్లాంటి రూపాల్లో సామాజికంగానూ మనిషి పరాయీకరణకు గురవుతున్నాడని అంటాడు మార్క్స్. తన క్రియాశీలతలోనూ పరాయితనం అనుభవిస్తుంటాడు మనిషి.

జబర్దస్తీగా చేయించుకునే శ్రమ, వివశత్వరలో చేసే శ్రమ సౌందర్య నియమాల ననుసరించి జరగవు. కార్మికుడు శ్రమకూ, తనకు తానూ పరాయివాడవుతాడు. పరాయీకరణ మనిషికి సహజ లక్షణమైన సౌందర్యానుభూతిని నాశనం చేస్తుంది. మనిషిని అమానవీయం చేస్తుంది. సౌందర్యనియమాలనను సరించి చేసే శ్రమలో నిర్బంధం వుండదు. ఆహ్లాదకరమైన శ్రమ అది. ఒక కళాకారుడు కళాసృజనలో పొందే అనుభూతి.

మార్క్స్ పరాయీకరణను గురించి లోతుగా విశ్లేషించాడు. ఆయన ఆలోచనకు కేంద్రం మనిషి. మనిషిలో మానవత్వ లోపం పరాయీకరణకు మూలం అనీ, సమాజం సామ్యవాద దశకు చేరుకున్నపుడు పరాయీకరణ వుండదని సిద్ధాంతీకరిస్తాడు ఆయన. పెట్టుబడి వాద సమాజంలో కార్మికుడు ఒక అమ్ముడు సరుకు అయినాడనీ, అతని నికృష్ట జీవితం అతని ఉత్పాదనకు విలోమ అనుపాతం లో వుందనీ సూత్రీకరిస్తాడు మార్క్స్, 1844 లో రాసిన తన రాత ప్రతుల్లో.

సంబంధ విచ్ఛేదన కార్మికునికో, అతను ఉత్పత్తి చేసే ఉత్పాదనకూ మధ్యనే కాదు, ఉత్పత్తి ప్రక్రియలోనే అతను పరాయివాడవుతున్నాడు అంటాడు మార్క్స్. అదెలా అంటే, ఉత్పాదనే పరాయిదైనపుడు ఉత్పత్తి ప్రక్రియ కూడా పరాయీకరణే. అంటే కార్మికుని శ్రమ పరాయీకృతమే పరాయీకరణ ప్రక్రియే ఎందుకంటే శ్రమ శ్రామికునికి బాహ్యమైనది, అంటే అది తన అంతరిక స్పందనతో చేసేది కాదు. స్వచ్ఛందంగా, లేక ఇష్టంగా చేసే శ్రమ కాదు. అది నిర్బంధ శ్రమ. అందుకే అది ఒక అవసరాన్ని తీర్చేందుకు చేసే పని కాదు, బాహ్య అవసరాలను తీర్చేందుకు ఉపయోగపడే ఒక సాధనం మాత్రమే ఆత్మను చంపుకొని చేసే శ్రమ. ఇతరుల కోసం చేసే శ్రమ పరాయితనం సంతరించుకున్న శ్రమ.

ప్రకృతి నుంచి మనిషి పరాయీకరణ మనుష్యత్వం నుంచి పరాయీకరణే. అంతిమంగా పరాయీకరణ మనిషి నుంచి మనిషినీ, స్వజాతి ప్రాణి (Specier being) నుంచి సంపూర్ణ మానవ జాతినే, సమాజాన్నీ వేరు చేసి, తన వలయం లోకి తీసుకుంటుంది.

పరాయీకరణ అనేది వ్యక్తులకు మాత్రమేనా, లేక సమాజానికి కూడానా అన్న ప్రశ్న తలెత్తింది. పరాయీకరణను వ్యక్తికి పరిమితం చేసే వాళ్ల వాదన ఏమిటంటే సమాజానికి సమాయోజితం (adjust) కాకపోవడం పరాయీకరణకు దారి తీస్తుంది అని. ఎరిక్ ఫ్రామ్ లాంటి మేధావుల వాదన యేమిటంటే, సమాజమే రుగ్ణదశలో వుండవచ్చుననీ, పరాయికృతమై వుండవచ్చుననీ అటువంటప్పుడు వ్యక్తి సమాజానికి అనుకూలుడు కాలేక పోయినంత మాత్రాన ఆ వ్యక్తి పరాయీకరణకు గురి అవుతాడని అనలేం అని మరికొందరు దీన్ని మనోవైజ్ఞానిక దృష్టితో పరిశీలించినారు. ఎరిక్ జోసెఫ్ సన్, మేరా జోసెఫ్ సన్‌ల ప్రకారం పరాయీకరణ ఒక అనుభూతి. ప్రపంచంతోనూ, ఇతరులతోనూ, తన 'స్వ' తోనూ దూరమయ్యే మానసిక స్థితి.

ఉద్యోగిస్వామ్యాలలో మనిషి (బ్యూరోక్రసీస్) పరాయీకరణను సంతరించుకుంటాడు. వాటిలో పనిచేసే ఉద్యోగస్తులు కూడా నియమ నిబంధనలతో విసిగి వేసారి, అమానవీకరణకు గురవుతారు. అలాగే వేతనం కోసం పనిచేసే వేతన శర్మలు డబ్బు సంపాదించడమే పరమావధిగా పెట్టుకొని ధనోత్పాదన యంత్రాలుగా తయారవుతారు. ఇది పరాయీకరణే. విద్యా రంగంలో ఉపాధ్యాయులు క్లాసులో తమకు నచ్చని విషయాలు మీద కూడా మాట్లాడాల్సి వస్తుంది కాబట్టి వారూ పరాయీకరణను తప్పించుకోలేరు.

వీటన్నిటికంటే, కట్నం వేధింపులకు గురయ్యే స్త్రీలు అనుభవించే అమానవీకరణ, పరిపూర్ణ పరాయీకరణ. భర్త, అత్త విలయినపుడు ఇంటి కోడలు అనుభవించే నరకానికి పరాయీకరణ పదం సరిపోదు.



**ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు-2004**

**కోసం విజ్ఞప్తి**

గత 16 సంవత్సరాలుగా ఆధునిక కవిత్వానికిచ్చే పురస్కారమైన "ఉమ్మడి శెట్టి సాహితీ అవార్డు-2004" కోసం కవులు తమ కవితా సంపుటాలను పంపవలసినదిగా అవార్డు వ్యవస్థాపకులు శ్రీ రాధేయ ఒక ప్రకటనలో విజ్ఞప్తి చేశారు. పరిశీలన కోసం 2003-04 సంవత్సరాలలో మాత్రమే ప్రచురింపబడిన కవితా సంపుటాలను పంపాలి. ఎంపికైన ఉత్తమ కవితా సంపుటికి వెయ్యి రూపాయలు నగదు మరియు కవికి సత్కారం వుంటుంది. 31.1.2005 తేదీలోగా 4 ప్రతులు ఈ చిరునామాకు పంపాలి

**రాధేయ**
**204, రాజహంస ప్యారడైజ్ అపార్టుమెంట్స్**
**కె.వి.ఎస్. ఫంక్షన్‌హాలు వెనుక, శ్రీనివాసనగర్,**
**అనంతపురం - 515 001. ఫోన్ : 08554-222652**

# అనామకుడు

**భూషి కృష్ణదాసు**

పేదరికం
నిన్ను కత్తితో పొడిచినపుడు
నీలోంచి వొక్కచుక్క
రక్తం కారకపోవడం
నన్ను ఆశ్చర్యపరచలేదు
రాబందులు
నీలోని రక్తమంతా
తోడేసుకున్నాక
ఇంకా ఏం మిగిలుంటుంది?

# వ్యథాపూరితం వైవిధ్యభరితం



**మొత్తం మీద వస్తువు విషయంలో సంకలనంలోని కథలన్ని ఒకదానితో ఒకటి పోటీ పడ్డాయనడం అతిశయోక్తి కాదు. శిల్పం విషయంకొస్తే కొన్ని అత్యద్భుతంగా ఉండగా కొన్ని కథలు ఆ స్థాయిలో లేవనే చెప్పాలి. కొత్త రచయితలు శిల్పాన్ని మెరుగు పరుచుకుంటారని ఆశించాలి. కథలు కాకరకాయలు సమాజాన్ని మారుస్తాయా అన్న వాళ్ళకు ఈ సంకలనం సమాధానం. కథలు ఉన్న ఫళంగా సమాజాన్ని మార్చలేకపోయినా సమాజ మార్పుల్ని చెబుతాయి. ఆ మార్పులు సమాజ శ్రేణుల్ని ఆలోచనలోకి నెడతాయి. ఆలోచన పదునెక్కి అభ్యుదయ సంస్కారం అబ్బుతుంది. ఆ సంస్కారమే వ్యక్తిలోనూ సమాజంలోను మార్పుకు దోహదపడుతుంది.**

**అల**

కథ జీవితమంత విస్తృతమైనది కాకపోయినా జీవన నేపథ్యాన్ని హృద్యంగా వివరిస్తుంది. వ్యక్తి జీవితంలోని సంఘటనల్ని చుట్టూ వున్న సమాజానికి అన్వయించి చెప్పడంలోనూ విషయాన్ని విషయంగా కాకుండా అనుభవంతో మేళవించి సృజనాత్మకంగా చెక్కడంలోనూ కథ ఒక అసాధారణ సాధనం.

ఈ కోణంలోంచి పరిశీలించి నప్పుడు కథ 2003 వర్తమాన సమాజ ఆర్థిక, రాజకీయ, సామాజిక పరిస్థితుల్ని మన కళ్ళ ముందు నిలబెడుతుంది. మైనారిటీ మెజారిటీ మతాల మధ్య పెరుగుతున్న అగాధాన్ని, పల్లె పట్నాల మధ్య అభివృద్ధిలో వున్న అంతరాల్ని, కుల, లింగ వివక్షతల్ని, వృత్తి కళాకారుల దైన్యాన్ని, నగర జీవిత సంక్లిష్టతల్ని, దిగజారుతున్న నైతిక ప్రమాణాల్ని ఈ సంకలనం విశదపరుస్తుంది. ఈ కథల పుస్తకంలో 16 కథలున్నాయి. వివిధ తెలుగు పత్రికల్లో ఏడాది ప్రచురితమైన సుమారు రెండు వేల కథల్నుండి వీటిని ఎంపిక చేశారు. సంకలనకర్తలైన వాసిరెడ్డి నవీన్ పాపినేని శివశంకర్.

**మతాల అగాధాలు**

గత కొన్నేళ్ళుగా చాపకింద నీరులా మార్పులు సంభవిస్తున్నాయి. వాటి పర్యావసానంగా మైనారిటీ మెజారిటీ మతాల మధ్య అగాధం పెరుగుతుంది. దేశంలో ప్రస్తుతం వున్న రాజకీయ వాతావరణం, ప్రపంచ పరిణామాలు అందుకు దోహదపడు తున్నాయి. కేతు విశ్వనాథరెడ్డి 'అమ్మవారి నవ్వు', ఓల్గా 'సారీ జాఫరాలీ' రహమతుల్లా 'బా' కథలు ఇదే అంశాన్ని చెబుతున్నాయి.

అమ్మవారి నవ్వులోని ప్రధాన పాత్రలు జాఫర్, వెంకట్రెడ్డు. గతంలో ఇద్దరూ ఒకే పల్లెకు చెందిన వారు. వెంకట్రెడ్డి తండ్రి ఆ గ్రామంలోని ఒక ముఠాకి నాయకుడు. వైరి వర్గం వెంకట్రెడ్డి తండ్రిని మట్టుపెట్టడానికి ఆయుధాలతో దాడి చేస్తుంది. ప్రాణాలకు సైతం తెగించి జాఫర్ తండ్రి రక్షించగలిగాడు. రెండు వర్గాల మధ్య రాజీ కుదిరింది. వెంకట్రెడ్డి కాలం నాటికి జాఫర్ ఆర్థిక పరిస్థితులు మారి రాజంపేట పక్కపల్లెకు మకాం మార్చాడు. అక్కడ్నుండి జాఫర్ వెంకట్రెడ్ల మధ్య దూరం పెరిగింది. జాఫర్ పువ్వుల వ్యాపారంతో పొట్టపోసుకునేవాడు. కడప ప్రాంతంలో ఆ వ్యాపారానికి గిరాకీ లేకపోవడంతో హైదరాబాద్ తీసుకువెళ్ళి అమ్మేవాడు. కడప ముస్లిం భాషను హైదరాబాదీ ముస్లింలు ఎగతాళి చేసేవారు. వ్యాపారంలో వచ్చే ఇబ్బంది కారణంగా మత అయిడంటిటీ కోసం ముస్లిం టోపీ ధరించడం మొదలు పెట్టాడు. క్రమంగా రంజాన్ ఉపవాసాలు, నమాజులు ప్రారంభించాడు. వెంకట్రెడ్డి కూడా శనివారాలు చేయడం, ఆ దినం మాంసాహార భక్షణ మానివేయడం ప్రారంభించాడు. గతంలో లేని మతపర అలవాట్లు ఇద్దరిలోనూ చోటు చేసుకున్నాయి. హిందూ ఆచారాలు, పురాణేతిహాసాలు తెలిసిన వాడు కావడంతో పెండ్లి పందిరి అలంకరణలో జాఫర్ అద్భుత ప్రతిభ కనబర్చేవాడు. అందుకే వెంకట్రెడ్డి అలంకరణ నిమిత్తం జాఫర్ని నియమించాడు. బిజెపి తీర్థం పుచ్చుకుని ఎం.పి. సీటు కాజెయ్యాలని భావించిన వెంకటస్వామి రెడ్డి ఆ పార్టీలో పట్టున్న సుందర రామానందుల్ని పెండ్లి ఆశీర్వచనార్థం ఆహ్వానించాడు. పెండ్లి పందిరి అలంకరణకు ముగ్ధుడైన స్వామి అమ్మవారి నవ్వుతో రూపొందించిన ఈ పూల ప్రతిమ హిందూ కళాకారులకు తప్ప ఇంకెవ్వరికీ సాధ్యంకాదని చెప్పాడు. ఎవరు రూపొందించారో చెప్పమని అడిగాడు. వెంకట్రెడ్డి కొడుకు హరీశ్వర్ మా జాఫర్ చిన్నాన్న అనడంతో స్వామి హతాశుడయ్యాడు.

ఇదే వస్తువుతో నిర్మించిన ఇంకొక కథ 'సారీ జాఫరాలీ' ఉద్యోగ వేట నిమిత్తం రామారావు హైదరాబాద్కెళ్ళాడు. వారసత్వంగా వచ్చిన పాతపుస్తకాల వ్యాపారం చేస్తున్నాడు జాఫరాలీ. చలం 'అమీనా' పుస్తకాన్ని జాఫరాలీ షాపులో రామారావు కొన్నప్పుడు ఇద్దరికీ పరిచయం ఏర్పడింది. అది స్నేహంగామారి, రామారావు అభివృద్ధికి దోహదపడింది. ఇద్దరూ అభ్యుదయ సాహిత్యాన్ని చదివి, అభ్యుదయ ఆదర్శాల్ని అలవాటు చేసుకున్నారు. పాత పుస్తకాల వ్యాపారం దెబ్బతినడంతో కరీంనగర్లోని తన బావ ఫర్నిచర్ షాపులో భాగస్వామయ్యాడు. రామారావుకి ఇద్దరు కొడుకులు. పెద్దవాడు అమెరికాలో స్థిర పడిపోయాడు. చిన్నవాడు బిటెక్ పూర్తి చేసి మరో ఆరు నెలల్లో అన్నదారి పట్టబోతున్నాడు. జాఫరాలీకి నలుగురు కూతుళ్ళు. ముగ్గురికి వివాహాలు చేశాడు. నాలుగో కూతురు నసీమాకు హైదరాబాద్లో ఉద్యోగం వచ్చింది. జాఫరాలి తన కూతుర్ని స్నేహితుడు రామారావింట్లో కొన్నాళ్ళు ఉంచాలనుకుంటాడు. రామారావు కొడుకు ముస్లిం ద్వేషి. ఆమె రావడం వాడికి ససేమిరా ఇష్టం లేదు. ఇష్టంలేని సంగతి నసీమాకే చెబుతాడు. ఆమెకూ హిందువులపట్ల సద్భావం లేదు. ఈ పరిణామాలకు రామారావు కలత పడతాడు. పెంపకంలోని లోపాన్ని గ్రహించి పశ్చాత్తాప పడ్డాడు. నసీమాను వెంట పెట్టుకొని ఉద్యోగులుండే హాస్టల్ కోసం

తిరిగాడు. అద్దె గది కోసం తిరిగాడు. మత కారణంగానే దొరకడం కష్టంగా మారింది. నసీమాయే పాతబస్తీలో ఒక గది అద్దెకు తీసుకుంది. అక్కడే నాకు సురక్షితమని వెళ్ళిపోతుంది.

గ్రామీణ ముస్లిం కుటుంబాల నేపథ్యంలో సాగిన కథ 'బా'. పల్లె ప్రాంతాలకు కూడా అభద్రతా భావం మైనారిటీల్లో అలుముకోవడాన్ని ఈ కథ చెబుతుంది. బా జీవితమంతా బండితోలడంతోనే గడచి పోయింది. పల్లెల్లో వచ్చిన మార్పులు కారణంగా చేస్తున్న వృత్తులు ధ్వంసమై, కొత్త పనులు దొరక్క ఆర్థిక ఇబ్బందులతో సతమతమయ్యేవాళ్ళే కన్పిస్తారు. రోడ్డు, ఎర్రబస్సు రావడంతో బండితోలి బతికే చాలాంటి కుటుంబాలు పనుల్లేక ఎలా రోడ్డున పడ్డాయో కథ తెలుపుతుంది. "బాబ్రీ మసీదు కూలినట్టుగా అదే సంవత్సరం మా బండి ఇరుసు ఇరిగి కుప్పకూలింది" రచయిత ఆ కుటుంబాలకే చెందిన వాడుకావడంతో వాళ్ళ జీవితాన్ని, వాళ్ళ భాషను అతి సహజంగా కథలోకి ఎక్కించగలిగాడు. చర్యలు ఎంత హేయమైనవో అభద్రత ఎలా చోటు చేసుకుందో కథ తెలుపుతుంది. బిజెపి రంగ ప్రవేశం తరువాత లౌకిక భావానికి కలిగిన విఘాతాన్ని మూడు కథలు యదార్థంగా వర్ణించాయి.

**పేదల కథలు**

కూలివాడు కూలివాడుగానే మిగిలిపోయి వాడి శ్రమను దోచుకున్న వాడు ఎలా సంపదలు పోగేసుకుంటున్నాడో తెలిపే దళి కథ మొలక పల్లి కోటేశ్వరరావు 'స్వేదఫలం' మూడెకరాల కాపు 30 ఎకరాలు సంపాదిస్తాడు. వాడి సంపాదనను పాలికాపుగా ఉన్న దావీదు. చెమటా నెత్తురూ ఎలా ఎరుపుగా మారాయో ఈ కథ వివరిస్తుంది. దావీదు కాపుని ఎంతగానో నమ్మి రాత్రీ వగలు తన రక్తమాంసాలు అరగదీసుకొని చివరికి వార్ధక్యంలో జబ్బులతో కునారిల్లుతున్నప్పుడు ఆదుకోవాల్సిందిపోయి అసహ్యించుకొని గెంటివేయడం భూస్వామ్య మనస్తత్వానికి నిలువుటద్దం.

మట్టిపక్షులు కథ కూడా మూడు తరాల్లో జరిగిన మార్పుల్ని సూచిస్తుంది. ఈ కథలోని ప్రధాన పాత్ర అంజయ్య సోషల్ టీచర్. అంజయ్య తాత దావీదు పని చేసింది. పెదరామకోటయ్యదగ్గర ఆయన అప్పట్లో ఊరి ప్రెసిడెంట్. అంజయ్య తండ్రి ఎలమంద పని చేసింది చిన రామకోటయ్య దగ్గర. ఆయన

.............. ☆ ..............

**గ్రామీణ ముస్లిం కుటుంబాల నేపథ్యంలో సాగిన కథ 'బా'. పల్లె ప్రాంతాలకు కూడా అభద్రతా భావం మైనారిటీల్లో అలుముకోవడాన్ని ఈ కథ చెబుతుంది. బా జీవితమంతా బండితోలడంతోనే గడచిపోయింది. భూముల్లేక, చదువుల్లేక, పేదరికంతో మగ్గుతున్న గ్రామీణ ముస్లిం కుటుంబాల దయనీయ స్థితికి ఈ కథ ఉదాహరణ.**

.............. ☆ ..............

సమితి ప్రెసిడెంట్. ఆయన బావ జిల్లా పరిషత్ ఛైర్మన్ కొడుకు. వై.వి. రావు ఇప్పుడు మూడోసారి ఎం.పి. ఇప్పుడు అంజయ్య కొడుకు ట్రైనీ ఇంజనీరుగా చేరింది వాళ్ళ కంపెనీలోనే. అంజయ్యతో చదివిన దుర్గాప్రసాదరావు స్వయాన కొడుకుతో ఇంజనీరింగ్ కాలేజీ పెట్టించాడు. ఆ కాలేజీలోనే అంజయ్య కూతుర్ని ఇంజనీరింగ్ చేర్పించాడు. రిటైర్డ్ మిలటరీ ఉద్యోగి డేనియల్ పాత్ర ద్వారా రచయిత అంజయ్యకు సమాజగతిని, స్వాతంత్ర్యపు గుట్టును వివరించాడు.

**గ్రామ పేదలు, వృత్తిదారులు**

ప్రపంచీకరణ బహుళజాతి కంపెనీల రంగ ప్రవేశంతో కుల వృత్తులు ఎలా నాశనమయ్యాయో, వ్యవసాయం ఎంత ప్రమాదకర వృత్తిగా మారిందో వర్తమానం గ్రామీణ ఆత్మహత్యల రుతువుగా ఎలా మారి పోయిందో తెలిపే కథలు జాతశ్రీ 'అంతర్ముఖం', మంచికంటి వెంకటేశ్వరరెడ్డి మిత్తవ. గీత కార్మికుల యదార్థ జీవిత వ్యథల గాథ అంతర్ముఖం. అక్రమ బెల్ట్ షాపుల ధర్మమా అని వాడవాడలా చీప్ లిక్కర్ ఏరులై పారుతున్నది. ఫలితంగా కల్లుగిరాకీ తగ్గి కులవృత్తులు కూలి పోయి ఆత్మహత్యలు అనివార్యమవుతున్నాయి. ఈ కథలో మల్లేశం, అతని భార్య భూదేవమ్మ రెక్కల కష్టాన్నే నమ్ముకున్న వాళ్ళు. కొద్దిపాటి వ్యవసాయ భూమి ఉంది. మల్లేశు కొడుకు ఈ సంక్షోభ సమయంలో మధ్యతరగతి మనఃప్రవృత్తితో ఉన్నవాడు. 10వ తరగతి వరకు చదివాడు. ఐ.టి.ఐ. అయ్యాడు. అడ్డదారిలో ఉద్యోగం కోసం కొంత డబ్బు తగలేసాడు. ఆడపిల్లల వివాహాలు, కొడుకు వస్తువ్యామోహాలతో మల్లేశం ఆర్థిక పరిస్థితి దిగజారింది. కులవృత్తి ఆదాయం తగ్గింది. వ్యవసాయం కలిసిరాలేదు. విదేశాలు పోయి డబ్బులు గడించే కోరిక పట్టుకున్న మల్లేశం కొడుకు డబ్బుకోసం నానా హైరానా పెడుతుంటాడు. చావు కుటుంబాన్ని బతికిస్తుందని ఏతపేటలోని గత అనుభవం దృశ్య చెట్టు మీద నుంచి పడి చచ్చిపోతాడు మల్లేశం. కొద్దోగొప్పో కులవృత్తితోపాటు భూమి పుత్రువున్న మల్లేశందే. పరిస్థితే ఆత్మహత్యల పరిస్థితి అయితే ఒట్టి కులవృత్తినే నమ్ముకున్న గీత కార్మికుల పరిస్థితి ఇంకెంత దయనీయంగా ఉంటుందో ఊహించొచ్చు.

గ్రామీణ ప్రాంతాల్లో కరువు విలయతాండవం చేసే దృశ్యాన్ని కడుపు తరక్కుపోయినట్లు వర్ణించడం మిత్తవ ప్రత్యేకత. ఈ కథలోని గోవిందమ్మ ఇద్దరు పిల్లల తల్లి. ఆమె కాయకష్టం మీద ఇంటిల్లిపాదీ బతికేవారు. ఆమె భర్త జులాయి. ఎవరికి చెప్పాపెట్టకుండా ఎటో ఉడాయించాడు కూడా. ముసలి వాళ్ళకు ప్రభుత్వం ఆశ్రయ మిస్తుందన్న వార్తలు రావడంతో పిల్లల్ని తీసుకొని వలస పోవాలని ఊరు విడిచి పెట్టి దగ్గర్లో ఉన్న పట్నానికి చేరింది. లాభం లేకపోవడంతో ఏమి చెయ్యాలో తోచక కన్న వారి ఊరి బస్సెక్కింది. ఆ వూరి పరిస్థితీ అంతే. దుర్భిక్షానికి తోడు విషజ్వరాలతో ఊరు భయంకరంగా ఉంది. పల్లెటూళ్ళో వైద్యం దుస్థితి అతి సహజంగా చిత్రించడం జరిగింది. పొలం పని ఉన్నన్నాళ్ళూ గోవిందమ్మను వదిన బాగానే చూసుకుంది. పొలం పనులు లేక ఖాళీగా ఉండడంతో గోవిందమ్మను పంపేయమని వదిన ఒకటే గొడవ చేసింది. అరకొర పంటలతో అప్పులు తెప్పలుగా పెరగడం గోవిందమ్మ వదిన అలా వ్యవహరించడానికి హేతువయ్యాయి. గోవిందమ్మ ఆత్మహత్యకు సిద్ధపడుతుంది. చివరి క్షణంలో పిల్లలు గుర్తు రావడంతో నిర్ణయం మార్చుకొని, వాళ్ళని తీసుకొని చీకటి నుండి వెలుగు వైపు ప్రస్థానం సాగించింది.

కొడవలి, గొడ్డలి, రంపం, నాగలి పల్లె నుండి మాయమయ్యే తీరు స్వామి 'తెల్లదెయ్యం' కథలో తేటతెల్లమవుతుంది. గ్రామీణ వృత్తికారుల నేపథ్యంలో సాగిందీకథ. విత్తులో ప్రాణం రాజేసే విద్య తప్ప మరో నాగరికత తెలియని పాతన్నకు ద్రవ్య వ్యవస్థలో జరిగిన మోసం ఈ కథ తెలుపుతుంది. ఒక గింజ నుండి పది గింజలు పుట్టించగలుగు తున్నాడు కానీ ఆ గింజను రూపాయి చేసే రూపాయి నుండి పది రూపాయలు తీయలేకపో

తున్నాడు. ఈ అవకాశాన్ని వ్యాపార నాగరికత సొంతం చేసుకుంది. అదుగో పాతన్నకు అక్కడ్నుండి మాయరోగం పట్టుకుంది. ఆ రోగం వేదిస్తూనే ఉంది. ఎద్దులు కనిపించడంలేదని పాతన్న భార్యను అడుగుతారు. బోసిమెడ తడుముకుంటూ ఏమో అంటుంది. అయ్యో! అనుకుని అనుమానంగా బయటకు పరుగెడతాడు. బండి లేదు. కుమ్మరి తిప్పన్నకు సారె కనిపించడంలేదు. గాండ్ల వెంకటేశుకు గానుగు కనిపించడంలేదు. నేసే మున్నయ్యకు మగ్గం కనిపించడంలేదు. ప్రపంచీకరణ నగర సంస్కృతిని ఎలా పెంచుతుందో, నగరాలు విస్తరించి, గ్రామాల్ని గ్రామ జీవనాధారాల్ని ఎలా మాయం చేస్తున్నాయో ఈ కథ తెలుపుతుంది.

కొడుకుని నడుంకి కట్టుకొని, కత్తిపట్టుకొని గుఱ్ఱం మీద నుంచి ఝాన్సీ లక్ష్మీబాయి యుద్ధం చేస్తే లచ్చవ్వ తన కొడుకు భవితవ్యం కోసం ఆ వూరి భూస్వామితో చేసిన ఒంటరి పోరే 'పోరుతల్లి'. బెజ్జరపు రవీందర్ రాసిన ఈ కథ ఆద్యంతం గ్రామీణ భూస్వాములు పేదల్ని పెట్టే హింస, దౌర్జన్యం దోపిడి కనిపిస్తుంది. లచ్చవ్వ భూమిని కాజెయ్యడమే కాకుండా కొడుకుని పాలికాపుగా ఉంచమంటాడు భూస్వామి. లచ్చవ్వ భూస్వామిని అసహ్యించుకుంటుంది. దానితో వాడు బండబూతులు తిట్టడమే కాకుండా దారుణమైన దౌర్జన్యాలు చేస్తాడు. కథ ఆమూలాగ్రం భూస్వామి దుశ్చర్యల్ని తెలియచెప్పినా గ్రామీణ ప్రాంతాల్లో చేతివృత్తులు అటకెక్కిన తీరు అద్భుతంగా చెప్పడం జరిగింది. ప్రారంభంలో కొరవయ్యసారు చెప్పే పాఠం అర్థమయ్యి అర్థం కానట్టుండడం ఎంత దయనీయం. చెప్పే పాఠం గ్రామీణ వృత్తికారులకు చెందిన నేత గురించి. ఆ పాఠం గ్రామీణ పిల్లలకు అర్థం కాని స్థితి అటకెక్కిన చేతివృత్తుల స్థితిని తెలుపుతుంది.

కిందటి తరంలో సంఘటితంగా పోరాడి సాధించుకున్న హక్కుల్ని పాలక పక్షాలు ప్రయివేటీకరణ, సరళీకరణల పుణ్యమా అని ఉపసంహరించుకున్న విధానాల్ని లాభాల్ని కృత్రిమ నష్టాలుగా చూపించి కార్మిక రిట్రెంచ్‌మెంట్ విధానాన్ని కాంట్రాక్ట్ కూలీ విధానాన్ని, మానవ శ్రమకు బదులు యంత్రాల్ని ఉపయోగించే పద్ధతిని తెలియజేసే కథ కాట్రగడ్డ దయానంద్ రాసిన 'అలజడి' గతతరంలోని పోరాట పటిమ, ఐక్యమత్యం కోల్పోవడం పాలక పక్షాలకు ఎంత మేలు జరుగుతుందో

............ ☆ ............

**కొడవలి, గొడ్డలి, రంపం, నాగలి పల్లె నుండి మాయమయ్యే తీరు స్వామి 'తెల్లదెయ్యం' కథలో తేటతెల్లమవుతుంది. గ్రామీణ వృత్తికారుల నేపథ్యంలో సాగిందీకథ. విత్తులో ప్రాణం రాజేసే విద్య తప్ప మరో నాగరికత తెలియని పాతన్నకు ద్రవ్య వ్యవస్థలో జరిగిన మోసం ఈ కథ తెలుపుతుంది. ఒక గింజ నుండి పది గింజలు పుట్టించగలుగు తున్నాడు కానీ ఆ గింజను రూపాయి చేసే రూపాయి నుండి పది రూపాయలు తీయలేకపో తున్నాడు. ఈ అవకాశాన్ని వ్యాపార నాగరికత సొంతం చేసుకుంది.**

............ ☆ ............

తెలుపుతుంది. కార్మికులు, శ్రమ జీవుల జీవితాలు దుర్భరంగా మారడానికి ఎలా హేతువవుతుందో తెలుపుతుంది. గ్రామాలకు గ్రామాలు వ్యవసాయం నుంచి దూరంగా జరిగి కాంట్రాక్టర్ల సొంత ఆస్తిగా ఎలా మారిపోయాయో తెలుపుతుంది. భూములు కోల్పోయిన వాళ్ళు దినసరి కూలీలుగా ఎలా పరివర్తన చెందారో అర్థమవుతుంది. పోరాడి ఏర్పాటు చేయించుకున్న ఆసుపత్రులు, విద్యాలయాలు ఎలా నిర్వీర్యమై మూతలు పడుతున్నాయో ఈ కథ తెలుపుతుంది.

### మానవ సంబంధాలు

ఎన్.వి. కృష్ణాజీ రాసిన లేడి చంపిన పులి నెత్తురు అద్భుతమైన ఫిక్షన్ గిరిజన గుడ్డిబాలుడు అసాధారణ పట్టుదలతో కృషితో, త్యాగంతో పులిని చంపుతాడు. గూడెంలోని కళ్ళున్న వాళ్ళు సైతం మనుష్యుల్ని, జంతువుల్ని రుచి మరిగిన ఆ క్రూర జంతువేంటో పసికట్టలేకపోయారు. గుడ్డి బాలుడే పాద చిహ్నాలు తడిమి అది పులని నిర్ధారిస్తాడు. దాన్ని చంపడానికి ఆయుధాలు, కళ్ళలా ఉన్న అధికారులకి, గూడెం వాసులకి దారి చూపుతాడు. చంపే ప్రయత్నం సఫలం కాలేదని బాధపడతాడు. అర్ధరాత్రి ఏకాంతంగా చిన్న చాకు లాంటి కత్తి తీసుకొని మొండి ధైర్యంతో పులిని చంపుతాడు. తను రక్తం మడుగౌతాడు. అనేక రుగ్మతలతో బోర విరుసుకొని పేదల రక్త మాంసాలు రుచి మరిగిన ఈ వ్యవస్థను చంపి శాంతి వికసింపచేయడానికి కళ్ళున్నా చూడలేని కబోదులు త్యాగాలకు ఒడికట్టాల్సిన

సమయం ఆసన్నమయ్యిందని తెలిపే ఈ కథ భవిష్యత్ పట్ల ఆశతో సాగింది. బాల్య జ్ఞాపకాల్ని కదిపి, కుదిపి మనల్ని బాల్యంలోకి పరుగెత్తించే కథ రమేష్ ఉత్తరపొద్దు. ఈ కథంతా ప్రళయ కావేరీ వర్ణనే. ఇప్పుడు పాటాల్లో పులికాట్‌గా చెప్పే సరస్సే ప్రళయకావేరి. ప్రళయ కావేరీ దీవుల్లో తన బంధువుల ఇళ్ళకు వెళ్ళేటప్పుడు పడ్డ అగచాట్లు రమేష్ సుందరంగా వర్ణించాడు. ఉత్తర కార్తిలో ప్రళయకావేరీ పరిస్థితి, ప్రమాదభరితమైన ఉత్తర పొద్దు ప్రయాణం, ఉత్తర పొద్దున ప్రళయకావేరి సాగించిన ప్రణయం గురించిన వర్ణనలు అందంగా సాగాయి. ప్రళయకావేరి దీవుల్లోని జీవన పరిస్థితులు, ఆహార వ్యవహారాలు ప్రకృతి దృశ్యాలు మన కళ్ళముందు నిలిచిపోతాయి. నేటి కళా విహీన ప్రళయ కావేరిని చూసి మనస్తాపం పొందిన రచయిత చిన్న నాటి జ్ఞాపకాలతో ఊరట పొందాడో లేదో గాని, ఆధునిక సౌకర్యాల పేరుతో ప్రకృతి అందాల్ని విచ్ఛిన్నం చేయడం జీర్ణించుకోలేకపోయాడు. దీవులకు దీవులకు మధ్య రోడ్లు వేసి యదేచ్ఛగా నీరు పోవడానికి ఖానాలు కట్టడం మరిచి పోయిన ప్రభుత్వాలకు ఈ కథ కనువిప్పు కలిగిస్తుందా?

సాహితి 'లివింగ్ టు గెదర్' వైవాహిక జీవితాల్లో వచ్చిన పెనుమార్పుల్ని చెబుతుంది. నగర జీవితంలో కుటుంబ వ్యవస్థ ఎలా ఛిన్నాభిన్నమయ్యిందో వివరిస్తుంది. నిశాంత్, మహతిలకు వివాహమై ఎనిమిదేళ్ళయ్యింది. వాళ్ళకి ఇద్దరు పిల్లలు కూడా. నిశాంత్ ఉద్యోగి. మహతి హౌస్‌వైఫ్. నిశాంత్‌కు తన కాలేజీ మీట్ ప్రసన్న కనిపించింది. అదుగో అక్కడ్నుండి వాడిలో మార్పు చోటు చేసుకుంది. మహతితో సహజీవనం చేస్తూనే ప్రసన్నతో కలిసుండాలనుకుంటాడు. మహతి విభేదించింది. ఇద్దరూ విడిపోయారు. మహతి పి.జి. చదువు పూర్తి చేసి ఉద్యోగంలో చేరుతుంది. ఆ తరువాత లండన్ ఉద్యోగం పని మీద వెళుతుంది. పిల్లల్ని కూడా లండన్ తీసుకుపోతుంది. చాలా కాలం తరువాత తన ఆఫీస్ కొలిగ్‌ని పెళ్ళి చేసుకుంటుంది. ఆమెకు అతని వల్ల ఒక కొడుకు కూడా. నిశాంత్ ప్రసన్నలు వివాహేతరంగా కలుసుకుంటారు. ప్రసన్నకు కుటుంబ వ్యవస్థ మీద వ్యతిరేకత. చాలా సంవత్సరాల తరువాత లండన్ నుండి మహతి నిశాంత్‌కు ఉత్తరం రాసింది. పిల్లలు

లండన్ నుండి నిశాంత్‌ను చూడాలని వస్తున్నారన్నది ఉత్తర సారాంశం. నిశాంత్ ప్రసన్నలు స్టేషన్‌కు వచ్చి పిల్లల్ని రిసీవ్ చేసుకుంటారు. ఆ కలయిక తరువాత కుటుంబ జీవితగొప్పతనం నిశాంత్‌కు తెలుసొచ్చి మనసులో కలకలం సృష్టిస్తుంది.

అక్కిరాజు భట్టిప్రోలు 'నందిని' కథ ఇదే యితివృత్తంతో సాగిన రచన. నందినిది హైదరాబాద్. వివాహ వ్యవస్థ మీద ఆమెకు అసహ్యం. కలిసి జీవించాలి తప్ప పెండ్లి చేసుకోకూడదని నిర్ణయించుకుంటుంది. ఉద్యోగ నిమిత్తం అమెరికా వెళ్ళి అక్కడ ఒక కంపెనీలో మంచి పొజిషన్ సంపాదిస్తుంది. అమెరికాలో తనతో పని చేస్తున్న మార్క్‌తో పరిచయం పెంచుకుంటుంది. అది శారీరక సంబంధానికి దారి తీస్తుంది. యధేచ్ఛగా తిరగడమే స్వేచ్ఛగా భావిస్తుంది. అదే సమాజం మీద తిరుగుబాటను కుంటుంది. మాటల సందర్భంగా నందిని తన స్నేహితురాలితో ఈ అభిప్రాయాలు వెల్లడిస్తుంది. సామాజిక చట్రాన్ని అర్థం చేసుకోకుండా ఆర్థిక సమానత్వం ఒక్కటే స్త్రీ సమస్యలకు పరిష్కారంగా భావిస్తుంది. ఇలా అస్పష్ట అభిప్రాయాల సమాహారమే నందినిగా కన్పిస్తుంది. మార్క్‌తో చెప్పకుండా బిడ్డను కనాలనుకుంటుంది. హైదరాబాద్‌లో ఉన్న తల్లితండ్రుల్ని అమెరికా పిలిపించి విషయం చెబుతుంది. తల్లితండ్రులు మార్క్‌ని పెళ్ళి చేసుకోమంటారు. నందిని వ్యతిరేకిస్తుంది. నందిని కాన్పు కోసం ఆసుపత్రిలో జాయినై మగబిడ్డడ్ని కంటుంది. ఆమె ఆసుపత్రిలో ఉండగా మార్క్ ఒక పార్శిల్ తెచ్చిస్తాడు. పెండ్లి లేకుండా కలిసుండడం తనకిష్టంలేదని, పెళ్ళి చేసుకుంటేనే కలిసుంటానని లేకపోతే వేరే పెళ్ళి చేసుకుంటానని మార్క్ నందినికి తెగేసి చెబుతాడు. నందిని పార్శిల్ తెరిచి చూస్తుంది. అందులో అందమైన డైమండ్ ఉంగరం ఉంటుంది. చేతికి ఆప్యాయంగా పెట్టుకుంటుంది. నగర సంస్కృతి పేరిట విచ్ఛిన్నమవుతున్న వివాహ వ్యవస్థ ఈ రెండు కథల్లో ఉంది. వీటి మీద లోతుగా చర్చ జరగాల్సి ఉంది.

**కొత్త ప్రభావాలు**

టీనేజ్ అమ్మాయిలు కొత్త రుచులకు, కొత్త ప్రభావాలకు ఎలా లోనవుతారో తెలిపే కథ 'వర్షపు జల్లులో...' కుప్పిలి పద్మ టీనేజ్ అమ్మాయిల మనస్తత్వాన్ని చాలా సునిసితంగా పరిశీలించారు. వస్తు వ్యామోహ సంస్కృతి పిల్లల్ని ఎలా ప్రలోభపెడుతుందో, పెద్దల్లో కూడా


**టీనేజ్ అమ్మాయిలు కొత్త రుచులకు, కొత్త ప్రభావాలకు ఎలా లోనవుతారో తెలిపే కథ 'వర్షపు జల్లులో...' కుప్పిలి పద్మ టీనేజ్ అమ్మాయిల మనస్తత్వాన్ని చాలా సునిసితంగా పరిశీలించారు. వస్తు వ్యామోహ సంస్కృతి పిల్లల్ని ఎలా ప్రలోభపెడుతుందో, పెద్దల్లో కూడా ఎలాంటి మార్పు తెస్తుందో ఈ కథ తెలుపుతుంది.**


ఎలాంటి మార్పు తెస్తుందో ఈ కథ తెలుపుతుంది. మహి టీనేజ్ అమ్మాయి. ఇంటర్ చదువుతుంది. మహి తమ్ముడు 8వ తరగతి చదువుతున్నాడు. వీడియో గేములు, సిడిలు, కంప్యూటర్‌లు తన తోటి వాళ్ళ దగ్గరున్నాయి తనకు కావాలంటాడు వాడు. తన స్నేహితులు బళ్ళలో వెళ్తున్నారని తనకు బండి కావాలని మహి అంటుంది. తండ్రి సెల్ కొనుక్కుంటాడు. కూతురుకు కూడా కొనిపెడతాడు. అవసరంలేని వస్తువులు కొనుగోలును తల్లి వ్యతిరేకిస్తుంది. మహికి కొత్తగా ప్రతాప్‌తో పరిచయం ఏర్పడుతుంది. మొదట్లో మొగమాటానికి, తరువాత అలవాటుగా మహి ప్రదీప్‌తో పబ్‌లకి, డిస్కోలకి, ఫాంమ్ హౌస్ పార్టీలకి, వీకెండ్ పార్టీలకి వెళుతుంది. బీరు తాగడం, కృత్రిమ వానలో డాన్స్ చేయడం మొదలు పెట్టింది. ఇంటి దగ్గర ఏవో అబద్ధాలు చెప్పి సాయంత్రం పూట బయటకు వెళ్ళేది. ఏడాది చివర్లో అత్తెసరు మార్కులతో ఇంటర్ పాసవుతుంది. డిగ్రీకి వచ్చిన తరువాత ప్రదీప్ ఫామ్ హౌస్‌లోని సింగిల్ బెడ్ రూమ్‌కి తీసుకెళతాడు. అక్కడ తాగుతుంటాడు. భయంతో బయటకు పరుగుతీసి ఆటో ఎక్కి ఇంటికి పోతుంది. ప్రదీప్ మహికి ఫోన్ చేసి మొదట్లో అలాగానే ఉంటుందని అదేంతప్పుకాదని అంటాడు. మహి ఒప్పుకోదు. ఆమె పశ్చాత్తాపంతో కుములి పోతుంది. మహి బాధని పసికట్టిన తల్లి కూతుర్ని సంభాళిస్తుంది. తల్లితో జరిగిన విషయాన్ని చెప్పి బాధపడుతుంది. "కొన్ని సార్లు గాయపడ్డం అనివార్యం ఒక కొత్త జీవితం అందులోంచే చిగిరిస్తుంది. ఆ నమ్మకం నాకుంది" అని మహితో తల్లి చెప్పి ఊరడిస్తుంది. పిల్లల్ని బాహ్య ప్రపంచం తెలియకుండా పెంచితే జరిగే పరిణామాలు ఈ కథ వివరించింది.

గొలుసు జగదీశ్వరరెడ్డి రాసిన 'చీడ' కథ కుటుంబ వ్యవస్థలో వచ్చిన మార్పులతోపాటు తల్లితండ్రుల కలహాలు పిల్లలకు ఎలా శాపాలుగా పరిణమిస్తాయో తెలుపుతుంది. అరవింద సుజాతలది ప్రేమ వివాహం. అందునా కులాంతరం. కొన్నాళ్ళు సజావుగా సాగిన వాళ్ళ దాంపత్య జీవితం ఎంతో మంది పొగడ్తలను అందుకుంది వాళ్ళ పెరటి పూతోటలానే అందంగా, ఆనందంగా సాగింది. ఆర్థిక మార్పులు, పట్టణ నాగరికత వారి మధ్య అపోహలకు, అరమరికలకు హేతువయ్యింది. ఆ విషబీజాలు విస్తరించి ఒకరిపట్ల ఒకరికి ద్వేషం, ప్రతీకారంగా మారింది. వాళ్ళ గొడవల మధ్య పిల్లలు బలి పశువులయ్యారు. చిత్రహింసలు అనునిత్యం అనుభవించే వారు. మొత్తం కథని కథకుడు శంపంగి ఆత్మకథగా వివరించడం దీనిలోని ప్రత్యేకత. ఇంటి పెరటిలోని మొక్కలు చిట్టితల్లి మీద చూపించిన ప్రేమైనా తల్లితండ్రులు చూపించలేకపోయారు. తల్లితండ్రులిద్దరు చివరకు ఒకరి జ్ఞాపకాలు ఇంకొకరికి మిగలకూడదని వాటిని ధ్వంసం చేసుకుంటారు. ఇది నేటి వివాహాల డొల్లతనాన్ని బహిర్గతం చేస్తుంది. చివరకు చిట్టితల్లి, తల్లితండ్రులతోనూ అన్నయ్యతోనూ పెరటి మొక్కల్లో తీయించుకున్న ఫొటోను సంపంగి ఒడిలో దాయడం అద్భుత ముగింపు.

మొత్తం మీద వస్తువు విషయంలో సంకలనంలోని కథలన్ని ఒకదానితో ఒకటి పోటీ పడ్డాయనడం అతిశయోక్తి కాదు. శిల్పం విషయంకొస్తే కొన్ని అత్యద్భుతంగా ఉండగా కొన్ని కథలు ఆ స్థాయిలో లేవనే చెప్పాలి. కొత్త రచయితలు శిల్పాన్ని మెరుగు పరుచుకుంటారని ఆశించాలి. కథలు కాకరకాయలు సమాజాన్ని మారుస్తాయా అన్న వాళ్ళకు ఈ సంకలనం సమాధానం. కథలు ఉన్న ఫళంగా సమాజాన్ని మార్చలేకపోయినా సమాజ మార్పుల్ని చెబుతాయి. ఆ మార్పులు సమాజ శ్రేణుల్ని ఆలోచనలోకి నెడతాయి. ఆలోచన పదునెక్కి అభ్యుదయ సంస్కారం అబ్బుతుంది. ఆ సంస్కారమే వ్యక్తిలోనూ సమాజంలోను మార్పుకు దోహద పడుతుంది.

**(ఈ పరిచయం పెద్దదైనా సాహితీ మిత్రులకు ఆసక్తిగా వుంటుందనే ఉద్దేశంతో ప్రచురిస్తున్నాం. దీనిపై విజయనగరం సాహితీ స్రవంతి ప్రత్యేక చర్చ నిర్వహించింది.)** ❖

# గే నవలకు బూకర్ బహుమతి

బ్రిటన్‌లో ప్రతిష్ఠాత్మకమైందిగా చెప్పబడే బూకర్ బహుమతి ఈ ఏడాది అలన్ హోలింగర్స్ నవల " ద లైన్ ఆఫ్ బ్యూటీ" కి లభించింది. కామన్‌వెల్త్ రచయితలకిచ్చే బూకర్ ప్రైజును ప్రఖ్యాత వ్యాపార సంస్థలు స్పాన్సర్ చేస్తాయి.

హోలింగస్ట్ గే నవల మార్గరెట్ థాచర్ కాలాన్ని వర్ణించేదిగా చెప్పుకున్నా ఇతివృత్తంలో ప్రధానాంశం స్వలింగ సంపర్కమే. ఈ నవలలో నిక్‌గెస్ట్ అనే ఒక గే యువకుడు ఆక్స్‌ఫర్డ్ నుంచి వచ్చి ఒక కన్సర్వేటివ్ ఎంపి నివాసంలో మకాం పెట్టి అనేక వ్యవహారాలు నడుపుతాడు. అవి అతని జీవితాన్ని మార్చివేస్తాయి. ఇంతకూ ఈ నవలను ఎంపిక చేసిన కమిటీ అధ్యక్షుడు క్రిస్ స్మిత్ తానే ఒక గే.టోనీ బ్లెయిర్ ప్రభుత్వంలో సాంస్కృతిక శాఖను నిర్వహించిన స్మిత్ నవలలోని విషయాన్ని బట్టిఎంపిక చేశాము తప్ప స్వలింగ ఇతివృత్తం ప్రధానం కాదని చెప్పే వివరణ ఎవరినీ సంతృప్తి పరచలేదు. పైగా దీనితో పోటీ పడిన డేవిడ్ మిచల్ ' క్లౌడ్ అట్లాస్", కామ్ టోబిన్ ద మాస్టర్ ఇంతకంటే మెరుగైనవని పలువురు అంటున్న మాటల్లో నిజం వుంటే వుండవచ్చు. అన్నిటినీ కూలంకషంగా చదివిన తర్వాతనే ఖచ్చితంగా చెప్పడం సాధ్యం. కాని లైన్ ఆఫ్ బ్యూటీ ఎంపిక సాహిత్య లోకాన్ని పెద్దగా ఉత్సాహపరచలేదని మాత్రం స్పష్టమవుతూనే వుంది. థాచర్ కాలపుసంతానం ఇంగ్లీషు నవలా ప్రపంచపు బహుమానాన్ని గెలుచుకుని వుండొచ్చుగాని పాఠకుల హృదయాలను గెలవలేదని వాఖ్యాతలు రాశారు. ఇది చాలా క్లిష్టమైన ఎంపిక అని స్మిత్ స్వయంగా అన్నారు. దీన్ని బట్టికాలం ఎంతమారిందో తెలుస్తుందని, గే ఇతివృత్తం సమకాలీన రచనల్లో ఒక విలువైన భాగంగా మారిందని కూడా ఆయన వ్యాఖ్యానించారు. తన పుస్తకం ఎంపిక చేసినందుకు కృతజ్ఞున్నని , ఎంతో తేలిగ్గా ఇతర పుస్తకాలు తనను మించి పోయివుండవచ్చని హోలింగర్స్ కూడా వ్యాఖ్యానించడం గమనార్హం. యాభై ఏళ్ల హోలింగర్స్ ప్రముఖ విద్యావేత్త, రచయిత, టైమ్ లిటరరీ సప్లిమెంటు డిప్యూటీ ఎడిటర్ కూడానట. అయితే సామాజిక సంక్షోభాలకు, వికృతాలకు మేధావులు కూడా అతీతులేమీ కాదు. ఆయన లైన్ ఆఫ్ బ్యూటీకి బహుమతి అందించడం ద్వారా బ్రిటన్, అమెరికాలలో వున్న గే ఓటర్లను ఆకట్టుకోవాలని, దీర్ఘకాలికంగా వారి మద్దతు పొందాలని పాలకులు భావిస్తుండవచ్చు. ఒకవైపు దేశాల స్వేచ్ఛను హరిస్తూనే తమ దేశాలలో మాత్రం ఎలాటి స్వేచ్ఛకైనా తాము వ్యతిరేకం కాదనే సందేశాన్ని అందించాలనుకుని వుండొచ్చు. ఏమైనా సాహిత్యం అమానవీయ లక్షణాలను పరిహరించడానికి, మరింత మెరుగైన సున్నితమైన మానవ సంబంధాలు ఆవిష్కృతమవడానికి దోవచూపాలి. అది మొదటి నుంచి మంచి రచయితలందరూ అనుసరించిన సూత్రం. అందుకు భిన్నంగా సహజత్వం పేరుతో అసహజత్వానికి పట్టంకట్టి వికృతాలనే విశేషాలుగా చూపితే బహుమతు లందడం అసలు సిసలు విశేషం కాదూ?

## సులోచనాలు

**మాల్యశ్రీ**

పనికిరాని భవంతుల్ని
పడగొడతాడు విధ్వంసకుడు
కొత్త ప్రణాళికలతో
సరికొత్త నిర్మాణాలు
సంతరిస్తాడు సంస్కర్త
కొండొకచో
కవి కర్తవ్యం కూడా అదే!

కొత్త సీసాలో
పాత సారా నింపడం
పాత ఫ్రేమ్‌లో
కొత్త చిత్రాన్ని బిగించడం
కళంకారీ తనం
కాదంటే కవితా వైపరీత్యం!

ఆధునిక జీవిత చిత్రాన్ని
సమగ్రంగా చిత్రించే
విస్తృతమైన కాన్వాసు వచన కవిత
యతిగణాల ప్రాసల్లో, గ్రాంధికబంధాల్లో
కృతకంగా బిగించడం ప్రయాస
సాహిత్యం - సమాజం సర్వత్రా గతిశీలం!

తాక్షణికం, శాశ్వతం
కవిత్వంలో రెండు ప్రయోజనాలు
కవి పరిణామ శీలి
చారిత్ర కర్తవ్య నిర్వాహకుడు
ఏది ఎప్పుడు ఎన్నుకోవాలో
అతనికి తెలుసు!

## హైకూలు

**వి.ఎస్.ఎన్. మూర్తి**

ఫ్యాక్టరీ రొద
కరుగుతోంది బాల్యం
సిగ్గుపడవేం...

నేర్వదలిస్తే
శ్రమించే చిన్నచీమ
చెప్పేను పాఠం...

మూడు ముళ్ళతో
ఏడు అడుగులతో
జీవిత బందీ...

కష్టమన్పిస్తే
బతుకు సమరాన
కాదేదీ సాధ్యం...

ఆకలి తీర
ముక్కలైన రెక్కలు
పిల్లి తేచింది...

వేల నాల్కల్తో
మ్రింగుతోంది చీకటి
వెలుతురుని...

అంతర్మథనం
మది పెంపొందించేను
ఆత్మవిశ్వాసం...

పొద్దు వాలింది
గూటికి పరుగెడుతూ
పక్షి సందోహం...

ఒకటే వాన
మోదం కొందరికైతే
ఖేదం ఎందరో్కో...

పెండ్లి కొడుకా
భాగస్వామివి నీవు
కట్నమెందుకు...

మల్లెపూసింది
జ్ఞాపకాల వాసన
గుండెలోతుల్లో...

తుఫాను జోరు
వెలిసిన వెనుక
నింగి నిర్మలం...

# శరత్‌ను తలపిస్తూ తానై నిలిచిన కొమ్మూరి



**స్థూలంగా కొమ్మూరి సాహిత్య వస్తువు మధ్య తరగతి జీవిత సంఘర్షణ. ఆయన దృష్టి కూడా అదే. అయితే మధ్యతరగతి స్త్రీ, పురుష సంబంధాల్లోని కరుణను చెప్పటానికే ప్రయత్నించారు. అతిక్రమించటానికి వీలులేని సంప్రదాయ కట్టుబాట్ల మధ్య ఇరుక్కొని పురుషుల దౌర్జన్యాలను, బాధ్యతా రాహిత్యాలను సహించటం, అనుభవించటం అలవాటైన మహిళలు కొమ్మూరి సాహిత్యంలో కనిపిస్తారు**

**రాచపాళెం చంద్రశేఖరరెడ్డి**

యండమూరి 'తులసిదళం' నవలకు అనుకూలాత్మక ముందు మాట రాసి, దాని మీద వచ్చిన విమర్శను సహించలేక కోర్టుకెక్కడం వంటి పనికి పూనుకున్నారనే ఫిర్యాదును తప్పిస్తే, కొమ్మూరి వేణుగోపాలరావు గారికి తెలుగు నవలా సాహిత్య చరిత్రలో తనదైన స్థానముంది. డాక్టరైన తండ్రికి కొడుకుగా పుట్టి తానూ డాక్టరై రచయిత అయిన కొమ్మూరి వేణుగోపాలరావు 50 దాకా నవలలు, కథలు, వ్యాసాలు, మనస్తత్వ రచనలు చేశారు. అరవై తొమ్మిదేళ్ళ వయసులో మరణించిన కొమ్మూరి పదమూడేళ్ళ వయసు నుంచి రచనలు చేసి సుదీర్ఘమైన సాహిత్య జీవితం గడిపారు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో పుట్టి, స్వాతంత్ర్యానంతర దశాబ్దంలో (1957) రచనలు ప్రారంభించిన కొమ్మూరి ఉద్యమాత్మక రచనలకుగాని, క్షుద్ర రచనలకుగాని పూనుకోకుండా మధ్యే మార్గంగా మధ్య తరగతి చిద్విలాసాలను చిందించే రచనలను చేశారు.

1960 నాటికి తెలుగు నవల మహిళాలోక స్వాధీనం కావటానికి సిద్ధమవుతున్నది. భూస్వామ్య స్వభావాన్ని పూర్తిగా చంపుకొని పెట్టుబడిదారీ వర్గం జీవితం సాహిత్యంలోకి ప్రవేశిస్తున్నది. సంఘ సంస్కరణ, జాతీయోద్యమ, తెలంగాణ ఉద్యమాలు ముగిసిపోయి, విరమింపబడి, పంచవర్ష ప్రణాళికలతో, సోషలిజం నామజపం చేస్తూ పెట్టుబడిని, ప్రైవేట్‌కి పునాదులు పడుతున్న దశలో కొమ్మూరి కలం పట్టారు. తెలుగు నవలా ఉద్యమ జీవితం ఒకవైపు కొనసాగిస్తూ, మరోవైపు సంపన్న వర్గాల జీవిత వాస్తవికతను పట్టుకొనటానికి ప్రయత్నిస్తుండగా, కొమ్మూరి మధ్యతరగతి ప్రజల త్రిశంకువర్గ జీవితాన్ని చిత్రించే ప్రయత్నం చేశారు. శరత్ నవలల అనువాదాలు తెలుగు పాఠకుల్ని ముగ్ధుల్ని చేస్తుండగా కొమ్మూరి శరత్ సాహిత్యంతో ప్రభావితులై రచనలు చేశారు. కొమ్మూరి మొదట శరత్ అడుగుజాడల్లో నడుస్తూ 'ఆంధ్ర శరత్' అనిపించుకుని క్రమక్రమంగా తాను తానై నిలబడ్డారు.

పిల్లదొంగ, పెంకుటిల్లు, చిన్నక్క సంఘర్షణ, వ్యక్తిత్వం లేని మనిషి, నివేదిత, ఆత్మజ్యోతి, వెన్నెల ఒణికింది వంటివి శరత్ మార్గంలో వచ్చిన నవలలు కాగా, భారతి, ఒకే రక్తం ఒకే మనుషులు, హౌస్‌సర్జన్, ఈ దేశంలో భాగమిది వంటివి తనదైన మార్గంలో కొమ్మూరి రచించిన నవలలు, క్షమించాను, పాప, మరమనిషి వంటి కథలు శరత్ ప్రభావాన్ని సూచించే కథలు కాగా, తక్కినవి ఆయన తన మార్గంలో రాసిన కథలు. "నా మీద మొదటి నుంచీ శరత్ ప్రభావం ఎక్కువ. ఏ రచనచేసినా పాత్ర చిత్రణ, సంభాషణలు లాంటి వాటి పట్ల శరత్‌ను దృష్టిలో పెట్టుకుని కలాన్ని సాగించేవాడిని" అని కొమ్మూరి ఆంధ్రజ్యోతితో అన్నారు మధ్యతరగతి ఉమ్మడి కుటుంబాలు విచ్ఛిన్నం కావటం, చిన్న కుటుంబాలు సైతం కుదుట పడకపోవటం, పరస్పరం అనుమానాలు, అవగాహనా రాహిత్యం వంటివి స్త్రీ పురుష సంబంధాలను విచ్ఛిన్నం చేయటం. ఈ నేపథ్యంలో స్వాతంత్ర్యం అందించిన ఒక నూతన విలువ - త్యాగం - ఇలాంటివన్నీ కొమ్మూరి సాహిత్యంలో ప్రతిబింబిస్తాయి.

స్థూలంగా కొమ్మూరి సాహిత్య వస్తువు మధ్య తరగతి జీవిత సంఘర్షణ. ఆయన దృష్టి కూడా అదే. అయితే మధ్యతరగతి స్త్రీ, పురుష సంబంధాల్లోని కరుణను చెప్పటానికే ప్రయత్నించారు. అతిక్రమించటానికి వీలులేని సంప్రదాయ కట్టుబాట్ల మధ్య ఇరుక్కొని పురుషుల దౌర్జన్యాలను, బాధ్యతా రాహిత్యాలను సహించటం, అనుభవించటం అలవాటైన మహిళలు కొమ్మూరి సాహిత్యంలో కనిపిస్తారు. పుట్టిన పదమూడేళ్ళకే (1957) 'పెంకుటిల్లు' నవల రాసి తెలుగు నవలా లోకంలో చాలా మందిని ఆకర్షించారు కొమ్మూరి. 'పెంకుటిల్లు' అంటే మధ్య తరగతి కుటుంబం. ఈ నవల శరత్ నవల 'సభద'కు తెలుగు రూపంగా కనిపిస్తుంది. శరత్ నవలల్లోని యువకుల లాంటి వాళ్ళే కొమ్మూరి నవలల్లోనూ కనిపిస్తారు. వంచితలను చేరదీసే ఆదర్శ యువకులు అనేకుల్ని కొమ్మూరి నవలీకరించారు. కొమ్మూరి నవల చిన్నక్కలో 'రాగిణి' శరత్ 'శ్రీకాంత్' నవల్లో 'రాజ్యలక్ష్మి'ని తలపిస్తుంది. పురుషుల పరంగా కూడా రవి (చిన్నక్క) శ్రీకాంత్ (శ్రీకాంత్)కు మరో రూపంగా కనిపిస్తారు. కొమ్మూరి 'సంఘర్షణ'లో అనసూయ, శరత్ 'చరిత్రహీన్'లో కిరణ్మయి అక్కా చెల్లెళ్ళు లాగా కనిపిస్తారు. శరత్ శ్రీకాంత్‌లోనూ అంతే. సంఘ దృష్టిలో పతిత లైనవాళ్ళు నిజానికి ఉన్నత ఆలోచనలు కలిగి ఉండటం శరత్‌లోనూ, కొమ్మూరిలోనూ కనిపిస్తుంది. మంజుభార్గవి (కొమ్మూరి–వెన్నెల ఒణికింది) కమల (శరత్–శేషప్రశ్న) ఇలాంటి వాళ్ళు. ఉద్యమాలకు దూరంగా ఉన్నా కొమ్మూరి జీవితానికి దూరంగా ఉండలేదు. వాస్తవికత, ఆదర్శం, వైజ్ఞానికత వంటివి ఆయన సాహిత్యంలో కలగలసి పోయి ఉంటాయి. 1957 నాటి 'పెంకుటిల్లు' తర్వాత 'హౌస్‌సర్జన్' తెలుగు పాఠకలోకాన్ని బాగా ప్రభావితం చేసింది. ఈ నవల ఆయన అనుభవసారం. ఇది కొమ్మూరి తనదైన మార్గంలో రాసిన నవల. అనేక మంది వైద్యవృత్తిలోకి ప్రవేశించటానికి ఈ నవల ప్రేరణ అయిందంటే సాహిత్యం మానవ జీవితం మీద వేసే ముద్ర ఎంత బలంగా ఉంటుందో తెలుస్తుంది. కొమ్మూరి శైలి నిరాడంబరం. నవలలో వర్ణనకు అవకాశమున్నా ఆయన దానిని దుర్వినియోగం చెయ్యరు. ఆయన భాషలో పొదుపరి. పఠనీయత ఆయనకు ప్రమాణం. తెలుగు సాహిత్యానికి శరత్ పరిమళాలు అద్దుతూ, ఆదర్శీకరణకు పూనుకుంటూనే వాస్తవితను మరవకుండా రచనలు చేశారు కొమ్మూరి.

**('ఆంధ్రజ్యోతి' సౌజన్యంతో)**

# నీలివల



దాట్ల దేవదానం రాజు

మనిషి రోడ్డున పడ్డాడు. పాత మాట కాదు ఇది. ఇప్పటిదే. రెక్కలొచ్చి ఎగిరి పోయాడనుకున్న వాడు కాస్తా రెక్కలు విరిగి... కాలచక్రాల్లో నలిగి... బతికున్న శవంలా ఇంటికొచ్చి పడ్డాడు. రోజుకో ఫ్యాక్టరీ మూతపడుతూనే ఉంది. అందులోని వాళ్ళు కొత్తదారులు వెతుక్కుంటూనే ఉన్నారు. బంగార్రాజు వంతు ఇపుడు. గుప్పెడు తెరవమని కొంత డబ్బు మూటకట్టి ఇచ్చారు. బంగార్రాజుకు ఆ ఫ్యాక్టరీ వాళ్ళు. విప్పి చూస్తే ఎనభై వేలున్నాయి. రాను రాననుకున్నా యానాం రాక తప్పలేదు.

ఎంతయినా నగర జీవనానికి అలవాటు పడ్డ ప్రాణం. ఊపిరి అందక గిలగిలా కొట్టుకున్నాడు కొన్నాళ్ళు. ఏం చెయ్యాలో పాలు పోలేదు.

నిదానించి చూస్తే తలపాగాలు విప్పేసుకుని వంగిన వెన్నుముకని సాగదీసుకుని పరుగులు పెడ్తున్నారు జనం. ఎవరూ సూటిగా కళ్ళలోకి చూడ్డంలేదు. ఎవరూ నిలబడి మాట్లాడటంలేదు. ఎలాగో తంటాలు పడి వాళ్ళని ఆపి 'ఏమిటి సంగతి' అని అడిగాడు బంగార్రాజు. 'పాప ఏడ్చింది' అన్నంత సులువుగా వాళ్ళు వేళ్ళు మడతలు పెట్టి లెక్కలు చెప్పారు. చాతి పొంగించి పొడుగాటి జేబుల్ని చూపించారు. 'వినబడలేదా పెళపెళార్భాటాల ధన ఘోష' అన్నారు.

వాళ్ళ మెడలో లావుపాటి గోల్డ్ చైన్ మిలమిలా మెరుస్తోంది. ముంజేతి కంకణాలు జిగేలుమంటున్నాయి. ఇక బంగార్రాజు ఆగలేక పోయాడు.

ఇంటికొచ్చాడు.

కాగితాల మీద కూడికలు, తీసివేతలు వేశాడు. అవధులు మించిన ప్లస్‌లు ఊరించాయి. గణాంకాలు పూర్తయ్యేటప్పటికి జేబు బూరెలా పొంగింది. చొక్కా కాలరు కొత్త నోటులా రెపరెపలాడింది. అర్థంతరమైన పిల్లల ఇంగ్లీషు చదువులపట్ల ఆశలు తొడిగాయి.

✣ ✣ ✣

"ఆరు మాసాలైనా పెద్దోడు అట్లాగే వేలాడుతున్నాడు వాడి బతుకేదో వాడు బతుకుతాడనుకుంటే మన మీద పడ్డాదేమిటీ? ఏమైనా అడిగావా?" పెళ్ళాన్ని నెమ్మదిగా అడిగాడు సింహాద్రి రాజు "వాడు తెలివైన వాడు. ఏదో ఒకటి వాడే చేస్తాడు. మీరేం దిగులు పడకండి".

"వీధులంట తిరుగుతూ ఇళ్ళ అరుగుల దేకుతూ కబుర్లెట్టుకుంటే సరిపోత్తా, భార్యాబిడ్డల పోషణ ఎలాగో చూడాలి కదా. చిన్నోడిలా ఉన్న కొద్దిపాటి కొంద్ర దున్నుకుని బతగ్గలడా వాడు?"

బంగార్రాజు చెవిటి వాడు కాదు. నెమ్మదిగా తల్లితండ్రుల మాటలు అందుతున్నాయి. సారాంశంగా భార్య సణుగుడు

మొదలయ్యింది. ఇరుకిరుకుగా జీవన మెట్లా అని గింజుకుంటూంది. పట్నం నుండి ఎప్పుడయినా ఇక్కడ కొచ్చినపుడు మహారాణి దర్పాన్ని ప్రదర్శించేది. ఇక్కడి వాళ్ళను బురద మనుషులుగా ఈసడించుకునేది.

బంగార్రాజు ఆలస్యం చేయదలుచుకోలేదు. రొయ్యల చెరువుల్లో అదృష్టాన్ని పరీక్షించుకోవాల్సిందే. ఒంటికి బాడి పూసుకోవాల్సిందే. పాత స్కూటరు కొన్నాడు. తాళ్ళరేవు చెరువుల కేసి వరసాగ్గా వారం రోజులు తిరిగాడు. కొత్త పరిచయాలు... కొత్త వాసన... కొత్త కబుర్లు... ఆకాశానికి నిచ్చెనలు వేసే కొత్త ఊహలు... చెవులు చిల్లులు పడుతున్నాయి. ఒకటే రొద. సమయం... అతి తక్కువ కాలం... అపరిమిత సంపాదన... ధన రాసుల వెల్లువ... ఆలసించిన ఆశాభంగం... త్వరపడండి... త్వరపడండి... కుడి ఎడమల గొట్టమెట్టి బాకా ఊదుతున్న హోరు... వేయి చెప్పు... లక్ష చెప్పు... కావాలి ఒక బతుకు పాట. తప్పవు దిగంతాల పరుగులు... రూపాయల గలగలల్ని నీటిలోనే దేముకోవాలి... ధైర్యేసాహసే లక్ష్మీ...

గాడి మొగ దగ్గర ఆరు ఎకరాల చెరువులు తీసుకున్నాడు బంగార్రాజు. కిస్తు ఎకరానికి పది వేలు.

అడ్వాన్సిచ్చి ఇంజన్లు గొట్టాలు సమకూర్చుకునేటప్పటికి సొమ్ములు అయిపోయాయి. రొయ్యల చెరువుల రైతుకు పరపతి ఎక్కువ. అప్పులు బాగా పుడ్తాయి. ప్రతి రైతు తప్పక లాటరీ తగిలేవాడిలా ఉంటాడు. పేకాట ఆఖరి నిముషంలో ఏసిడిసికి అనువైన ముక్క దూరి షో చూపించే వాడిలా ఉంటాడు.



ఉప్పాడ హేచరీల కెళ్ళి రొయ్య పిల్లల్ని తెచ్చాడు. స్నేహితుల్ని వెంటేసుకుని బేరమాడి... గిరి గీసుకుంటూ... అబ్బే.. మీన మేషాల లెక్కలు కుదరవు... ఎంతసేపూ కళ్ళు మూసుకుని ముందుకు ఉరకాలి... సందేహాల్ని... సలహాల్ని... కూడగట్టుకుని... నింపాదిగా మెలకువల్ని పట్టుకోవాలి.... పట్టుకున్నాడు బంగార్రాజు.

బంగార్రాజుకి సహజంగా చొరవెక్కువ. కొంత చోటు ఇస్తే దూసుకుపోతాడు. అతగాడి సాహసానికి మిత్రులు సైతం దంగైపోవాల్సిందే.

రొయ్యల ఉల్లాసమే రైతు ఆరోగ్యం పైకి తేలి వచ్చిందంటే గుండె గుబులౌతుంది. చంటి పిల్లాడ్ని సాకినట్లు చూసుకోవాలి.

బంగార్రాజు పంట తూకం లెక్కల్లోకి వచ్చేసింది. మరో పది రోజులకు ఏభై కౌంటు ఖాయం. రాత్రి పగలు చెరువు చుట్టూనే తిరుగుతున్నాడు. మేతకు కక్కుర్తి పటం లేదు. గుమ్మరిస్తున్నాడు. సేఫ్ లైన్‌లోకి వచ్చేస్తే పర్వాలేదు. ధీమాగా ఉండొచ్చు ఆ తర్వాత నుండి పెరిగే ప్రతి గ్రాము లాభమే.

పక్క చెరువుల రైతులు బిక్కమొహాలేసారు. రొయ్యలు పైకి తేలి ఈదుతున్నాయి. దేవుళ్ళకు మొక్కుకుంటున్నారు. అందరి చెరువులు ఒకేలా వుంటే కాల మహిమ అని సరిపెట్టుకుంటారు. బంగార్రాజు నక్కను తొక్కి వచ్చాడని కుళ్ళిపోతున్నారు.

"అంతా మాటల మాయాజాలం. కబుర్లలో మట్టుక్కి కుబేరులయిపోతారు. అంతా సొల్లు ప్రచారం. నూటికి తొంభై మందికి ఎపుడూ లాసే. వృధా ప్రయాసే. తెలుసుకుంటే నరుడా!"

"వాడెవడూ, ఆ వెటర్నరీ డాక్టరుని చూడు. కోడె గిత్తలా మెరిసిపోతూ వుండే వాడు. వాడి కర్మ... కాకినాడ బదిలీ అయి వచ్చాడు. ఆశ ఇంత లావు పుట్టుకొచ్చి చెరువుల్లో పడ్డాడు. ఇపుడు చూడు ఎలాగున్నాడో ఉప్పు సోడుసోకి ఎలుగుబంటిలా తయారయ్యాడు. లోతు తెలియక దిగాడు. దిగాక ఇక ఎక్కడానికి మెట్లు లేవు"

"సొంత చెరువులున్నోడు కౌలుకిచ్చుకుని డబ్బులు బ్యాంకులో పడేసి హాయిగా పెళ్ళాన్ని వాటేసుకుని తొంగుంటున్నాడు. రిస్కులేని బతుకు వాడిది"

"బేపనాయనా రొయ్యలే, కోమటాయనా రొయ్యలే. రామయ్య పంతులు రిటైరవ్వగానే చెరువులోకి ఉరికాడు. ఈత రాక గుడ్లు తేలేస్తూ గింజుకుంటున్నాడు"

బంగార్రాజు నలిగిపోయాడు శారీరకంగా, మానసికంగా అనుకున్న ప్రకారం శిస్తు ముందుగానే ఇచ్చేసాడు. కోనపాక పేట నుండి సీడు తెచ్చాడు. బస్తాలకు బస్తాల ఫీడు వొలకబోసాడు. వేసినవన్నీ తినేస్తుంటే సంబరపడిపోయాడు. ఎప్పటికప్పుడు రొయ్యల్ని చేట వేసి తూకాలు తూసి లెక్కలు కట్టాడు.

ముప్పై కౌంటుకి వచ్చేటప్పటికి తననీ తినేస్తా యనుకుంటున్నాడు బంగార్రాజు.

ఇంటి దగ్గర మెతుకులు గొంతు దిగడంలేదు. ఒకటే ధ్యాస... కలల కలవరింతలు... నిద్రలేదు... కాలం కదలడంలేదు.

"బంగారానికి యావ మహబాగా అందుకుంది. తెగ కష్టపడుతున్నాడు. శ్రమకు తగ్గ ఫలితం చూస్తాడులే" సింహాద్రి రాజు అంటున్నాడు పెళ్ళాంతో.

బంగార్రాజు మకాం పూర్తిగా చెరువు దగ్గరే. మరో నాలుగు రోజులకు నెట్టింగ్ వస్తుంది. క్షణక్షణం ఫీడింగు, మందులుపట్ల జాగ్రత్తగా ఉంటున్నాడు. గతంలో చెరువు దగ్గరే కాటా వేసేవారు. ఇప్పుడు వాళ్ళ కాళ్ళ దగ్గరకు పట్టుకెళ్ళాలి. తూకాల్లో మోసాలుంటాయి చూసుకోవాలి.

ఆక్వా రైతుల్లో కలకలం. ధర రోజు రోజుకీ పడిపోతూంది. మార్కెట్టుని అంది పుచ్చుకున్న వాడే గొప్పవాడు. దేశాల మధ్య సంబంధాలతో ముడిపెట్టిన ధరలు అటూ ఇటూ ఊగుతుంటాయి. అగ్రరాజ్యం ఉరిమినా తుమ్మినా... ప్రకంపనలు తప్పవు.

ఒకటే ఒత్తిడి... వలేసి తూకాలయ్యేటప్పటికి... అన్నానికి అన్నం... సున్నానికి సున్నం అనుకున్నంత కాసినా రేటు తేడావల్ల అప్పులు తీరి మనిషి మిగిలాడు. అక్కడికి బంగార్రాజే అదృష్ట వంతుడన్నారు చుట్టూ ఉన్న వాళ్ళు. మనిషి నిలబడటమే గొప్ప అన్నారు.

"ఎంతో ఆశ పడ్డాం. తీరలేదు. ఇక చెరువుల జోలికెళ్ళొద్దు" భార్య అంటూంది.

"ముఖం పీక్కుపోయి రంగు నల్లబడి ఎందుకొచ్చిన తిప్పలురా, నాయనా" తల్లి బాధ.

"మనకు తినే యోగం లేదు. పెట్టి పుట్టాలి దేనికైనా" తండ్రి వేదాంతం.

గోపీకృష్ణా బార్ ఫెర్రీ రోడ్డులో గోదావరి ఒడ్డున వుంది. ఎప్పుడూ కిటకిటలాడుతూ హడావుడిగా వుంటుంది. విశాలమైన లాన్స్

మధ్య అరలుగా విడగొట్టబడి టేబుల్లూ, కుర్చీలూ సర్ది వుంటాయి. చిరుకాంతుల మధ్య మంద్రస్థాయిలో మ్యూజిక్ హాయిగా వుంది. బంగార్రాజు మిత్రులతో కూర్చున్నాడు. మందు అలవాటు లేదు. ఆత్మీయమైన వాళ్ళ పిలుపును కాదనలేక వచ్చాడు. వాళ్ళ బలవంతం మీద తొలిసారి కొద్దిగా బీరు రుచి చూసాడు.

రాజకీయాలు... ఎన్నికలు.. నాయకుల తీరు... సంభాషణ కొనసాగుతున్నది. ఉన్నట్టుండి వాళ్ళ మాటలు రొయ్యల చెరువుల మీదకు మళ్ళాయి. బంగార్రాజు వింటూ కూర్చున్నాడు.

"గోదారి లంకల్లోని చెరువులకు ఎప్పుడు నష్టమే లేదు. ఆ చెరువుల్ని కొట్టేవి లేనట్లే" రవి అంటున్నాడు.

"ఒక రైతు దింపిన నిలవనీరు మరొకడు నింపుకుంటాడు. అదంతా చావు కంపు. లంకల్లో అయితే ఆ బాధలేదు. ఎపుడూ ఫ్రెష్ నీరు... స్వచ్ఛమైన గాలి. అందుకే విరగకాస్తున్నాయి"

"ఈ సంవత్సరం వాసుగాడు ఓ పది లక్షలు కళ్ళ చూసాడు. రొయ్య బలే కాసింది. రేటు సరిగ్గా లేదుగానీ గత ఏడులా వుంటే నా సామిరంగా పట్టుకోలేకపోదుం."

"రాముడు తన పది ఎకరాల్ని ఇచ్చేస్తానంటున్నాడు. ఏరా, కాసులూ తంటాలు పడతావా?"

కాసులు బుర్ర అడ్డంగా వూపాడు. 'ప్చ్' అంటూ నిట్టూర్చాడు.

"ఏం లాభం? కౌలు బాగా పెంచేశాడు. ఎకరానికి ఇరవై కావాలంట" కాసులు అన్నాడు.

బంగార్రాజు కాసులు కేసి చూసాడు. అతని ముఖంలో నైరాశ్యం.

రాయలస్టాగ్ ఇంతట్లో అయ్యేటట్టు లేదు.

"మీరు కానియండి, నేను వెళతాను రా" అంటూ లేచి నిలబడ్డాడు.

"ఉండహేయ్ మేమూ వచ్చేత్తాం' అంటున్నా వినిపించుకోలేదు.



బంగార్రాజు వెళ్ళిపోయాడు.

రవి కాసులు భుజం మీద గట్టిగా ఒక్కటిచ్చాడు.

"వలలో పడిందిరా చేప. రేపొద్దుట బంగారం గాడు రాముడి దగ్గరకు పోతాడు చూడు. వాడు బుట్టలో పడాలనే ఇక్కడకు లాక్కొచ్చాను" రవి అంటున్నాడు.

"ఇందులో నీకు కలిసొచ్చేదేమిటి రా"

"రొయ్యల చెరువులోళ్ళు లాభం వస్తే వందెట్టి గుణించి చెప్తారు. నష్టం వస్తే పదెట్టి భాగించి చెబుతారు. కారణం ఎవరికైనా ఎరికేనా?" అచ్యుతం అన్నాడు.

"ఆ గోల మనకెందుకు? బంగారాజ్రు ఆ చెరువులు తీసుకుంటే ఏమిటి లాభం అన్నావు కదూ. పదిహేను వేలకు మించి ఎంత ఎక్కువకు కౌలు ఇప్పిస్తే అదంతా మనదే" రవి అసలు విషయం చెప్పాడు.

'ఓర్నీ' అంటూ మిగిలిన వాళ్ళు ఆశ్చర్యపోయారు.

✤ ✤ ✤

రవి అంచనా తప్పు కాలేదు. బంగార్రాజు ఉదయాన్నే రాముడి దగ్గర కెళ్ళాడు రాముడు ఇంటి దగ్గరలేడు. గంటలో వస్తానని బయటకు వెళ్ళాడట.

నడుస్తున్న రైలులోంచి దూకేంత ఉద్వేగం అతనిలో ఆవహించింది.

ఎదురుచూపులు... ఆతురత... జీవితాన్ని ఒక గాడిలో పెట్టాలనే తాపత్రం అతని దృష్టంతా నెగ్గబోయే ఫలితాల మీదే.

బంగార్రాజు ఆలోచనలు ఎక్కడెక్కడో ఊరేగుతున్నాయి. రాముడ్ని బతిమాలి చెరువులు తీసుకోవాలి. మరోసారి అదృష్టాన్ని పరీక్షించుకోవాలి. చేతులకు మెడకు బంగారు గొలుసులు, ఏ.సి. గదులు, మారుతీ కారుల మెరుపులతో జీవన విధానాన్నే మార్చుకున్న రొయ్యల రైతులు కళ్ళముందు నిలబడ్డారు. చెరువుల ముందు వెనుక వాళ్ళ స్థాయి అందరికీ తెలిసిందే. కాసుల గలగలలతో వేషం, భాష కొత్తదారులు వెతుక్కుంటున్నాయి.

రాముడొచ్చాడు బంగార్రాజుని చిరునవ్వుతో పలకరించాడు. కుర్చీ దగ్గరగా జరిపి కూర్చున్నాడు. పైన ఫాను పెద్ద చప్పుడుతో తిరుగుతూంది.

"ఏమిటి సంగతి?"

"మీ కోసమే వచ్చాను. మీ దయ కావాలి"

రాముడు గ్రహించాడు బంగార్రాజు ఎందుకొచ్చుంటాడో ఊహించగలిగే ఎరుక అది. ముందుగా బైట పడటం బేరాలకు అనుకూలం కాదని అతనికి బాగా తెలుసు.

"దేనికి." అడిగాడు.

"మీ లంక చెరువులు కిస్తుకిమ్మని అడుగుదామని వచ్చాను"

"నిన్నటి దాకా ఎవరికైనా ఇద్దామనే అనుకున్నాను. ఇవుడు ఐడియా మారిపోయింది నేనే చేద్దామనుకుంటున్నాను"

"ఎంతో ఆశపడి వచ్చాను. మీవైతే అనుకూలంగా వుంటాయని..."

"లక్షలు మిగులుతున్న వాడికే జడుపే. మా చెరువులకున్న సదుపాయం... వేటికున్నాయి? నాలుగు డబ్బులు సంపాదించిన వాడు కూడా కౌలు కొద్దిగా పెంచగానే పారిపోతున్నాడు అందరికీ ఊరికే దోసిలలో పోస్తే జేబుల్లో వేసుకుందామనే".

"ఎంతకైతే ఇస్తారు?"

"ఎకరాకు ఇరవై వేలిస్తానంటే ఆలోచిస్తాను"

"మరీ ఎక్కువ. పెట్టుబడి రిస్కుతో కూడినది కదా"

బంగార్రాజు సణిగాడు.

చివరికిద్దరి మధ్యా పదునెనిమిది వేలకు కుదిరింది. షరతులు గురించి ఆలోచించడంలేదు బంగార్రాజు. అన్నింటికీ ఒప్పుకున్నాడు. దాని ప్రకారం కౌలు బాపతు సొమ్మంతా ముందే చేతులో పెట్టి చెరువులోకి దిగాలి. ఒక నిశ్చయానికొచ్చేసిం తర్వాత వెనుదిరిగే ప్రసక్తి లేదు.

ఇంటికి రాగానే గదిలోకి పోయి ముసుగుతన్ని పడుకున్నాడు. మాటా మంతీ లేదు.

భర్త వాలకం గమనించింది పార్వతి. విషయం అత్తమామలకు చేరేసింది. ఆతృతగా అనునయంగా పలకరించారు వాళ్ళు. బంగార్రాజు

చికాకు పడ్డాడు. కాసేపు తనని ఏకాంతంగా వుండనియ్యమని విసుక్కున్నాడు.

మర్నాడు

ఇంట్లో పెద్ద రాద్ధాంతమే జరిగింది.

బంగార్రాజు ప్రవర్తన కొత్తగా వుంది. ఇంట్లో వారికి ఇట్లాంటి అనుభవం ఇంతకు ముందు లేదు. గూడు కట్టుకున్న దిగులు అంచులు దాటింది. అసహనం అవధులు దాటినపుడే లోలోపలి స్వభావాలు బయటకు వస్తాయి.

వారసత్వపు వాటాగా వచ్చే ఎకరం పొలం గురించి అడిగేసాడు. అమ్ముకుంటానని తెగేసి చెప్పాడు.

తరతరాలుగా భూమిని నమ్ముకున్న సింహాద్రి రాజు విలవిల్లాడాడు. పిదప కాలం దాపురించిందన్నాడు. మరో ఆలోచన చెయ్యమని ప్రాధేయపడ్డాడు. ససేమిరా అన్నాడు బంగార్రాజు సరేనని అనక తప్పలేదు సింహాద్రి రాజుకు. మూడున్నర లక్షలు చేసి దంపచేను అమ్మేసాడు. రాముడికి కిస్తు చెల్లించాడు.

గోదావరి మధ్య మేట వేసిన లంక భూముల్లో తవ్విన చెరువులు అవి. రొయ్యల సాగు తర్వాతే వాటికి మహర్దశ పట్టింది.

ఒకనాడు గోదారి ఈత లంక మేత నానుడిగా పశువుల పెంపకానికీ అక్కడక్కడా వేరుశనగ పండించడానికీ ఉపయోగించేవారు ఈ లంక భూముల్ని. రోజూ నాటు పడవ ద్వారా లంకకు చేరాలి.



బంగార్రాజుకు ఈ ప్రయాణం భలే పసందుగా వుంది. లంకలో వున్నంత సేపూ గోదావరి తల్లి ఒడిలో సేద తీరుతున్నట్లుంటుంది. ఉభయ సంధ్యల్లోనూ కిరణాలు అలల మధ్య పసిడి నాణాల్ని మోసుకొస్తున్నట్లుంటుంది. గోదావరి తన్మయత్వం బంగార్రాజు అలుపును చిటికెలో పారద్రోలేది. నిశ్చల చెరువుల్లోనూ చంచల గోదావరి ప్రవాహంలోనూ వెన్నెల తీరే వేరు.

రొయ్యల చెరువుల వైకుంఠపాళీలో కిందకు తోసే సర్పాలూ పైకి ఎగలాగే నిచ్చెనలు... అనేకానేక ఇబ్బందుల దశలు దాటాలి. తెగుళ్ళు... మందులు... వైరస్‌లు... వైట్‌స్పాట్ భయోత్పాతాలు... వల్లకాడూ... మట్టీ మశానమూ... అంతేనా?

అమెరికా వోడు - యాంటీ బయాటిక్స్ వాడావు నాకొద్దు అంటాడు.

జపానోడు ముక్కుమూసుకుని మడ్డీ స్మెల్ అంటాడు.

మనకైతే మసాలాలు దట్టిస్తే రంగు రుచులు ఎక్కడికీ పోవు.

దిగుమతి సమయంలో అలా నాలుక మీద వేసుకుని ఇట్టే పసిగట్టేస్తాడు టేస్టర్.

ఏరియేటర్స్‌తో చెరువుని చిలకరించి... ఆక్సిజన్ పోసి... నిద్రాహారాలు మాని... మానసికాందోళనల మధ్య నలిగి... నలిగి... ప్రతిక్షణం... ఒత్తిళ్ళు భరించి... అంచనాల మించిన పెట్టుబడులు... సర్వం ఒగ్గి... నిటారుగా నిలబడి చూస్తే ఆనందమే ఆనందం బంగార్రాజు శ్రమ ఫలించి... రొయ్య ఏపుగా పెరిగి... కౌంట్ అద్భుతంగా వచ్చి... తేలిక పడ్డాడు. ఇంటిల్లపాదీ సంతోషతరంగాల్లో ఓలలాడే సందర్భం. ఆ యేడు ఎవరికీ పండనంత పంట... గోదావరి మాత చల్లని చూపుతో సిరులమోత... వేసిన సీడంతా పక్కాగా కాసింది. పెట్టిన మేత వూరికే పోలేదు. అన్నీ పోను అధమ పక్షం నాలుగు లకారాలు మిగలడానికి అడ్డులేదు.

వారం గడిచింది.

పిడుగులాంటి వార్త. ఊహించని మలుపు. కొన్ని నిజాలు చేదుగానే వుంటాయి. కష్టార్జితాలు గాలి వాటుకి కొట్టుకుపోవు అంటారు. అంతా అబద్ధమేనా?

ఎక్స్‌పోర్టర్ కంటికి అజా లేదు. టన్నులకొద్దీ రొయ్యలు ఎత్తుకుని పలాయనం చిత్తగించాడు. కోట్ల రూపాయలు రైతులకు శఠగోపం పెట్టాడు. రైతులు గగ్గోలు ఆకాశాన్నంటుతున్నది. ఆ ఏరియా మొత్తానికి ఆరు కోట్ల వరకు బాకీ పెట్టి పత్తా లేకుండా పోయాడు. ఎక్స్‌పోర్టరు గురించి రకరకాల కథనాలు. ధర పలుకుతుందని ఫ్రీజ్ చేసిన సరుకు పాడై సముద్రంలోకి పారేయాల్సి వచ్చిందనీ అమెరికాలోని డీలరు మోసం చేసాడనీ సొంత ఆస్తులన్నీ తనఖాలో వున్నాయనీ ముఖం చూపించలేక చచ్చిపోదామనుకున్నాడనీ... బంగార్రాజుకి మనుష్యుల మీద బోలెడంత నమ్మకం. ఏదో జరిగి సొమ్ము వస్తుందనే ఆశ.

నెలయినా అతీ గతీ లేదు.

అప్పులిచ్చిన వాళ్ళు, ఫీడు బాంకర్లు రైతుల మీద పడ్డారు. చేతికి అందినట్టే అంది... ఒకటా.. రెండా... బంగారంగా మలిచి దళారుల చేతిలో పెట్టి ఉస్సురనే జీవితాలయ్యాయి.

ఉబుసుపోక చేసింది కాదు. ప్రాణాన్ని ఫణంగా పెట్టి... కలలు కల్లలయ్యాయి.

అయినా బంగార్రాజు ధైర్యంగానే వున్నాడు.

కష్టాలు సమస్యలు ఎదురైనపుడు అధిగమించాలనే స్వభావం... మనిషికే తప్ప బాధలు ఎవరికొస్తాయనే వేదాంతం.

బామ్మర్ది వచ్చాడు. అవీ ఇవీ మాట్లాడాడు. బావ పరిస్థితి అర్థమైంది. హైదరాబాద్ వచ్చేయమని అడిగాడు. ద్రాక్షతోటల దగ్గర మకాం పెడితే రోజులెల్లిపోతాయన్నాడు. బంగార్రాజు బదులీయలేదు. కాంతిహీనమైన కళ్ళు దేన్నో చూస్తున్నాయి. పిరికితనం భరించలేదు. జీవితాన్నుంచి పారిపోవడంలో అర్థంలేదు.

గడ్డు సమయాల్లో మనసులోని వెతుకులాట ఒక పట్టాన బయటపడదు. తిరిగి ఆశలు మొలకెత్తినపుడే బరువు తగ్గుతుంది. ఒరిస్సా సరిహద్దులో చెరువులు చవకగా దొరుకుతాయనే ఆలోచన బంగార్రాజుని మనిషిని చేసింది.

అవును. ఓడిపోకూడదు. జీవన సమరంలో అలుపుకు చోటులేదు. తొడకొట్టుకుంటూ పోవాలి. చీకటిలో సైతం సరైన దారినే పట్టుకోవాలి. ఒరిస్సా వెళ్ళాలి. తప్పదు. ఒక వలస మరో మెరుపు కోసమే.

చేతులు ముడుచుకుంటే నేల బావురుమంటుంది. రొయ్యలు విలాసంగా మీసాలు మెలేస్తున్నాయి. సోయుగాలు పోతూ చిందులేస్తున్నాయి. పారేసుకున్న చోటే వెతుక్కోవాలి.

అవును

విధ్వంసాల్ని ఎదుర్కొంటూ జీవితాన్ని పునర్నిర్మించుకుంటూనే వుండాలి.

బంగార్రాజు నీలి వర్ణం తేజోవంతమైన కాంతులతో వెలుగులు చిమ్ముతుంది. ❖

## ఇనుప గజ్జల మాయావి

**మంచికంటి**

మాయ జలతారుల అభినివేశంలో
ఇనుప గజ్జ కట్టిన ఆలోచనల్లో
మబ్బులకు వానలుండవు
చేలల్లో పంటలుండవు
అడవుల నిండా చెట్లుండవు
హరితాలిక ఆకుపచ్చగా ఉండవు
మెదళ్ళకు ఆలోచనలుండవు
పెదాలపై కాసిన్ని చిర్నవ్వులైనా ఉండవు
బతుకు పేటెంటైన మనిషి బొందిలో
ప్రాణాలే నిలవవు.
ఏ వూరు పోయినా ఏ రూపు చూసినా
ముంగిళ్ళకు తోరణాల్లేవు
ద్వారాలకు తలుపుల్లేవు
గడపలకు పసుపు పూసిన జాడల్లేవు
ఏ ఆరుబయటా
వెన్నెల కురిసే నిశిరాత్రి ఆటల్లేవు
గొంతెత్తి పాడుకునే కమ్మని పాటల్లేవు
మధురాతి మధురమైన బాల్యానందాల్లేవు
బతికేందు కొక ఆకుపచ్చని జాగాలేదు
మైమరపు మసక కమ్మిన తెరల్నిండా
రచ్చబండ చర్చల్లేవు
రాత్రి ఊరేగింపుల్లేవు
ఇళ్ళు నిండా నిండిన మనుషులకు మాటల్లేవు
జాలి గొలిపే జీవితాలకు ఆదరణల్లేవు
ఊరినిండా పచ్చని అలంకరణల్లేవు
ఊపిరి పీల్చేందుకు తగినంత సమయం లేదు
అడ్డమూ ఆపూలేని
నాగుబాము పడగ నీడకి
అడవులేంది! కొండలేంది! లోయలేంది!
పంట భూములేంది ఇళ్ళల్లో పడక గదులేంది
కపాలాల్లో మెదళ్ళేంది ఖాళీ మనసులేంది
పొలాల్లో పంటలేంది
అమ్మే విత్తనమేంది పోయే ప్రాణమేంది
వాడూ ఎగరడం నేర్చినవాడు
ఆకాశానికి కూడా సరిహద్దులు గీసేయగలడు
గాలికి కూడా అడ్డమైన ఆంక్షలూ పెట్టగలడు
నీటిని కూడా నిలబెట్టి అమ్మగలడు
బతుకు చిత్రంపై
నాగలి దిగబడిపోతూ ఉంది
రాతి పూలకు ఏవో మరులు గొలిపే
మత్తు వాసన నద్దుకుంటూ పోతుంది
కనుల ముందే మాయమైకం కమ్ముతోంది
బ్రతకడమంటే పక్కా నటనగా మారిపోయింది.

## బంధం

**వెలపాటి రామరెడ్డి**



మొరేస్! మొరేస్!
డామ్ మొరేస్!
పుట్టితి విక్కడ
బతికితి వెక్కడొ!
ఎక్కడొ కాదు
అంతట అంతట!
గిట్టితి విక్కడ
ఎట్టిది బంధం!?

వలస వెళ్ళిన పిట్టలు వచ్చు మరల
 మోడువారిన చెట్టుపై గూడు కొరకు!
పశువులను తెగనమ్మినన్ వచ్చు మరల
 దొడ్డిలోనికి తుక్కైన గడ్డి కొరకు!
కొట్టి కొట్టి పంపిన వచ్చు కుక్క మరల
 పాత యింటి వాసనలను పట్టుకొనుచు!
బతక నేర్పనో, బతుకనో, వలసవెళ్ళి
 బతుకు నూలు తెగుట ముందు వచ్చు నరుడు!
సప్త సంద్రమ్ములను దాటి శవము వచ్చు
 పుడమి తల్లి పొత్తిళ్ళలో పొదుగుకొరకు!!

"పిట్టలార! వలస వెళ్ళి వెళ్ళియు మళ్ళి
 వచ్చితిరిట, చెట్టు చిచ్చు బడెను!
పశువులారా! అమ్మి పంపివేయగ మళ్ళి
 దొడ్డికేతెంతురా, గడ్డిలేదు!
కుక్కలారా! కొట్టి కొట్టి పంపగ మళ్ళి
 తిరిగి వత్తురె, తిన తిండి లేదు!
వృద్ధులార! వయసు వెళ్ళగనే మళ్ళి
 బాలలై యింటికి వత్తురటనె!
శవములారా! విదేశాలు కాదని మళ్ళి
 వత్తురా, మట్టి కల్వంగ నిచట!?"
"ఔను! వత్తుము! రక్త మాంసాదులెల్ల
ఇచటి నీరును, మట్టియే!!" – ఇదియెకాదె
జన్మభూమి బంధమ్ము! సంస్కారమిదియె!
స్వర్గమును మించు జననియు, జన్మభూమి!!

మొరేస్! మొరేస్!
డామ్ మొరేస్!!
సహజ మార్గమున
సాగిపోయి, మన
సంస్కారమ్మును
సంస్కృతి నెల్లెడ
చాటి చెప్పితివి!
సల్యూటిదిగో!!

(ముంబైలో జూలై 19, 1938న ఉదయించి, ముంబైలోనే జూన్ 2, 2004న అస్తమించిన అనధికార ప్రపంచ పౌర భాస్కరునికి నివాళి)

# 'లండన్‌కోటు'



ఎస్. రాజయ్య

మోదుగుపాలెం హైదరాబాద్‌కు సుమారు అరవై కిలోమీటర్ల దూరంలో ఉంది. పూర్తి గ్రామ వాతావరణం. హైదరాబాద్ నగర ఛాయలు అక్కడ కనిపించవు. పొలాలు, పాడిసంపద, వాటిని కాపాడేందుకు జీతగాళ్ళు పల్లెజనాలు, భూకామందులు, రైతులు, జీతగాళ్ళు తీసుకున్న అప్పులు తీర్చలేక భూకామంధుల పొలాల్లో కట్టుబానిసలుగా పని చేస్తున్నారు.

యాభై ఎకరాలకు ఆసామి బలరాం. అతడి జీతగాళ్ళు మల్లయ్య, బక్కయ్య. వాళ్ళ కుటుంబం మొత్తం బలరాం బురద పొలాల్లో, పశువుల కొట్టాల్లో, ఇంట్లో పని చేస్తారు. వాళ్ళకు ఉదయం కోడికూత, రాత్రికి నక్కల కూత పని ఎక్కడానికి, దిగడానికి సంకేతాలు.

బలరాం అల్లారు ముద్దుగా పెంచిన ఒక్కగానొక్క కూతురు పట్నంలో కాపురముంటున్నది. అల్లుడి సంపాదన అతడు తాగడానికే సరిపోదు. వాళ్ళ సంసారం కూలిపోకుండా డబ్బు సహాయం చేస్తుంటాడు.

బలరాం బర్లకొట్టం ముందు చింతగున్న క్రింద ఈత పీచుతో పగ్గాలు పేనుతూ మాటల్లో పడ్డారు. ఇద్దరు జీతగాళ్ళు.

“బలరాం దగ్గర చల్లగ పని చేసికోక అప్పునీనెత్తిన ఏసి, పట్నానికి పారిపోయె నీ కొడుకు సాయిగాడు” అన్నాడు బక్కయ్య.

“రాకేం జేస్తడురా, ఎన్నాళ్ళున్నా ఊరు పట్టా ఊతపట్టా అన్నట్లు పుట్టిన ఊరికి రాక పట్నంలేమిజేస్తడు”.

“ఇంతకు ఏమి జేస్తన్నడు?”

“ఇంకేమి పని దొరుకుతదిరా, రిచ్చా, ఆ రిచ్చా కిరాయికి దొరకనప్పుడు పాత బట్టల బేరం జేస్తడు”

“కూసుండి నడుములు పాయె, ఆ నులకమంచం మీద ఒరుగుదామురా” అంటూ ఇద్దరూ నులక మంచం మీద పడుకుని ముచ్చట్లు మొదలుపెట్టారు.

పట్నం బోతనన్న బలరాం అకస్మాత్తుగా వచ్చి మల్లయ్య, బక్కయ్య మాటలను కలగాపులగం చేశాడు. ఇద్దరూ నులకమంచం మీద నుండి లేచి వణకసాగారు.

“ఏందిరా శానా మాట్లాడుతూందరు. నీయవ్వ ముసలోళ్ళు గదాని సూసిసూడనట్టుగా ఉంటే నవాబుకు నజర్ లేదు, నాకు బెదురులేదని, పని పాతర బెట్టి మాంకాలమ్మ జాతర బోయినట్లు, మంచాల మీద పడుకుంటా్రా. నేను ఒక్కపూట ఎక్కడి కన్నా సస్తేసాలు, ఒక్క నా కొడుకు పనిచేసిసావడు”...... అనరాని, వినరాని మాటలు!

మళ్ళీ బలరాం కాండ్రించి ఉమ్మి “ఒక్కా! నిన్న వొడ్ల శిద్దయ్య దగ్గిర కొత్త నాగలి తీసుకుని, కమ్మరి బ్రహ్మయ్య దగ్గిర కర్రే యుంచుకు రమ్మటే యాడసచ్చినవురా? నాలుగు రకాలు సాలయి, ఇంకో అరక కట్టాలె. ఆళ్ళను బతిలాడి చేయించుకురారా, అంటే ఏతాళ్ళళ్ళ బడ్డవో” ధమధుమలాడుతూ అన్నాడు బలరాం.

ఇద్దరు నిలబడి ఆసామివైపు గుడ్లప్పగించి చూస్తున్నారు.

"ఏమయ్యిందిరా? నీ యబ్బ మాట్లాడరేందిబే!"

"నేనేడికి బోయిన బాంచను! గావొడ్ల శిద్దయ్య కూడా పట్నం వొచ్చిండట కదా, ఇగొస్తడు అగొస్తడు, అనిశిద్దయ్య పెండ్లాము గొడ్డు చాకిరి చేయించుకుని రాతిరినక్కల కూతల యాల్లకు, మేస్త్రి వొచ్చేటప్పటికి జాము అయితది. రేపు రాపోరాబక్కా అన్నది.

ఇంక బక్కను వదిలి మల్లయ్య మీద పడ్డాడు బలరాం. "మల్లిగా! చేతికెదిగిన కొడుకును పట్నంల ఎత్తుకతిన, ఏరుకతిన దంపిస్తివి. ఆడు ఉంటే ఇంకొంక అరకనడిచేది, నా అప్పు తీరేది." బలరాం కోపంతో అన్నాడు.

"అప్పు యాడకు బోతది నీకాలు మొక్కుతా. నా గొంతుల పానమున్న దాక గిట్లనే పాకులాడుత. ఆనక వాడు అప్పు కట్టకేంజేస్తడు." కంట్లో పేరుకున్న పుసుమ తీసుకుంటూ అన్నాడు మల్లయ్య.

బలరాం ఓ రోజు, తన కొట్టంలో పాలు పిండుతున్న మనిషిని ఆనవాలు పట్టలేకపోయాడు, కళ్ళు నలుపుకుని మరీ చూశాడు. ఊహు లాభంలేదు ఎవరా? అని దగ్గిరకెళ్ళి చూశాడు. మల్లయ్య కాదు– జీతగాడు మల్లిగాడు వెలిగిపోతున్నాడు.

పాలు పిండి పాలచెంబును చేతిలో పట్టుకుని, హుందాగా కనిపించాడు. మల్లయ్యను చూడగానే బలరాం మండిపోయాడు.

ఫుల్ హేండ్స్ నీలం స్వెట్టర్, గ్లాస్గోపంచె, తలకి కళావతి రుమాలు చుట్టుకుని, తనకంటే పదిరెట్లు ఆస్థి పరునిలెక్క కనబడ్డడు.

బలరాం ఒళ్ళు అసూయతో బుసలు కొట్టింది. నాలుక వ్యంగ్యంమాట లందుకుంది.

"దండాలు, దండాలు మల్లరెడ్డీ! నీకేం ఆపతి వొచ్చిందని నా బక్కదాని పాలు పిండుతున్నవు. రేపట్నుంచి నేనే ఒస్త మీ బల్లు కసవుదియ్య!

ఆ మాటలు విన్న మల్లయ్య ఒంట్లో ఒణుకు ప్రారంభమయ్యింది. "అమ్మో నీకాలు మొక్కుత. అంతమాటనకు నీ బాంచను. నా కొడుకు తెచ్చిండు. పట్నంల పాత బట్టల బ్యారం చేస్తున్నడు గదా? నాబొక్కలు నిలువునా రాలి పోయె. అక్కడికి నేను ఒద్దంటూనే ఉన్నాను. సాయిగాడు బలవంతపెట్టిండు.



బట్టలు పాతవనగానే బలరాం మనస్సు కాస్త చల్లబడ్డది. తాను కొత్త బట్టలు కుట్టించుకున్నప్పుడు కూడా ఇంత నిగనిగలాడవు. పాత బట్టలైనా చాలా బాగున్నవి.

"బేరం చేస్తున్నడా, జేబులు కొడుతున్నడా పట్నంల. పట్టుబడితే ఏ ముసురబాదకో, చెంచలగూడానికో బోతడు. ఆనక నా కాళ్ళు పట్టుకుంటవు ఇడిపించమని, ఇడిసి పారెయ్యి రామల్లిగా", అన్నాడు బలరాం జీతగాడు మంచి బట్టలేసుకున్నందుకు ఓర్వలేక.

"హన్నా, నా సాయిగాడు అసుమంటోడుగాడు గులాపోణ్ణి మన ఊర్ల లేదుగాని, తూర్పు ఊర్లల్ల తెల్లోళ్ళు గరీబోల్లకు ఈయమని మతపోల్లకు పాతబట్టలు పంపుతున్నరట. ఆటిని పొట్టకు గతిలేని నాయసుమంటోళ్ళు అమ్ముతున్నరట. ఆటిని పదికో, పాతికకోకొని, సాయిగాడు ఆని దోస్తుగానితో కల్సిబేరం చేస్తున్నడట. ఆడు పంపకపోతే నాకెక్కడియి బాంచను! తను వేసికున్న బట్టలకు సంజాయిషి చెప్పుకున్నాడు మల్లయ్య.

బలరాం కళ్ళు ఆశగా మెరిశాయి.

"అరేమల్లిగా! కొడుకు యాపారస్తుడయిపోయె. ఆడు పుట్టక ముందరి అప్పాయె. సాయిగాన్నయినా అప్పు కట్టమనురా!" ఆ కళ్ళలో డబ్బు వస్తుందనే ఆశ, వస్తే మంచి విశ్వాసంగల కుక్కలాంటి పాలేరు చేజారిపోతాడనే నిరాశ ద్యోతకమవుతున్నాయి.

"ఇంకా ఏడనీ బాంచను! ఆడు ఏడంగా కన్నుదెరిసె ఏనుగెల్లలేతోక చిక్కలే, గొర్రెతోక ఏనాడైనా బారెడవుతుందా?" అన్నాడు వినయంగా.

"అందుకే అన్నార్రా, మీ మాటలు నీళ్ళ మూటలని థూ, నీయవ్వ, నియ్యతెంతో బర్కతంత. ఒకణ్ణి ముంచితే పుట్టగతులుండయి. ఏనాటికైనా నా రుణాంల బతికేముండా కొడుకులే మీరు" అంటూ కాండ్రించి ఉమ్ముకుంటూ వెళ్ళిపోయాడు బలరాం.

✤ ✤ ✤

శీతాకాలమొచ్చింది. సాయిగాడు తండ్రికి తెచ్చిన బట్టలు ఒంటి మీదకు, బంతి మీదకు ఒకటే కావడంతో, ఎండకు ఎండి వానకు నాని పీలికలైపోయినవి. శీతాకాలపు చలి మల్లయ్య ఒంటిని కొరుక్కుతింటున్నది. అయినా పట్నం నుండి సాయిగాడు రాలేదు. ఇంత చింకిగుడ్డైనా పంపలేదు.

మల్లయ్య చలికి గడగడలాడుతూ ఓ వేకువ జామున పాలు పితుకుతున్నాడు. చలికి ఆగలేక, చలిమంటేసుకుని కాసేపు ఒంటిని కాపుకోవాలనుకున్నాడు. కాని పాలు పితకాల్సిన గేదెలు చాలా ఉండటంతో వణుకుతూ పూర్తి చేస్తున్నాడు.

సూర్యోదయానికి ముందు, కొత్తదిలా ఉన్న ఊదారంగు చిన్నకోటులో తన భారీ శరీరాన్ని ఇముడ్చుకోలేక బలరాం పశువుల కొట్టానికొచ్చాడు. చలికి బాధపడుతూ పాలుపితుకుతున్న మల్లయ్య దగ్గిరకొచ్చి, జాలిగాచూస్తూ, తను వేసుకున్న కోటు నొకసారి హుందాగా చూసుకున్నాడు. దృఢ నిశ్చయానికి వచ్చి, మల్లా! అన్నాడు పొట్టి కోటులో బలవంతంగా తన శరీరాన్ని దూర్చి చలి నుండి తప్పించుకోవాలని సతమతమవుతున్న ఆసామిని చూసిన మల్లయ్యకు నవ్వాగిందికాదు. గిరుక్కున తలపొదుగు వైపు తిప్పుకుని ముసిముసిగా నవ్వుకున్నాడు మల్లయ్య.

"మాల్లా! నాకీ కోటు చిన్నగైంది గాదుర!!"

ఏంచెప్పాలో అర్థంగాక, "అవున్నీ బాంచను! కాని కోటు మాతరం ముత్తెములెక్కున్నది" అన్నాడు వారగా జూస్తూ.

"ఇది మా అల్లుని దోస్తు, లండన్ నుండి తెచ్చిండురా"

ఆ దేశం ఉన్ని చాలా బాగుంటదంటే తెప్పియ్యమన్న. అబ్బా, యమగర్మి ఇస్తున్నది. కాని సైజు సరిపోలేదురా, అక్కడ ఇది నన్నూరు పై చిలుకు ఉంటదట. నువ్వు కూడసలికి ఒణికి పోతున్నావ్. నీకు సరిగ్గా సరిపోతది. వందకిస్త తీస్కోర" అన్నాడు.

మల్లయ్య ఆసామి వైపు భయంగా చూసి "అయ్యా ఒద్దు నీకాల్మొకుత. ఉన్న అప్పే నా కంఠమ్మీద కత్తిలెక్కున్నది. పర్వతమెక్కాలెందుకు? పండ్లిరగ్గొట్టుకోవాలెందుకు? గొంగడి ఉన్నంత కాళ్ళు సాపుకుంట" అన్నాడు భయంగా.

"నీయవ్వ అప్పంటే భయపడత వేందిరా? దేనికయినా గుండె ఉండాల్రా. ఇప్పుడే ఇట్లయితే, రేపు కొడుకు పెండ్లికి నా దగ్గిరకు రాకుండ చేస్తవా? సావులకు బతుకులకు, జరాలకు, నొప్పులకు, ఒక్కటేంది మేములేంది మీకు బతుకులేదాయె. అప్పును మనం తీరుస్తమా, అప్పు మనల్నితీరుస్తుందా? తొంభై రాస్త నీ పేరు మీద. నీవు సచ్చినా బతికినా

⟶

# శ్రమసౌందర్యకేతనం

కాత్యాయనీ విద్మహే



సాహసాల సింహద్వారం సిక్కిం
సత్యం శివం సుందరం సిక్కిం
గుండెలు కలిపేందుకు
కొండలు పగలేసిన
విశ్వమానవ సౌభ్రాత్ర గాత్రం సిక్కిం
ప్రధాన జన జీవన స్రవంతికి
మారుమూల మానవ జీవన సంస్కృతీ
సౌరభాలనద్దిన శీతల పవన స్వర ప్రస్థారం సిక్కిం
అనంత ప్రకృతి విలాస లాస్యానికి
చేరువగా జన సమూహాన్ని చేరేసే
రహదారులు నిర్మించిన జన సాహస గానం సిక్కిం

మనం ఒకానొక సాహసోత్తేజాన్ని
పూరించుకొంటూ
మైదానాల నుండి అక్కడికి
ప్రయాణిస్తామా ప్రవహిస్తామా
సాహసమక్కడ సామాన్యుడి జీవనహేలయి
సాక్షాత్కరిస్తుంది

పెట్టెలు, బెడ్డింగుల దగ్గర నుండి
సోఫాలు కుర్చీల వరకు
ఎంతెంత బరువులనయినా
ఉట్టి కట్టి తలకు తాటించి
వీపున మోస్తూ
ఎత్తులకు నడిచే మనుషుల
బతుకు తెరువు సాహసం
ఉదయించడానికి
సూర్యుడే భయపడే
హిమశీతల సానువులపై
వెచ్చదనాలను పంచే
'మోమో'లతో, 'తేనీరు'తో
పొద్దుపొడుపులయి వచ్చే
స్త్రీల జీవన ఆరాటం

కొండ చరియల అంచులపై
పొంచి వున్న ప్రమాదాలను
సవాల్ చేస్తూ
చలికి పగిలి
ఎర్రబారిన బుగ్గల
లేతనీలికన్నుల
పసిపాపలను
వీపున మోస్తూ
రోడ్డు పనికి దిగే
స్త్రీల జీవన పోరాటం

ఏ జలపాతాల మృదంగధ్వని సౌందర్యాన్ని
ఆలకిస్తూ మనం కలల్లో తేలిపోతుంటామో
ఆ జలపాతాల వడికి
ఒరవడికి
కోతబడ్డ భూమితల్లి
గుండె అంచులను సవరించేందుకు
లోయల్లోకి జారి
ప్రాణదీపం ఆరిపోకుండా కాపాడే
రెండు చేతులై సాగే
మానవులు
మహోన్నతులు
శ్రమైక జీవన సౌందర్యగానమై
మనల్ని
నిలబెడతారు
నిలదీస్తారు
నడిపిస్తారు

అనాది రహస్యాలను చెవులో వూది
ఆదిమ సంబంధాలకు దేహాన్ని శృతి చేసి
రెక్కలు విప్పుకొన్న మనసును మట్టి మనుషుల
బంధంతో పవిత్రీకరించి
కంచన్‌జంగా పై జండాగా ఎగరేసిన సిక్కిం
సత్యం శివం సుందరం సిక్కిం
**(2004 వేసవిలో సిక్కిం యాత్రా సందర్భం)**

---

పిల్ల, పిల్లతరం యాది జేసికుంటది. ఉ పట్టు, యేస్కోవోయ్! అంటూ కోటు విప్పి మల్లయ్య ముఖం మ్మీద పారేశాడు బలరాం.

వొద్దు. నీకాల్మొక్కుత. రేపియాల సాయిగాడు రావాలె ఎట్లగన్నా బట్టలైస్తడు. అంటూ కోటు అందుకుని రెండు చేతుల్తో గుండె కదిమిపట్టుకున్నాడు మల్లయ్య. మల్లయ్య అంటున్న మాటలు వినకుండా గబగబా లోపలికి వెళ్ళిపోయాడు బలరాం.

మరుసటి రోజుసాయంత్రం వచ్చిన సాయిగాడు తండ్రిని చూపి విస్తుపోయాడు.

"అయ్యా ఈ కోటెవరిచ్చింర్రే!" "వొద్దంటే బుల్లెయ్యా సామి తొంభై రూపాయలకు తగలగట్టిండురా". "ఈ కోటు ఆయనకెక్కడిదట" సాయిగాడి ప్రశ్న.

బలరాం అల్లునిపోపతోడు తెల్లోల్ల దేశం నుండి తెచ్చిండట. సాయిగాడు గబగబా తండ్రి వేసుకున్న కోటులోపలి జేబువెతికి ఓ రసీదు తీశాడు. కన్నార్పకుండా చూస్తున్న తండ్రిని చూసి పగలబడి నవ్వాడు. అయ్యా ఈ కోటు 'కోఠి'లనే నమ్మిండే. ఓ సైకిలు మోటర్రాయన, ఆనాడు నేను వేసికున్న కోటును జూసి, చాలా బాగుంది, అమ్ముతావా? అన్నాడు. ఆ రోజు బేరం లేకుండేది. కోటు ఇడిసి ఆయనకు అమ్మేసిన. అది అమ్మినంక యాదికొచ్చింది. దాంట్లనేను పాంటు, షర్టు కుట్టించుకున్న టిప్, టాప్ టైలర్ రసీదున్నదని, రశీదు లేకపోతే టైలర్ బట్టలియ్యడు. బలరాం కడుపు బంగారంగాను. పాతకోటును లండన్ కోటని నీకు అమ్మి పుణ్యం కట్టుకున్నాడు" సంతోషంగా అన్నాడు సాయిగాడు కోటును ముద్దు పెట్టుకుంటూ మల్లయ్య కండ్లు మిలామిలా మెరిశాయి. కొడుకు సంతోషాన్ని జూసి.



సమీక్షార్థం వచ్చిన పుస్తకాలు చాలా మిలిగిపోతున్నాయి.
అందుకే ముందుగా స్వీకారంలో ఇస్తున్నాం. వీలు వెంట వీటిపై సమీక్షలు వస్తాయి.




మట్టివాసనలు
**పంజాల జగన్నాథం**
వెల :రు.60
పంజాల పబ్లికేషన్స్




**24 ఫ్రేమ్స్**
**వారాల ఆనంద్**
వెల :రు.60
ఫిలిం ఫౌండేషన్




రెప్పల చప్పుడు (నానీలు)
**సోమేపల్లి వెంకట సుబ్బయ్య**
వెల :రు.25



మౌనమూ మాట్లాడుతుంది
**ఎస్. అరుణ**
వెల :రు.50
జిష్ణు ప్రచురణలు




పాలమూరు గోస
**కరువు వ్యతిరేక**
**పోరాట కమిటీ**
వెల :రు.60




నెలపొడు[illegible]
**బి.వి.ఎన్.స్వామి**
వెల :రు.50
కౌశిక్ ప్రచురణలు




టీపాయింట్(సంభాషణలు)
**పులుగు శ్రీనివాస్**
వెల :రు.40
చేతన పబ్లికేషన్స్



తిలక్ 'అమృతం కురిసిన రాత్రి'
ఒక పునర్మూల్యాంకనం
**అద్దేపల్లి రామమోహనరావు**
వెల :రు.10




సుజరె
**జ్ఞానదీపిక**
వెల :రు.35
భూప్రజా సాహితీ నిలయం




**17 సెప్టెంబర్ 1948**
**కర్ర ఎల్లారెడ్డి**
వెల :రు.36
తెలంగాణా సాహితి




వీరగల్లు
**బండి నారాయణ స్వామి**
వెల :రు.50
భగవాన్ ప్రచురణలు:-1



నగరంలో నగ్నసతాలు (కవితలు)
**కె. హరనాథ్**
వెల :రు.30
హైదరాబాద్ పాతనగర రచయితల సంఘం




శివసాగర్ కవిత్వం
**(1968-2004)**
వెల :రు.100
స్వేచ్ఛ ప్రచురణలు



**బడికతలు** (కథా సంకలనం)
వెల :రు.25
స్నేహ కళాసాహితి



రెప్పవేయని కన్ను (కథలు)
**నందిగం కృష్ణారావు**
వెల :రు.100
ప్రోజ్-పొయిట్రీ ఫోరమ్




నిషిద్ధాక్షరి (కథలు)
**మందరపు హైమవతి**
వెల :రు.50



పక్షి (కథలు)
**వి. ప్రతిమ**
వెల :రు.50




జింబో కథలు
వెల :రు.100
ప్రోజ్-పొయిట్రీ ఫోరమ్



నాగటి చాళ్ళు (కవిత)
**దర్భశయనం శ్రీ[illegible]వాసాచార్య**
వెల :రు.[illegible]



పొగబండి నేస్తం (కథలు)
**ఎ. జయలక్ష్మిరాజు**
వెల :రు.35

# స్వీకారం

సమీక్షలు చేయాలనే ఆసక్తి వున్న వారు తమ అభిరుచి, అడ్రసు తెలియచేస్తే సమీక్షార్థం పుస్తకాలు పంపే అవకాశముంటుంది.
వీటిని ఇప్పటికే చదివి అభిప్రాయం ఏర్పర్చుకున్న వారు రాసి పంపొచ్చు.




దాఖలా
వర్షుల శివకుమార్
వెల :రు. 50
పొయెట్రీ ఫోరమ్




పాలమూరు కవిత
సం. భీంపల్లి శ్రీకాంత్
వెల :రు. 100
పాలమూరు సాహితి




జాడ
నూటెంకి రవీంద్ర
వెల :రు. 25
జీవనది ప్రచురణలు




ప్రభంజన పథం
యాదనాల ప్రభంజన్ కుమార్ యాదవ్
వెల :రు. 60
మైత్రేయ ప్రచురణలు



తేనెటీగలు
బి.ఎస్. రాములు
కథలు
వెల :రు. 150




ముద్రబల్ల (దీర్ఘకవిత)
దాట్ల దేవదానం రాజు
వెల :రు. 20
శిరీష ప్రచురణలు




ఈ పొద్దుటి పూట పాట
కవితా సంపుటి
ఒబ్బిని
వెల :రు. 50



గడ్డిపూలు (హైకూలు)
తుమ్మల దేవరావ్
వెల :రు. 45
మానస సాహితీ ప్రచురణలు



కొల్బులోల్లం (కవితా సంపుటి)
మోతుకూరి అశోక్‌కుమార్
వెల :రు. 20
విశ్వసాహితి



జలస్వప్నం
మల్లెల
వెల :రు. 50
శృతి ప్రచురణలు




సాయిబు (ఇస్లాంవాద దీర్ఘకవిత)
షేక్ కరీముల్లా
వెల :రు. 25
మదర్ షంషూన్ ప్రచురణలు




దళిత తాత్త్వికుడు
డాక్టర్ దార్ల వెంకటేశ్వరరావు
వెల :రు. 10
తెలుగు సాహిత్య వేదిక



రిస్కుగదరా శీనూ!! (శీను సత్యాలు)
అయితా శ్రీనివాస్
వెల :రు. 10
ఆక్టోపస్ ప్రచురణలు



నాయదుబావ పాటలు
సొదనాల వెంకటస్వామినాయుడు
వెల :రు. 25
హిమకర్ పబ్లికేషన్స్



ప్రజాసాహితీ, సాంస్కృతికోద్యమం కమ్యూనిస్టులు
ప్రకాశరావు
వెల :రు. 15
జనశక్తి ప్రచురణలు




వాన మబ్బుల కాంతి ఖడ్గం
డా. యల్.యస్.ఆర్. ప్రసాద్
వెల :రు 50
ప్రశాంతి పబ్లికేషన్స్




నలుగుతున్న గేయాలు
వయ్యా సామేలు
వెల :రు. 25
ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ [illegible] సంఘం



గూడూరి సీతారాం కథలు
సం. డా. పత్తిపాక మోహన్
వెల :రు. 50
మానేరు రచయితల సంఘం




మనోగతం
(కవితా సంపుటి)
డా॥ దాకే అశోక్‌కుమార్
వెల :రు. 20



కరీంనగర్ జిల్లా కథలు
బి.ఎస్. రాములు-వనమాల చంద్రశేఖర్
వెల :రు. 75
విశాల సాహిత్య అకాడమి

# స్వీకారం

కేవలం వ్యక్తిగత ప్రశంసలు సమీక్షలుగా ప్రచురించలేము.
విమర్శనాత్మకంగా, సమతుల్యంగా వుండటం అవసరం. సంక్షిప్తత కూడా చాలా ముఖ్యం.

| | | | | |
|---|---|---|---|---|
| మరో ఆకాశం (ఇంగ్లండు కవితలు)<br>ఎన్. గోపి<br>వెల :రు. 50<br>జిష్ణు ప్రచురణలు | వలస బతుకులు (కథలు)<br>పెద్దింటి అశోక్ కుమార్<br>వెల :రు. 30<br>విశాల సాహిత్య అకాడమి | హంద్రీ కథలు<br>(కర్నూలుజిల్లారచయితలకథలసంకలనం)<br>వెల :రు. 25<br>సాహితీ మిత్రులు | చలివేంద్రం (కథల సంపుటి)<br>జాతశ్రీ<br>వెల :రు. 75<br>సృజనాలయ ప్రచురణలు | గ్రౌండ్ జీరో (దీర్ఘకవిత)<br>దిలావర్<br>వెల :రు. 30<br>సమతా ప్రచురణలు |
| పాలు (ఇతర కథలు)<br>బి.ఎస్. రాములు<br>వెల :రు. 50 | తెలుగు సినిమా<br>స్వర్ణయుగం<br>డా. ఎం.వి. రమణారెడ్డి<br>వెల :రు. 100 | చేనేత (కవితా సంకలనం)<br>సం. పున్న అంజయ్య<br>వెల :రు. 30<br>సాహితీ మేఖల ప్రచురణలు | రెక్కలతలుపుల గోస (కవిత్వం)<br>చింతాఅప్పలనాయుడుసిరికిస్వామినాయుడు<br>వెల :రు. 30<br>స్నేహ కళాసాహితి | భవాని నానీలు<br>డా॥ చిల్లర భవానీదేవి<br>వెల :రు. 30<br>హిమబిందు పబ్లికేషన్స్ |
| కచ్చురం (కద్లబండి)<br>తుమ్మల దేవరావ్<br>వెల :రు. 50<br>మానస సాహితీ ప్రచురణలు | జ్ఞాపకాల కొండ<br>2004 నుంచి 1960 -కొన్ని కొత్తపాత కవితలు<br>నిఖిలేశ్వర్<br>వెల :రు. 45 | అమ్మలపాది (కవితా సంపుటి)<br>చింతా లక్ష్మీసుజాత<br>వెల :రు. 25<br>మనీష సంస్థ | మెతుకు<br>కాట్రగడ్డ దయానంద్<br>వెల :రు. 40<br>గుళ్ళకమ్మ ప్రచురణలు | ఇంగ్లండులో ఇరవైఐదు రోజులు<br>ఎన్. గోపి<br>వెల :రు. 60<br>జిష్ణు ప్రచురణలు |
| జలగండం<br>కవిత<br>వై. శ్రీరాములు<br>వెల :రు. 30 | ప్రజాసాహితి<br>సాహిత్యసాంస్కృతిక [illegible] మాస పత్రిక<br>వెల :రు. 25<br>సం. కొత్తపల్లి రవిబాబు | నదీరోదన (కవితా-సంపుటి)<br>కె. ప్రభాకర్<br>వెల :రు. 60<br>రవి పబ్లికేషింగ్ హౌస్ | మెరుపు మెరిస్తే...<br>ఆచార్య రావికంటి వసునందన్<br>వెల :రు. 80<br>జగదాంబ ప్రచురణలు | మనస్సు<br>ఆచార్య రావికంటి వసునందన్<br>వెల :రు. 80<br>సాహితీ మేఖల ప్రచురణ |

# సత్వర న్యాయం




**చూ**డు... ఇప్పుడు లక్షిస్తా... మిగతా లక్ష వచ్చే సంవత్సరమిస్తా... వడ్డీగిడ్డీ నా చాతగాదు. ఇష్టమైతే తీస్కో... లేదంటేల్యా" ఇక మాట్లాడేదేమీ లేదన్నట్లుగా జనార్ధన్నాయుడు తేల్చి పారేశాడు. ఆ మాటలకు కిషోర్ శరీరం సన్నగా వణికింది. కోపం కట్టలు తెంచుకోసాగింది.

డా॥ ఎం. హరికిషన్

"వడ్డీ వదిలెయ్యడానికి ఇక్కడ డబ్బులు మాకేం వూకెరాలా. నెలాగాదూ రెన్నెళ్ళూ గాదు... రెండు సంవత్సరాలు దాటిపాయ... ఒక్క పైసా కూడా కట్టలా. రేపు మాపు మొత్తం ఇచ్చేస్తానంటూ తిప్పితివి. అవతల మా బామ్మర్ది దగ్గర వడ్డీకి అప్పు తెచ్చుకున్నా. మర్యాదగా అసలూ వడ్డీ ఇచ్చేయ్. లేకుంటే బాగుండదు" అన్నాడు.

జనార్ధన్నాయుడు సోఫాలో వెనక్కి వాలి కూర్చుంటూ నిర్లక్ష్యంగా "చూడు... నువ్ మాటిమాటికి డబ్బుల్డబ్బులంటూ మా యింటి చుట్టూ తిరగడం ఏం బాలేదు. వుంటే అడగాల్నా. ఇసిరి పాడేస్తుంటి. అసలే యాపారం దెబ్బతిని నేనేడుస్తుంటే మధ్యలో రోజూ నీ సోదొకటి... నువ్వేం చేస్కుంటావో చేస్కో నే చెప్పేది చెప్పా... అంతే..." అన్నాడు.

కిషోర్ కోపంగా పైకిలేచి "ఇక్కడెవరైనా చెవిలో పూలు పెట్టుకోనున్నారనుకుంటున్నావా... యాపారాలు బాలేకపోతే రెన్నెళ్ళ కిందట కొత్తపేట్లో ఆరు లక్షలుపెట్టి ఇంట్లెట్లా కొన్నావ్. నెలనెలా వడ్డీ ఇంటికి తెచ్చిస్తానని కాళ్ళా వేళ్ళా బడ్తే... మంచోనివని నమ్మి దాచుకున్న డబ్బంతా నీ చేతుల్లో పోస్తి. ఇప్పుడేమో నీ ఇష్టమొచ్చినట్టు మాట్లాడుతున్నావ్. మనిషి పుట్టుక పుట్నాక కాస్తన్నా సిగ్గూశరమూ వుండాల" రొప్పుతూ గట్టిగా అర్చాడు.

జనార్ధన్నాయుడు ఒక్కదుటున సోఫామీద నుండి పైకిలేచి "ఏందివై... ఎక్కువ తక్కువ మాట్లాడ్తున్నావ్. అవ్ కొన్నా. ఐతే ఏంటంట. ఇదిగో... అసలు ఒక్క పైసా కూడా కట్టను. నీ దిక్కున్న చోట చెప్పుకోపో. ఇంగోసారి ఈ యింటి గడప తొక్కినావనుకో మెడ పట్టుకోని దొబ్బుతా... ఏమనుకుంటున్నావో" అంగీ మడుస్తూ బెదిరించాడు.

ఆ మాటలకు కిషోర్ "దారా... దొబ్బుదురా... కొడకా... నా డబ్బులు నూకేసిందిగాక మళ్ళా నన్నే దొబ్బుతానంటావా. ఈడేం అంత చాతగానోళ్ళున్నారనుకుంటున్నావా" అంటూ ఒక్కదుటున లేచి జనార్ధన్నాయుని అంగీ పట్టుకున్నాడు.

జనార్ధన్నాయుడు ఒక్కసారిగా చేతుల్ని విదిల్చి బలాన్నంతా ప్రయోగించి కిషోర్‌ని విసురుగా ఒక్కదొబ్బు దొబ్బాడు. పీలగా వున్న కిషోర్ దభీమని వెనక్కి పడిపోయాడు. అంతలో జనార్ధన్నాయుని కొడుకులు ఇంట్లోంచి బైటకొచ్చి లేవబోతున్న కిషోర్ రెండు రెక్కలు పట్టుకొని విసురుగా పైకిలేపి ఇంటిబైటకు దొబ్బి తలుపులేశారు. కిషోర్ ఆవేశంతో, అవమానంతో రగిలిపోయాడు. ఇంటిబైటే నిలబడి నోటికొచ్చిన తిట్లన్నీ చుట్టుపక్కలోళ్ళందర్కీ వినబడేటట్లు గట్టిగా తిట్టసాగాడు. వాళ్ళంతా ఇది చాలా మామూలు వ్యవహారమే

అన్నట్లు పట్టిచ్చుకోలేదు. కాసేపటికి కిషోర్ ఆవేశం కాస్త తగ్గింది. అక్కడ వుండి లాభం లేదనుకోని నెమ్మదిగా నీరసంగా అడుగులు వేస్తూ ఇంటివైపుకి బైలుదేరాడు.

కిషోర్ మనసు ఆవేశంతో రగిలిపోతావుంది. బాధతో దుఃఖం దన్నుకోని రాసాగింది. పిడికిళ్ళు మాటిమాటికి బిగుసుకుంటున్నాయ్. పెదాలు వణుకుతా వున్నాయ్. పదేపదే జనార్ధన్నాయుని రూపం మనసులో మెదలసాగింది. ఆలోచనలు సుళ్ళు తిరగసాగాయ్.

పదివేలూగాదు... ఇరవై వేలూ గాదు... రెండు లక్షలు... ఎన్ని సంవత్సరాలుగా కోరికలను చంపుకొని దాచిన డబ్బు. చిన్నోడెన్నిసార్లు "నాన్నా ఓ సైకిల్ కొనివ్వు" అనడిగినా కొనియ్లా. ఎండాకాలం ఫ్రిజ్ కొనమని భార్యాపిల్లలు ఎంత పోరుపెట్టినా పట్టిచ్చుకోలా. సొంత ఇంటి కోసం... పైసా పైసా దాచి... తినీ తినక కూడా బెడ్తే... 'వడ్డీగిడ్డీ జాన్తానై' ఎంత తేలిగ్గా అనేశాడు.

అసలిలాంటోన్ని నమ్మడం నాదే తప్పు. చెప్పుచ్చుకోని కొట్టుకోవాల. ఆడికీ అందరూ చెప్తానే వున్నారు. కాలాలసలే బాగాలేవు. బ్యాంక్లో వేసుకో అని. ఏమిస్తారు బ్యాంక్లో... ఈడ్చికొడ్తే 75 పైసల్రాదు. రోజురోజుకీ వడ్డీ తగ్గిపోతోంది.

నేనేమైనా ఐదుకిస్తినా... పదికిస్తినా.. అఫ్ట్రాల్ రెండ్రూపాయలు. ధర్మవడ్డీ. ఈ రోజుల్లో రెండ్రూపాయలకయ్యాడా ఎవడిస్తున్నాడు. అదీ ఎంటపడ్తేనే గదా ఇచ్చింది. తీసుకునేటప్పుడు అనా... అకా... అంటూ... ఇంటి చుట్టూ తిరుగుతూ... ఎన్ని మాటలు... ఎంత వినయం.. నమ్మి ఇస్తే ఆర్నెల్లంటే ఆర్నెల్లు కూడా వడ్డీ కట్టలా. ఆఖరికి అంగీ పట్టుకోని... ఛఛ... పిల్చి తన్నిచ్చుకోవడమంటే ఇదేనేమో... అసలిలాంటి నా కొడుకుల్ని నడిరోడ్డు మీద కాల్చిపాడేసినా తప్పులేదు.



ఇంటి చుట్టుపక్కల ఒక్కడన్నా బైటకొచ్చి ఇదన్యాయమంటాడా... ఎవరి సంగతి వాళ్ళదే. ఇంకో మూన్నెళ్ళు దాటితే... బాండు టైం కూడా పూర్తయిపోతాది. నాలుక గీసుకోడానిక్యూడా పనికిరాదప్పుడు. లాభంలేదు. ఏదో ఒకటి చేయాల... తొందరపడాల... అవతల బామ్మర్దికి వడ్డీ కట్టక అప్పు పెరుగుతా వుంది.

"నీ దిక్కున్న చోట చెప్పుకో" ఎంత ధైర్యం వానికి. నేనేమీ చేయలేననే కదా వాని నమ్మకం. కానీ కోర్టులు.. చట్టాలు... నాలాంటోళ్ళ కోసమే గదా వుండేది. ఎట్లా తప్పిచ్చుకోని పోతాడు. లాయర్ నోటీసిప్పిస్తే తెలుస్తాది ఈ కిషోర్ అంటే ఏమిటో. కోర్టుకి లాగి బోన్లో నిలబెడ్తే అప్పుడు... అప్పుడు... బుద్దొస్తాది నా కొడుక్కి

కిషోర్ కాళ్ళు అప్రయత్నంగా చిన్ననాటి స్నేహితుడు శ్యాం ఇంటివైపు తిరిగాయి. ఆలోచనల్లోనే ఐశ్వర్యా అపార్టుమెంటొచ్చింది. రెండంతస్థులు నెమ్మదిగా ఎక్కి రూం నెంబరు 104కి చేరుకున్నాడు. 'శ్యాం' అడ్వకేట్ అనే బోర్డు కనబడతా వుంది. కాలింగ్ బెల్ నొక్కాడు. ఓ నిమిషానికి తలుపు తెరుచుకొనింది. కిషోర్ని చూస్తానే "ఏరా... చాన్రోజుల కొచ్చావ్... ఇన్నాళ్ళకు గుర్తుకొచ్చామా... దా... దా..." అంటూ లోపలికి ఆహ్వానించాడు.

కిషోర్ సోఫాలో కూలబడ్డాడు. కాసేపటికి టీ వచ్చింది. తాగుతూ జరిగిందంతా పూసగుచ్చినట్టు వివరించాడు.

శ్యాం ఓ ఐదు నిమిషాలు ఆలోచించి అన్నాడు.

"సరే... లాయర్ నోటీసిద్దాం. కానీ వాడిస్తాడనే నమ్మకమైతే నాకు లేదు. కోర్టంటే తెల్సుగదా... ఎంత చెత్త లాయరైనా దీన్ని సులభంగా మూడు నాలుగు సంవత్సరాలు లాగగలుగుతాడు. లూప్ హోల్స్ లెక్కలేనన్ని వుంటాయి. కింది కోర్టులో గెలుస్తే పై కోర్టుకి... పై కోర్టులో గెలుస్తే సుప్రీంకోర్టుకి... కేసు సాగుతూనే వుంటుంది. నేనో సలహా యిస్తా. ఆలోచించు. ఫ్యాక్షన్ లీడర్ గంగాధర్ రెడ్డి తెల్సుగదా. అదే మన ఎమ్మెల్యే తమ్ముడు. ఆయన దగ్గరకు వెళ్దాం. కేసు నిమిషాల్మీద తెగుతాది. కోర్టులుండవ్. తిరుగుళ్ళుండవ్. ఏమంటావ్."

ఆ మాటలకు కిషోర్ ఆలోచనలో పడ్డాడు. వాళ్ళ దగ్గరకు పోవాలంటే భయమేసింది. నసుగుతూ "కోర్టులోనే వేద్దాంలే... ఓడిపోయేదేం లేదు గదా" అన్నాడు.

శ్యాం చిరునవ్వు నవ్వి "ఇటువంటి కేసు ఓడిపోవడమంటూ ఎప్పుడూ జరగదు. ఖచ్చితంగా గెలుస్తాం. కానీ అవతలోడు ఉద్యోగి కాదు. వ్యాపారి. ఏ క్షణంలోనైనా బోర్డు తిప్పేసి ఐ.పి. పెట్టొచ్చు. ఎవరమూ ఏమీ చేయలేం. ఈ లా వుందే ఇది గాడిదలాంటిది. అంతవరకూ మన పక్కనున్న చట్టం నిమిషాల్మీద వాని పక్కకు తిరుగుతాది. ఓ సంవత్సరం తర్వాత వాడు మళ్ళా దర్జాగా మన ముందే బండ్ల మీద తిరుగుతుంటాడు. మనం దద్దమ్మల్లా బికారులమై నోరెళ్ళబెట్టుకోని చూస్తుంటాం. కసితో రగిలిపోతుంటాం. కానీ ఏమీ చేయలేం" అన్నాడు.

కిషోర్కి ఆ మాటల్తో ఒళ్ళంతా చల్లబడింది. జనార్ధన్నాయుడు ఐ.పి. పెడ్తే అనే ఊహొచ్చి వణికిపోయాడు. అంతలో శ్యాం మరలా కొనసాగించాడు.

"సుబ్రమణ్యమని పారుమంచాల్లో మా బంధువొకాయనున్నాడ్లే. సుంకన్న అనేటోనికి అప్పిచ్చాడు. వాడు తిప్పుకోని తిప్పుకొని ఆఖరికి బోర్డు తిప్పేసి ఐ.పి. పెట్నాడు. ఏం చేస్తాడు పాపం. నోర్మూసుకున్నాడు. కానీ సంవత్సరానికే వాడు కొడుకు పేర్మీద రెండు చొప్పుకటింగ్ మిషన్లు కొనుక్కొచ్చి యాపారం మొదలుపెట్నాడు. తీసుకున్న అప్పు తీర్చమంటే నా దగ్గరేం లేదన్నాడు. గొడవ జరిగితే వాని మీదే క్రిమినల్ కేసు పెట్టాడు. వాడు ఏడుపు ముఖం పెట్టుకోని నా దగ్గరకు వచ్చాడు. కోర్టులో ఇవి నడ్చవ్. డైరెక్టుగా గంగాధర్ రెడ్డి దగ్గరకు తీసుకెళ్ళా. కేసు వారంలో తెగింది. కిందాపైనా మూసుకోని చెప్పిన డేట్కి తెచ్చిచ్చాడు".

ఆ మాటలినగానే కిషోర్కి మనసంతా సంతృప్తిగా అనిపించింది. అంతలో ఓ సందేహం వచ్చింది. "కానీ వాళ్ళు వూరికే ఎందుకు తెంచుతారు. భారీగా ఇచ్చుకోవాల్సి వస్తాదేమో" అన్నాడు.

శ్యాం సోఫా నుంచి ముందుకు వంగి "నిజమే... ఇవ్వాల్సి వుంటాది. వాళ్ళేం ప్రజాసేవ కోసమో, పేద ప్రజల మీద ప్రేమతోనో కాదుగదా ఇట్లాంటి రిస్కులు తీసుకునేది. వాళ్ళ ఆదాయ మార్గాల్లో ఇదీ ఒకటి. కానీ... నీదేం చిన్న మొత్తం గాదు. రెండు లక్షలు. వడ్డీ రాక రెండు సంవత్సరాలు దాటింది. అది లెక్కిస్తే మూల్లక్షలు. మనం కేసు పెట్టాలంటే ముందు లాయర్ నోటీసివ్వాల. కొన్ని నెలలు సమాధానం కోసం ఎదురుచూడాల. ఆ తర్వాత కోర్టులో సూట్ ఫైల్ చేయాలి.

→

## నానీలు

డా . చిల్లర భవానీ దేవి

ఆ ఇంటి మీద
మూడో నెంబరు సూచిక
మళ్ళీ
అల్లుడొచ్చాడేమో

వాళ్ళిద్దరూ
ఇంగ్లీషులో టాకింగ్
అమ్మయ్య
మన తెలుగు వాళ్ళే

దొంగగారూ
స్వాగతం
కలర్ టివి కోసమేనా
ఈ పోర్టబుల్ కూడా ఫ్రీ !

ఆవిడ
బాక్సింగ్ ప్రాక్టీస్ చేస్తోంది
రేపొచ్చే నీళ్ళ టాంకర్
సాక్షిగా...

ప్రపంచ చరిత్ర లో
కళాకారుడు
కన్నీటి నవ్వుల
రచయిత

కథలపుట్టుక
ఎక్కడో కాదు

కన్నీరేగా
దానికి మూలం !

నీలాలనింగి
పచ్చని చెట్లు
నేలమ్మ నుదిటి పై
చెరువొక పెయింటింగ్ !

ప్రియా !
ఇన్నాళ్ళకు నీ ప్రేమ లభించింది
ఇక నన్ను
మరణించనీ !

నీ కళ్ళల్లో
ఊసులన్నింటినీ
నా పెదవులపై
కవిత రాయవూ..!

ఆవిడ
గులాబీలా అందమైంది
ముళ్ళే చూశాడు
అంధుడు మరి !

## మర్యాదనేరం

మల్లంపల్లి విజయకుమార్

లోన కెరలే ముళ్ళు
చూపుల నుంచి మొలకై
హావభావాల కొసలతో
మనసు వి్క్రియలుగా పరివర్తనమౌతుంది
లేత భావమెపుడు
అన్ని సన్నివేశాలని కనిపెట్టుకోలేదు
దృశ్య దగ్ధం చేసేవాళ్ళు
ఎదుటి వాడి పంతం కోసమే
కోడి పందాలు వేస్తుంటారు
ఆద మరపు ఉనికే గంపైనపుడు
వాడి చర్మపు మర్మాన్ని వెలికి తీసి
వ్యక్తి మనుగడపై
సూక్ష్మ లోపాల్ని వెదికి
విషాద శిలువ వేస్తుంటారు
వాడ్ని దుర్భర క్రీడలో
మెలి పెట్టి మనసు విసర్జ జాడలపై
మాటు కాస్తుంటారు
ఎవరో దృశ్యమైన మచ్చొతుంటారు
వెంటాడే నీడై
వేధించడమే సజల నయన వేషం కడతారు
తెరల్ని చించే
ప్రమాద ఘటికలిపుడు మృత్యువు కాదు
నీ అవయవాల కన్నా
నీ జీవన శైలిని వికృతి చేయడమే
కొత్త మర్యాద నేరమిపుడు

---

వాయిదాల మీద వాయిదాలు పడుతూనే వుంటాయ్. కాలం గిర్రున తిరుగుతూనే వుంటాది. నువ్వు నీ బామ్మర్ది దగ్గర తెచ్చుకున్న అప్పు కొండలాగా పెరుగుతూనే వుంటాది. కానీ... కోర్టులోనేమో... నువ్వు సూట్ ఫైల్ చేసిన రోజు వరకు మాత్రమే బాండ్లో రాసుకున్నట్టు రెండ్రూపాయల వడ్డీ వస్తాది. ఆ తర్వాత కేస్ తెగేంతవరకూ పట్టే టైంకి కేవలం అర్ధరూపాయ వడ్డీ ఏస్తాడు. బ్యాంకు కన్నా తక్కువ. కేసు ఎంత లేటైతే నువ్వంత నష్టపోతావ్. దానికి తోడు కోర్టు ఫీజులు ముందే కట్టాల. వాదించినందుకు లాయర్‌కు ఫీజివ్వాల. ఓ పక్క మానసిక వేదన. ఈ సావంతా సచ్చేబదులు నువ్ నష్టపోయే డబ్బేదో వీని మొఖాన కొట్నావనుకో... కేసు నిమిషాల్మీద తెగుతాది. వాళ్ళ తీర్పుకి వాయిదాలుండవ్. సంవత్సరాల తరబడి చెత్త విచారణలుండవ్. అప్పీళ్ళుండవ్. చెప్పిన టైంకి చెప్పినట్టు డబ్బు నీ చేతుల్లో వాల్తాది. ఓ లాయరై వుండీ నేనెందుకిట్లా మాట్లాడ్తున్నాననే సందేహం నీకు రావచ్చు. కేసేస్తే నాకూ లాభమే. ఫీజొస్తాది. కానీ నువ్ నా క్లైయింట్‌వి కాదు. స్నేహితునివి. ఏ కేసు ఏ కోర్టులో వేస్తే త్వరగా జడ్జిమెంటు వస్తాదో నాకు బాగా తెలుసు" అన్నాడు.

కిషోర్ కొద్ది క్షణాలు ఆలోచించాడు. మరలా ఓ సందేహం మొలకెత్తింది. "మనం పోయినాక అవతలోళ్ళు కూడా ఎవరన్నా బాగా తెల్సినోళ్ళను పిల్చుకొచ్చినారనుకో... మధ్యలో మనకే ఎసరు రావచ్చు గదా" అడిగాడు.

"అఫ్‌కోర్సు.. కానీ అవి చాలా రేర్ కేసెస్. సామాన్యంగా వీళ్ళు ముందు ఎవడు తమను ఆశ్రయిస్తాడో వాళ్ళవైపే వుంటారు. అమాయకుల్నైతే అవతలోళ్ళతో మిలాఖతై అప్పుడప్పుడు ముంచేస్తూ వుంటారు. కానీ గంగాధర్ రెడ్డి తో నాకు చాలా మంచి సంబంధాలున్నాయి. వాళ్ళ కేసులు చాలా వరకు నేనే చూస్తుంటా. ఈ విషయంలో నువ్వే మాత్రం భయపడనక్కర్లేదు. నేను పూచీ... సరేనా" అన్నాడు.

కిషోర్ లాభనష్టాలు బేరీజు వేసుకున్నాడు. సత్వర న్యాయానికి కోర్టుకన్నా వీళ్ళ పంచాయితీ మేలనిపించింది. తప్పు చేసినోనిలా తలొంచుకొని కోర్టు ఆవరణలో పిలిచేంత వరకు బిక్కుబిక్కుమంటూ నిలబడ్డం, సాక్షుల్ని బతిమలాడుకోవడం, విచారణ ఎదుర్కోవడం, కేసు తెగేదాకా మానసిక వేదన, అభద్రతా భావం... అన్నీ తప్పుతాయనిపించింది. కోర్టుకి వెళ్ళాలనే ఆలోచన మనసులో నుండి పూర్తిగా తుడిచిపెట్టేశాడు. అంగీకార సూచకంగా తలూపాడు.

తరువాత రోజు పొద్దున్నే శ్యాం, కిషోర్ గంగాధర్‌రెడ్డి ఇంటికి చేరుకున్నారు లోపల ఏదో పంచాయితీ జరుగుతూ వున్నట్టుంది. శ్యాం లోపలికి వెళ్ళి వచ్చి "కాసేపాగు... పోదాం" అన్నాడు.

కిషోర్ బైటనే వేసి వున్న కుర్చీ మీద కూర్చుని తన వంతు కోసం ఎదురు చూడసాగాడు. ఇంటి ముందు అనేక మంది జనాలు. రకరకాల సమస్యలతో, న్యాయస్థానాలపై నమ్మకం కోల్పోయి... సత్వర న్యాయం కోసం.



# ప్రస్థానం మిత్రులకు బహుమతులు

ప్రస్థానం మిత్రులు ఇటీవల వివిధ కథల పోటీలలో బహుమతులు పొందారు.

ప్రజాశక్తి విశాఖ ఎడిషన్ ఎడిటోరియల్ బాధ్యుడు సత్యాజీ రాసిన బడి అవతల కథకు ఆంధ్ర ప్రదేశ్ మాస పత్రిక నిర్వహించిన కథల పోటీలో ప్రథమ బహుమతి లభించింది. ఈ బహుమతి కింద అయిదువేల రూపాలయ నగదు, ప్రశంసా పత్రం ఇస్తారు. ద్వితీయ బహుమతి పాత్రికేయ కథకుడు సుంకోజు దేవేంద్రాచారికి,తృతీయ బహుమతి అన్నవరం దేవేందర్‌కు లభించాయి. ఈ పోటీలలో మొత్తం 350 మంది పాల్గొన్నట్టు ఆంధ్ర ప్రదేశ్ పత్రిక సంపాదకులు గొట్టిపాటి సుజాత తెలిపారు.

విజయవాడలోని వేలూరి, పాణిగ్రాహి కల్చరల్ అసోసియేషన్ నిర్వహించిన కథల పోటీలో మొత్తం 187 మంది పాల్గొన్నారు. సీనియర్ రచయిత్రి కె.వరలక్ష్మి కథకు మొదటి బహుమతి లభించింది.ప్రజాశక్తి పాత్రికేయుడు వెంకట సుబ్బారావు కథ'బలిపీఠం' కు ద్వితీయ బహుమతి, ఉపాధ్యాయుడు కోనూరి రవికుమార్ కథ నమ్మకంకోసం కు తృతీయ బహుమతి వచ్చాయి.సాహితీ స్రవంతి మిత్రులు శీరం శెట్టి కాంతారావు(కంచిమేకలు), ప్రజాశక్తి పాత్రికేయులు ఉదయ శంకర్(బప్పా మోరియా), నల్లబాటి రాఘవేంద్రరావు (గాంధీతాత) లకు కన్సొలేషన్ బహుమతులు లభించాయి.డిసెంబరు 12న రాగూరు గ్రంథాలయంలో జరిగిన సభలో వారికి బహుమతులు అందజేశారు. ఈ సందర్భంగా విమర్శకులు కడియాల రామమోహనరాయ్ తెలుగు కథ పూర్వపరాలపై విశ్లేషణాత్మకంగా ప్రసంగించారు. ఈ సందర్భంగా కాలువ మల్లయ్యను సత్కరించారు. పాటిబండ్ల రజని, తాటి శ్రీకృష్ణ, జివిపూర్ణచందు,వేములు హజరతయ్య గుప్తతదితరులు పాల్గొన్నారు. వేలూరి పాణిగ్రాహి అసోసియేషన్ అధ్యక్షుడు వేలూరి కౌండిన్య కార్యక్రమాన్ని నిర్వహించారు.

# బాలసాహిత్యం వెబ్‌సైట్ ప్రారంభం

అరిబండిబాలసాహిత్య ట్రస్టు వెబ్‌సైట్‌ను డిసెంబర్ 1న హైదరాబాదులో జవహర్‌బాలభవన్ డైరెక్టరు డా.ఎం.కె. రాము ప్రారంభించారు. ఈ సందర్భంగా జరిగిన సభలో ప్రజాశక్తి సాహితీ సంస్థ చైర్మన్ కొరటాల సత్యనారాయణ, ప్రజాశక్తి సంపాదకుడు వి.శ్రీనివాసరావు పాల్గొని ప్రసంగించారు. మేనేజింగ్ ట్రస్టీ డా.అరిబండి ప్రసాదరావు అధ్యక్షత వహించగా ట్రస్టు కార్యదర్శి తెలకపల్లి రవి వెబ్‌సైట్ విశేషాలు, భవిష్యత్ కార్యక్రమాలు వివరించారు. వెబ్‌సైట్ చిరునామా-

www.balasahityam.org
www.balasahityam.com
www.aribandibalasahityam.com

# విభిన్న విమర్శకుడు త్రిపురనేని

త్రిపురనేని మధుసూదన రావు మృతితో తెలుగు సాహిత్యం ఒక మంచి విమర్శకున్ని కోల్పోయింది. దాని సాహితి స్రవంతి కన్వీనర్ తెలకపల్లి రవి జోహార్లర్పించారు. సుదీర్ఘ కాలం పాటు వామపక్ష నిబద్ధతతో అపారమైన అధ్యయనంతో ఆయన చేసిన కృషి ఆధునిక విమర్శనలో ఒక ప్రత్యేక స్థానమాక్రమిస్తుంది. సంప్రదాయ సాహిత్యంతోనూ సామ్యవాద భావజాలంతోనూ ప్రగాఢమైన పరిచయం అవగాహన గల మధుసూదనరావు అభిప్రాయాలతో ఏకీభవించని వారైనా ఆయన అధ్యయనం లోతును, భావాల పరిణితిని గౌరవించకుండా వుండలేరు. సాహిత్య రంగానికి సంబంధించి నంతవరకూ ప్రతి సందర్భంలోనూ ఆయన ఛాందసుల ,అవకాశవాదుల ,ఆడంబరపరుల నిజస్వరూపాన్ని వెల్లడించడంలో కీలక పాత్ర నిర్వహించారు. సాహిత్యరంగంలో అంత సైద్ధాంతిక స్పష్టత గలవారు అరుదు. అయితే కేవలం సిద్ధాంతాలు చెప్పడం, చరిత్రను ఏకరువు పెట్టడం కాక అర్థవంతమైన విశ్లేషణతో సాధారణ సాహిత్యకారులకు కూడా విశదమయ్యేలా తన దృక్కోణాన్ని చెప్పగలగడం త్రిపురనేనికే చెల్లింది. ఆ విధంగా ఆయన సాహిత్య విమర్శనను సుసంపన్నం చేశాడు.

తిరుపతిలో అన్ని అభ్యుదయ సాహిత్య స్రవంతులనూ ఆయన ప్రోత్సహిస్తూ వచ్చారు. అనారోగ్యం పీడిస్తున్నా ఆయన తిరుపతి పట్టణ సాంస్కృతిక జీవితంలో అవిభాజ్యమైన భాగంగా కొనసాగారు. స్వతహాగా మంచి చదువరి అయిన త్రిపురనేని సాహితీ స్రవంతితో నిరంతరం సన్నిహితంగా మసులుతూ వచ్చారు. అనేక ఆటుపోట్లు అవాంతరాలు తట్టుకుని చివరి వరకూ శ్రామిక వర్గ విముక్తి భావనకే అంకితమైన త్రిపురనేనికి జోహార్లర్పిస్తూ ఆయన కుటుంబ సభ్యులకు ప్రగాఢ సానుభూతి తెలియజేస్తున్నాను అని పేర్కొన్నారు.

→

# గురజాడకు నివాళి



విశాఖ ద్వారకా జంక్షన్‌లో గురజాడకు పూలమాల వేస్తున్న తెలకపల్లి రవి

ఆధునిక తెలుగు సాహిత్యానికి, తెలుగు భాషకు కొత్త వరవడి పెట్టిన మహావ్యక్తి గురజాడ అప్పారావు జయంతి సందర్భంగా సెప్టెంబరు 21న ఆయన సృతికి ఘన నివాళులు సమర్పించారు.

విశాఖ పట్టణంలోని ద్వారకా నగర్ జంక్షన్లో గురజాడ విగ్రహానికి 21 ఉదయం సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్, ప్రస్థానం సంపాదకులు తెలకపల్లిరవి పూలమాల వేసి నివాళులర్పించారు. ఇతర సాహిత్య సంఘాల వారితో సహా పలువురు సాహితీ మిత్రులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. అనంతరం దేశమును ప్రేమించుమన్నా గీతం ఆలాపిస్తూ సమీపంలోని విజెఎఫ్ హాలు వరకూ నడిచారు. అక్కడ గురజాడ జయంతి సభ సాహితీస్రవంతి బాధ్యులు స్వామి అధ్యక్షతన జరిగింది. తెలకపల్లి రవి ప్రసంగిస్తూ గురజాడ కేవలం మహాకవి రచయిత సంస్కర్త మాత్రమే కాదు, సంపూర్ణ వ్యక్తిత్వం అవగాహన మూర్తీభవించిన సామాజిక శాస్త్రజ్ఞుడు అని చెప్పారు. తెలుగుభాష ఈ రూపంలో వుండటానికి సాహిత్యప్రక్రియలైన కవితకథ నాటకం వగైరాలు ఇంతగా వికసించడానికి పునాదులు వేసిన మహనీయుడు అయనన్నారు. తాను విజయనగరం రాజాస్థానంలో ఆయనకు సన్నిహితంగా వుంటున్నా రాజభక్తిని ప్రబోధించలేదు. అంతకుముందు కావ్యాల్లో దైవభక్తితో ఆగిపోలేదు. పునర్వికాస యుగంలో మానవుడు కేంద్రబిందువుగా వుండాలన్న స్ఫూర్తిని తెలుగు నాట పాదుకొల్పి మనిషికి, చైతన్యానికి పట్టం కట్టే సాహిత్యం సృష్టించాడు. ఆ సాహిత్యం, చదువు సామాన్యుడికి అందాలంటే వ్యవహార భాష కావాలన్నాడు. అందుకోసం పోరాడాడు. కొంతమంది అనుకుంటున్నట్టు గురజాడ కేవలం కలం యోధుడే కాదు, నిజంగా పోరాడిన మనిషి. 19 శతాబ్ది చివరలోనే ఆయన తన కన్యాశుల్కంతో సంప్రదాయ వ్యవస్థను, చాందసభావాలను వాటిపై ఆధారపడిన వర్గాల బూటకత్వాన్ని పటాపంచలు చేశాడు. అందుకే ఆయన అనేక విధాల వైతాళికుడు, మార్గదర్శకుడు అన్నారు. సామాజిక విషయాలలో గురజాడ ముందుచూపు తెలియాలంటే ఆయన సాహిత్యాన్నే గాక వ్యవహారిక భాషపై రాసిన అసమ్మతిపత్రం చదవాల్సివుంటుందని చెప్పారు. గురజాడ అగ్రవర్ణాల ఆధిక్యతను, పురుషాధిక్యతను కూడా నిశితంగా చీల్చిచెండాడిన గురజాడ తనకాలంకంటే ఎంతో ముందున్నారని చెప్పారు. దేశభక్తి గేయం సంకుచితమైన సరిహద్దులకు అతీతంగా ప్రపంచంలో ఏ దేశమైనా పాడుకోగలిగినంత విశాలమైన భావంతో రూపొందిందన్నారు. అందులో ప్రతి చరణంలోనూ ఒక సందేశం వుందని, నేటి దేశ పరిస్థితులు అందుకు పూర్తిభిన్నంగా తయారైనాయని వివరించారు. ప్రపంచీకరణ సాంస్కృతిక దాడికి దేశీయ భాషలు, సంస్కృతులు అంతరించిపోతున్న నేటి స్థితిలో గురజాడ అడుగుజాడ నిత్యస్మరణీయమని రవి చెప్పారు.

అనంతరం కథాపరిణామంపై గోష్టి జరిగింది. దానికి ముందు విరియాల లక్ష్మీపతి విశాఖ సాహితీ స్రవంతి ప్రచురించిన 'మాటు' కథా సంకలనాన్ని ఆవిష్కరించారు. సత్యాజీ సంపుటిని పరిచయం చేశారు. తెలకపల్లి రవి తెలుగు కథ చరిత్ర, పరిణామంపై ప్రసంగించారు. తెలుగుకథకు ఇది స్వర్ణయుగమని అంటూ కారణాలను విశ్లేషించారు. అదే సమయంలో రచయితలకు కొన్ని సూచనలు చేశారు. మధ్యాహ్నం కవిత్వంపై జరిగిన వర్క్‌షాప్‌లో ప్రముఖ విమర్శకులు, కవి అద్దేపల్లి రామమోహనరావు మాట్లాడుతూ కవి అనుభూతిని శక్తివంతంగా పలికించేందుకు అధ్యయనం, పరిశీలన అవసరమన్నారు. సభికులు కవిత్వం గురించి అడిగిన పలు ప్రశ్నలకుఆయన సమాధాన మిచ్చారు. అనంతరం కవి సమ్మేళనం జరిగింది. కథపై చర్చకు సాహితీ స్రవంతి నగర కన్వీనర్ ఎవిఎస్ స్వామి అధ్యక్షత వహించగా కవితా సదస్సుకు ప్రజాశక్తి విశాఖ ఎడిషన్ బాధ్యులు సత్యాజీ అధ్యక్షత వహించి నిర్వహించారు. స్రవంతి జిల్లాకన్వీనర్ చలపతి స్వాగతం పలికారు. అరుణ్‌జీ, రామస్వామి తదితరులు పాల్గొన్నారు.

**విజయనగరంలో**

సెప్టెంబరు 21న విజయనగరంలో గురజాడ విగ్రహానికి పూల మాలవేసి జోహారులర్పించారు. అనంతరం గురజాడ జిల్లా కేంద్ర గ్రంధాలయంలో జనసాహిత్య సమ్మేళనం జరిగింది. కవిత-ఇతివృత్తం- రచనాశిల్పం సదస్సుకు ప్రధాన వక్తగా విచ్చేసిన అద్దేపల్లి రామమోహనరావు కవితారచనకు సంబంధించిన వివిధ అంశాలను విపులంగా తెలిపారు. కవి అల అధ్యక్షత వహించగా పలువురు యువకవులు తమ సందేహాలు, అభిప్రాయాలు వెలిబుచ్చారు. సదస్సు ఆసక్తికరంగా జరిగింది. స్థానిక అధ్యాపకులు ప్రముఖ విమర్శకులు డా. రామసూరి మాట్లాడుతూ శ్రీశ్రీ కవితల ఆధారంగా కవిత్వ పరిణామాన్ని విశ్లేషించారు. మధ్యాహ్నం కథా నిర్మాణం- స్వరూప స్వభావాలు' గోష్టి జరిగింది. రచయిత జివిఎస్ చలం అధ్యక్షత వహించగా ప్రముఖ కథకుడు గంటేటి గౌరునాయుడు కథారచనలో తన అనుభవాలు,



విశాఖలో ప్రసంగిస్తున్న అద్దేపల్లి, మాటు ఆవిష్కరించిన లక్ష్మీపతి

→

అభిప్రాయాలు చెప్పారు. డాక్టర్ చాగంటి తులసి ప్రారంభోపన్యాసం చేస్తూ కథా రచనకు సంబంధించిన మెళకువలు తన తండ్రిగారైన చాసో అనుభవాలు ప్రస్తావించారు. ఈ సందర్భంగా కథా రచన శిల్పం ముగింపు తదితర అంశాలపై సభికుల ప్రశ్నలతో పాటు వక్తల మధ్య కూడా చర్చ జరిగింది.

చివరగా జరిగిన గురజాడ సాహిత్య సమాలోచన సభలో తెలకపల్లి రవి ప్రధానోపన్యాసం చేశారు. బడబాగ్ని శంకరరావు రచించిన వానచూపు కవితాసంకలనాన్ని డా.యు.ఎ.నరసింహ మూర్తి ఆవిష్కరించారు. రామసూరి పరిచయంచేశారు. స్రవంతి కన్వీనర్ చీకటి దివాకర్ అధ్యక్షత వహించారు. ఈసందర్భంగా విద్యార్థులకు నిర్వహించిన పోటీలలో విజేతలకు నటుడు అల్లూరి సీతారామరాజు బహుమతి ప్రదానం చేశారు. ఉదయం సభలకు గణనీయమైన సంఖ్యలో హాజరైన సాహితీ మిత్రులకు తోడుగా ఈ సభకు అదనంగా స్థానిక ప్రజలు హాజరై గురజాడ పట్ల తమ ప్రత్యేక గౌరవాన్ని చాటుకున్నారు.

### క్యాలెండర్ ఆవిష్కరణలు

తన రచనలలో శాస్త్రీయ అవగాహనను చాటిచెప్పి మూఢనమ్మకాలను చీల్చిచెండాడిన గురజాడ అప్పారావు సంస్మరణార్థం జన విజ్ఞాన వేదిక రూపొందించిన క్యాలెండర్ ఆవిష్కరణ కార్యక్రమాలు కూడా పలుచోట్ల జరిగాయి. తిరుపతిలో టిటిడి జెఇవో, సాహితీ ప్రియులు ముక్తేశ్వరరావు ప్రసంగించారు. గురజాడ స్ఫూర్తిమరగున పడరాదన్నారు. ఈ కార్యక్రమంలో అమరాజా బ్యాటరీస్ ఎగ్జిక్యూటివ్ చైర్మన్ గల్లా రామచంద్రనాయుడు క్యాలెండర్ ఆవిష్కరించారు. రచయిత భూమన్,జెవివిపట్టణాధ్యక్షులు శాకం నాగరాజులతో సహా పలువురు పాల్గొన్నారు. చిత్తూరు జిల్లా మదనపల్లిలోకూడా జయంతి సభ, క్యాలెండర్ ఆవిష్కరణ జరిగాయి.

కడపలో డిఇవో గురజాడ క్యాలెండర్ ఆవిష్కరించారు. జానమద్ది హనుమచ్ఛాస్త్రి, డా.మేడిపల్లి రవికుమార్ తదితరులు మాట్లాడుతూ గురజాడకు నివాళులర్పించారు. సభకు జెవివి అధ్యక్షులు రాహుల్ అధ్యక్షత వహించారు. పలువురు ఉపాధ్యాయులు, సాహితీ మిత్రులు పాల్గొన్నారు.

హైదరాబాదులో గురజాడ క్యాలెండర్‌ను తెలుగు యూనివర్సిటీ వైస్ చాన్సలర్ డా.జివి సుబ్రహ్మణ్యం ఆవిష్కరించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ గురజాడ రచనలు నేటికీ ప్రామాణికమైనవని, మార్గదర్శకమైనవని అన్నారు. జె.సత్య ప్రసాద్ గురజాడ బోధనలకు సైన్సుఉద్యమానికి మధ్య సంబంధం వివరించారు. కన్యాశుల్కం ప్రదర్శనలో ఆరితేరిన నటులు జెవి రమణమూర్తి ఆ నాటకం విశిష్టతను వివరించారు. జెవివి నగర అధ్యక్ష కార్యదర్శులు జగన్మోహనరావు, రాజా, యూనివర్సిటీ రిజిస్ట్రార్ బి.వెంకటేశ్వర్లు తదితరులు ప్రసంగించారు. విద్యార్థులు కన్యాశుల్కం ప్రదర్శించారు.

### మహబూబ్‌నగర్...

అక్టోబర్ 9వ తేదీ ఉదయం మహబూబ్‌నగర్ అంబేద్కర్ భవనంలోని డిఆర్‌డిఎ సమావేశహాలులో ప్రజాసాహిత్యవేదిక ఆధ్వర్యంలో గురజాడ సాహిత్య సమాలోచన సమావేశం జరిగింది.

ఈ కార్యక్రమంలో మొదట విమర్శకులు త్రిపురనేని మధుసూదనరావుగారికి మౌనంతో శ్రద్ధాంజలి ఘటిస్తూ సమావేశం ప్రారంభమైంది.

హిమజ్వాల "గురజాడ కవిత్వం - మానవత - సమకాలీనత"ను వివరిస్తూ గురజాడ వాడుక భాషను తెలుగు సాహిత్యంలోకి తెచ్చి ఆనాటి సాహిత్యకారులకు సవాల్ విసిరారు అన్నారు.



మహబూబ్‌నగర్‌లో జరిగిన గురజాడ సాహిత్య సమాలోచనలో ప్రసంగిస్తున్న కాకరాల, వేదికపై వల్లభాపురం జనార్దన, విరజాజి రామిరెడ్డి, హిమజ్వాల

ఆ తర్వాత "గురజాడ కన్యాశుల్క నాటక కళ" అనే అంశంపై కాకరాల ఉపన్యసిస్తూ కన్యాశుల్క నాటక ప్రారంభపదం గురజాడ సృజనాత్మకతకు నిదర్శనమన్నారు. "సాయంకాలమైంది" అనే ఆ పదం "బీటలు వారుతున్న ఆనాటి రాచరిక వ్యవస్థను చూపిందన్నారు. "కన్యాశుల్కం" నాటకాన్ని ప్రదర్శించిన అబ్బూరి రామకృష్ణారావు దగ్గర్నుంచి జె.వి. రమణమూర్తి, జె.వి. సోమయాజులు దగ్గర్నుంచి కన్యాశుల్కం తెలుగు సినిమా నేటితరం రచయిత అంపశయ్య నవీన్ దాకా అందరూ గిరీశమే కథా నాయకుడని అంటారు. కాని తనకు కొంత మంది విమర్శకులకు "మధురవాణే" నిజమైన కేంద్ర బిందువు అనే అభిప్రాయం ఉంది. ఎందుకంటే గురజాడ సాహిత్యంలో స్త్రీ ద్వారా సమాజం మారుతుంది అనే సందేశమిచ్చారు. అలాగే ఉపన్యాసం మధ్యలో కన్యాశుల్కం మొదటి పేజీ చివరి పేజీలోని సంభాషణల్ని కాకరాల గారు తనదైన శైలిలో చదువుతుంటే శ్రోతలు మైమరచిపోయారు. ఈ నాటకంలోని సంభాషణలు తెలుగు సాహిత్యంలో ఎప్పటికీ నానుతూనే ఉంటాయన్నారు. ఇక ఆఖరి డైలాగ్ "డామిట్ కథ అడ్డం తిరిగింది" కూడా ఎంతో విలువైన డైలాగ్ అని ఎలాగంటే అప్పటికి కథలోని పాత్రలన్నీ ఈ కథకు అనుగుణంగా మారిపోయి వుంటాయి అన్నారు. ఆఖరు సన్నివేశంలో గిరీశం పాత్రకు లైటింగ్ బాగా ఉంటుందని మధురవాణి సగం లైటింగ్‌లో సగం చీకట్లో అదే విధంగా సౌజన్యారావు మూడోవంతు చీకట్లో ఒకవంతు లైటింగ్‌లో ఉంటాడని దీని ద్వారా గిరీశం సంస్కరణవాదంలో అవకాశవాదానికీ - మధురవాణి పరిమిత ప్రజాస్వామ్య భావాలకు - సౌజన్యరావు పరిమిత సంస్కరణ వాదానికీ చిహ్నాలుగా ఉంటూ ఆ లైటింగ్ ఎఫెక్ట్ సమాజంలో ఆ పాత్రల స్థానాన్ని చూపిస్తుందన్నారు. నాటకంలోని "ఇల్లు ఇల్లంటావ్" పాట భూస్వామ్య ఉత్పత్తి సంబంధాలను తెలుపుతుందని స్వార్థాన్ని వదిలేయాలనే సందేశాన్నిస్తుందని అంటూ ముగించారు. కాకరాల ఉపన్యాసం అనర్గళంగా స్పష్టంగా తనదైన శైలిలో సాగటంతో శ్రోతలు మంత్ర ముగ్ధులయ్యారు.

విరజాజి రామిరెడ్డి అధ్యక్షతన ఉదయం 11 గంటలకు సభ ప్రారంభమై మధ్యాహ్నం మూడు గంటలకు ముగిసింది. కవి కోట్ల వెంకటేశ్వరరెడ్డి స్వాగతోపన్యాసంతో మొదలై బి. వెంకటయ్య వందన సమర్పణతో ముగిసింది. ఈ సభలో ఉదయ్ యువకవి నవీన్, జనజ్వాల ఉదయమిత్ర, కవయిత్రులు కె.ఎ.ఎల్. సత్యవతి, కె. జయశ్రీలు పత్రికా విలేకరులు బుచ్చయ్య, జి. చక్రవర్తిగౌడు, కమలేకర్ శ్యాంప్రసాద్ ప్రముఖ నాయకులు బుర్రి వెంకట్రామిరెడ్డి, సత్తూరు రాములు గౌడు మరియు

పెద్దలు వల్లపురెడ్డి బుచ్చారెడ్డి, ఉండెకోడు రత్నయ్యలు పాల్గొన్నారు. 80 మంది శ్రోతలు పాల్గొనటంతో సభ ఉత్తేజపూరితంగా జరిగి విజయవంతమైంది.

**-జి. బుచ్చయ్య, మహబూబ్‌నగర్**

**మంచిర్యాల...**

ఆధునిక తెలుగు సాహిత్యానికి పునాదులు వేసిన మహాకవి గురజాడ తన రచనల ద్వారా తెలుగు ప్రజల్లో సామాజిక చైతన్యం తీసుకురావడానికి కృషి చేశాడని మంచిర్యాలలో జరిగిన "గురజాడ జయంతి ఉత్సవ" సభలో వక్తలు ఉద్ఘాటించారు. స్థానిక జిల్లా పరిషత్ బాలుర పాఠశాలలో మంగళవారంనాడు గురజాడ అప్పారావు 142 జయంతి సందర్భంగా ఏర్పాటు చేసిన సభను మున్సిపల్ ఛైర్మన్ శ్రీ మంగీలాల్ సోమాని జ్యోతి ప్రజ్వలన చేసి ప్రారంభించారు. సభకు ముఖ్యఅతిథిగా వచ్చిన "సామాజిక స్పందన వేదిక" కన్వీనర్ కె. నారాయణ మాట్లాడుతూ కుల, మత, దురాభిమానాలను నిర్మూలించడానికి గురజాడ తన రచనల ద్వారా కృషి చేశాడని కుల-మత రహిత సమాజాన్ని నిర్మించడానికి మనమందరం కృషి చేయడమే ఆ మహాకవికి మనమివ్వగల నివాళి అని తెలిపారు. సభకు అధ్యక్షత వహించిన "సాహితీ స్రవంతి" కన్వీనర్ ఆర్. రాజేశం మాట్లాడుతూ సామాజిక దురాచారాలను, వర్ణ వ్యవస్థ కుటిల పన్నాగాలను తన పద్యాల ద్వారా చీల్చిచెండాడిన ప్రజాకవి వేమన నెలకొల్పిన ఒరవడిని మరింత ముందుకు తీసుకువెళ్ళిన గురజాడ సంఘ సంస్కరణ ప్రయాణ పతాకగా తన సాహిత్యాన్ని ఉపయోగించాడని తెలిపారు. గురజాడ, శ్రీశ్రీ, దాశరథిలాంటి ప్రజా సాహితీకారులు సృష్టించిన మానవతావాద సాహిత్యం గురించి ప్రజలకు తెలియజెప్పడానికే సాహితీ స్రవంతి సంస్థ తన కార్యక్రమాల ద్వారా కృషి చేస్తుందని ఆయన తెలిపారు. క్యాతనపల్లి సర్పంచ్ గురిజాల రవీందర్‌రావు, జిల్లా సాంస్కృతిక సమాఖ్య అధ్యక్షులు ఉమామహేశ్వర్‌రావు మాట్లాడుతూ గురజాడ అడుగుజాడల్లో నేటి సాహిత్యం ప్రజాచైతన్యానికి కృషి చేయాలని ఆకాంక్షించారు. బసవేశ్వర్, ఎం.రాందాసు, బి.నారాయణరావు పాడిన దేశభక్తి గీతాలు శ్రోతలను అలరించాయి. బేబీ అనూషా నృత్యం సభికులను ఆకట్టుకుంది. ఆగచారి వందన సమర్పణతో సభ ముగిసింది. మంచిర్యాల పరిసర ప్రాంతాల్లోని సుమారు 90 మంది సాహితీ ప్రియులు ఈ సమావేశానికి హాజరయ్యారు.



మంచిర్యాల సభలో ప్రసంగిస్తున్న వక్తలు

**ఖమ్మం...**

సెప్టెంబరు చివరి వారంలో ఖమ్మం జెడ్‌పి హాలులో గురజాడ జయంతి సభ జరిగింది. సాహిత్య మిత్రులు డా. హరీష్ అధ్యక్షత వహించగా తెలకపల్లి రవి ప్రధానోపన్యాసం చేశారు. సాహితీ స్రవంతి జిల్లా కన్వీనర్ ఆనందాచారి స్వాగతం పలికారు. ఈ సందర్భంగా ఇటీవల టీవీ నంది అవార్డులలో ఉత్తమ గేయరచయిత పురస్కారం పొందిన దేవేంద్రను సత్కరించారు.



ఖమ్మంలో గురజాడ క్యాలెండర్ విడుదల చేస్తున్న డా. హరీష్ ప్రభృతులు

**కర్నూలులో వర్ధంతి సభ..**

గురజాడ వర్ధంతి సభ నవంబరు 30న కర్నూలు కోల్సు కాలేజీలో జరిగింది. సాహితీ స్రవంతి కో కన్వీనర్ జంధ్యాల రఘుబాబు స్వాగతం పలకగా రచయిత శుభాకర రావు అధ్యక్షత వహించారు. డా, శాంతమ్మ తొలుత గురజాడ చిత్రపటానికి పూలమాల వేసి శ్రద్ధాంజలి ఘటించారు. సభలో తెలకపల్లి రవి ప్రధాన ప్రసంగం చేశారు. డా. మంగమ్మ కూడా ప్రసంగించారు. ఎ.బసవరాజు వందన సమర్పణ చేశారు. ప్రజానాట్యమండలి గాయకులు జగన్ తదితరులు గేయాలాపన చేశారు.

## 'సాహిత్య చరిత్ర' ఆవిష్కరణ

డాక్టర్ ద్వా.నా.శాస్త్రి రచించిన 'తెలుగు సాహిత్య చరిత్ర' మూడవ ముద్రణ సందర్భంగా అక్టోబరు 25 న హైదరాబాద్ త్యాగరాజు గానసభ మినీ హాలులో ఆవిష్కరణ సభ జరిగింది. సభకు అధ్యక్షత వహించిన ఆచార్య ఎన్. గోపి మాట్లాడుతూ "ద్వానా శాస్త్రి రచించిన తెలుగు సాహిత్య చరిత్ర విస్తృత వ్యాప్తి పొందింది. విశ్వ విద్యాలయాలలో స్థిరపడింది. పూర్వం వచ్చిన సాహిత్య చరిత్రల కన్న అనేక విధాలుగా భిన్నమైనది" అన్నారు. 'తెలుగు సాహిత్య చరిత్ర' ను ఆవిష్కరించిన ఆచార్య సి. నారాయణ రెడ్డి "అదునూపదునూ ఎరిగిన రచయిత ద్వా.నా.శాస్త్రి. ఈ సాహిత్య చరిత్రలో విషయ సేకరణ, వివేచన, విశ్లేషణ ముప్పేటలా అల్లుకుపోయాయి. చదివించే శైలిలో శిరోభారం లేకుండా అందరి కోసం రాయటం అభినందనీయం" అన్నారు. ఆత్మీయ అతిథిగా విచ్చేసిన ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి సాహిత్య చరిత్ర రాయగల ఓర్పు, నేర్పు, సంయమనం శాస్త్రికి ఉన్నాయన్నారు. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ మేనేజర్ పి. రాజేశ్వరరావు మూడో ముద్రణ నేపథ్యాన్ని వివరించారు. హైదరాబాద్ విశ్వ విద్యాలయం తెలుగు శాఖ ఆచార్యులు శరత్ జ్యోత్స్నా రాణి మిగిలిన సాహిత్య చరిత్రలలో లేని అంశాలు ద్వా.నా.శాస్త్రి స్పృశించారని పేర్కొన్నారు. గ్రూప్ II ఎ.ఎస్ అభ్యర్థులు తమ అభిప్రాయాలను వెల్లడించారు. సమైక్యభారతి సంస్థ ప్రధాన కార్యదర్శి జి. సత్యనారాయణ ఏర్పాటు చేసిన ఈ ఆవిష్కరణ సభలో పలువురు సాహితీ వేత్తలు, విద్యా వేత్తలతో పాటు పోటీ పరీక్షలకి వెళ్ళే విద్యార్థులు కూడా పాల్గొన్నారు.



డాక్టర్ ద్వా.నా. శాస్త్రి రచించిన 'తెలుగు సాహిత్య చరిత్ర' మూడో ముద్రణను సి. నారాయణరెడ్డి ఆవిష్కరిస్తున్న దృశ్యం




భద్రిరాజు కృష్ణమూర్తికి ఫెలోషిప్‌ను బహూకరిస్తున్న ప్రధాని మన్మోహన్‌సింగ్

## భద్రిరాజుకు ఫెలోషిప్ ప్రదానం

ప్రముఖ సాహితీవేత్త, భాషా ప్రయోక్త భద్రిరాజు కృష్ణమూర్తికి కేంద్ర సాహిత్య అకాడమీ ఫెలోషిప్ ప్రదానం జరిగింది. అక్టోబర్ 31న ఢిల్లీలో జరిగిన సాహిత్య అకాడమీ స్వర్ణోత్సవాల వేడుకలలో ప్రధాని మన్మోహన్‌సింగ్ ఆయనకు ఫెలోషిప్ ప్రదానం చేశారు. కేంద్ర సమాచార, ప్రసార శాఖ మంత్రి డాక్టర్ ఎస్. జైపాల్‌రెడ్డిలు పాల్గొన్న ఈ వేడుకలలో గతంలో ఫెలోషిప్ పొందిన ప్రముఖ కవి గుంటూరు శేషేంద్రశర్మను ఘనంగా సత్కరించారు.

భద్రిరాజు కృష్ణమూర్తి తెలుగులో 25 పుస్తకాలను రచించడమే కాకుండా సుమారు వందకు పైగా పరిశోధనా పత్రాలను సమర్పించారు.

1949లో తెలుగు లెక్చరర్‌గా తన జీవితాన్ని ప్రారంభించిన భద్రిరాజు తరువాత బర్కిలీలోని కాలిఫోర్నియా యూనివర్సిటీలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా చేరారు. ఆ తరువాత పలు విశ్వవిద్యాలయాల్లో తన సేవలను కొనసాగించిన భద్రిరాజు విదేశాల్లోని పలు విశ్వవిద్యాలయాలకు విజిటింగ్ ప్రొఫెసర్‌గా పని చేశారు.

## ఘనంగా పులికంటి సాహితీ సత్కృతి ఐదవ వార్షికోత్సవం

ప్రముఖ కథా రచయిత పులికంటి కృష్ణారెడ్డి స్థాపించిన 'పులికంటి సాహితీ సత్కృతి' ఐదవ వార్షికోత్సవం తిరుపతిలోని భీమాస్ డీలక్స్ కాన్ఫరెన్స్ హాలులో నవంబర్ 14న ఘనంగా జరిగింది. సభ ప్రారంభానికి ముందు శ్రీమతి శ్రీదేవి ఆలపించిన లలిత సంగీతం అలరించింది. అనంతరం శ్రీమతి ద్వారం లక్ష్మి పాడిన 'మా తెలుగుతల్లికి మల్లెపూదండ' గీతంతో సభ ప్రారంభమయింది. ఈ ఏడు ప్రముఖ కథా రచయిత్రి అబ్బూరి ఛాయాదేవి, ప్రముఖ కవి అద్దేపల్లి రామ్మోహనరావు, సహస్రావధాని గరికపాటి నరసింహారావు, సాహిత్యవేత్త వి.వి.ఎల్. నరసింహారావులకు పులికంటి సాహితీ సత్కృతి అవార్డులు యిచ్చారు. వీరికి తుడ ఛైర్మన్ భూమన్ కరుణాకర్‌రెడ్డి చేతుల మీదుగా దుశ్శాలువలు కప్పి, జ్ఞాపికలతో సన్మానించారు. జ్ఞాపికలతోపాటు ఒక్కొక్కరికి ఐదువేల రూపాయల నగదును యిచ్చారు. సన్మాన గ్రహీతల గురించి కవి వేంపల్లి అబ్దుల్ ఖాదర్ ప్రశంసా పత్రాలను చదివి వినిపించారు. అద్దేపల్లి మాట్లాడుతూ 'ఇవి వర్గ సమీకరణలు లేని అవార్డులని' అన్నారు. గరికపాటి నరసింహారావు తన కవితా జల్లులతో సభను అలరించారు. అనంతరం తిరుపతిలో శంకరంబాడి విగ్రహ ఏర్పాటుకు తీవ్ర కృషి చేసిన భూమన్ కరుణాకర్‌రెడ్డికి, విగ్రహ నిర్మాణానికి నాలుగు లక్షల రూపాయల్ను విరాళం యిచ్చిన అశోక్‌కుమార్‌లకు సన్మానం చేశారు. ఈ కార్యక్రమానికి వాక్‌బ్రహ్మ వోలేటి పార్వతీశం సమన్వయ కర్తగా వ్యవహరించారు. ఈ కార్యక్రమంలో ఐపిఎస్ అధికారి రామచంద్రరాజు, రచయిత వల్లభనేని అశ్వినికుమార్, రాయలసీమ అధ్యయనాల సంస్థ అధ్యక్షుడు భూమన్, రాష్ట్రీయ సేవా సమితి కార్యదర్శి గుత్తా మునిరత్నం, పలువురు కథకులు, కవులు పాల్గొన్నారు.

– దేవేంద్ర, తిరుపతి



'పక్షి' కథా సంపుటిని మధురాంతకం నాగభూషణమ్మ నాయుడుపేటలో ఆవిష్కరించారు. ఈ ఆవిష్కరణసభకు అద్దేపల్లి రామ్మోహనరావు అధ్యక్షత వహించగా సింగమనేని నారాయణ పుస్తక సమీక్ష చేశారు. పి. సత్యవతి వక్తగా వ్యవహరించారు. మధురాంతకం నరేంద్ర, రాసాని, ఉమామహేశ్వరరావు, విష్ణుప్రియ, మంచికంటి, పలమనేరు బాలాజీ, పెళ్ళకూరు జయప్రద, పల్లేటి బాలాజీ, పెరుగురామకృష్ణ, దుర్గాదేవి సాహితీ మిత్రులు హాజరయ్యారు.

సభానంతరం జరిగిన 'వర్తమాన కథ' మీద చర్చ జరిగింది.

## డా॥ దిలావర్‌కు పురస్కారం

నవంబరు 18న ప్రఖ్యాత కవి డా॥ ఆవంత్స సోమసుందర్ 81వ జన్మ దినోత్సవ వేడుకలు పిఠాపురంలో ఘనంగా జరిగాయి. గత మూడు సంవత్సరాలుగా ఆ రోజున ఒక ప్రముఖ కవికి సోమసుందర్ లిటరరీ ట్రస్టు వారు అవార్డు ప్రదానం, ఒక విమర్శకునికి సత్కారం చేస్తున్నారు. 2004కుగాను ప్రముఖ అభ్యుదయ కవి డా॥ యు.ఎ. నరసింహమూర్తిని సత్కరించారు. ఇదే కార్యక్రమంలో డా॥ దిలావర్‌కు అవార్డు యిచ్చారు. అవార్డు కింద రు. 6116లు, శాలువాతో దిలావర్‌ను సన్మానించారు. విమర్శకులు డా॥ సోమసుందర్ రచించిన అక్షరనాదం, విరియాల లక్ష్మీపతి రచించిన కవికుల క్షీరాబ్దిసోమ, దిలావర్ రచించిన గ్రౌండ్ జీరో, కొంపెల్లి కామేశ్వరరావు రచించిన శిథిల అనే గ్రంథాలు ఆవిష్కరింపబడ్డాయి. ఈ కార్యక్రమంలో ట్రస్టు అధ్యక్షులు డా॥ కె. వెంకటరావు, ఆచార్య ఆర్.వి.ఎస్. సుందరం, విద్యాసాగర్ ఐఏఎస్, ఉమర్ అలీషా, డా॥ చిరంజీవినీ కుమారి, జ్ఞానానందం కవి, విరియాల లక్ష్మీపతి, పెనుగొండ లక్ష్మీనారాయణ, డా॥మానేపల్లి, దాట్ల దేవదానం రాజు, ప్రతిమ, గజానన్ తామన్ తదితరులు పాల్గొని ప్రసంగించారు. శశికాంత్ శాతకర్ణి వందన సమర్పణతో సభ ముగిసింది.

→

## "నెలపొడుపు" ఆవిష్కరణ



కరీంనగర్ నుండి కథా సాహిత్యం విరివిగా వస్తున్న నేపథ్యంలో కొత్తగా ఎదుగుతున్న కథకుడు బి.వి.ఎస్. స్వామి అని ప్రఖ్యాత కథా రచయిత తుమ్మేటి రఘోత్తమరెడ్డి అన్నారు. ఆయన 7 నవంబరు ఆదివారం సాయంత్రం స్థానిక మహిళా డిగ్రీ కళాశాలలో బి.వి.ఎన్. స్వామి "నెలపొడుపు" కథా సంకలనాన్ని ఆవిష్కరించారు. ఉదయ సాహితి, సాహితీ స్రవంతి సంయుక్తంగా ఏర్పాటు చేసిన ఈ సభకు వారాల ఆనంద్ అధ్యక్షత వహించారు. కథా నిర్మాణం, సామాజిక నిర్మాణం లాంటిదని సమాజంలో ఎన్ని కోణాలున్నాయో అన్ని కోణాలు కథల్లో ప్రతిఫలిస్తాయని రఘోత్తమరెడ్డి అన్నారు. కథలకు వస్తువు, భాషతోపాటు నిర్మాణం కూడా ముఖ్యమని ఆయన అన్నారు. నెలపొడుపు పుస్తకాన్ని సమీక్షించిన విమర్శకులు డాక్టర్ జి. లక్ష్మణరావు మాటాలడుతూ సంక్లిష్టమైన జీవితం నుంచి ఈ కథలు రూపొందాయన్నారు. కథల్లో గొప్ప శిల్పంతోపాటు "నేటివిటి" కూడా ఉందన్నారు. డా॥ డింగరి నరహరి ఆచార్య మాట్లాడుతూ ఈ కథల్లో తెలంగాణా బతుకు జీవితానికి తోడు తాత్విక చర్చ కూడా ఉన్నదని అన్నారు. సమాజంలోని సమస్త జీవితాలను చక్కనైన శైలిలో చిత్రీకరించిన కథా రచయిత బి.వి.ఎన్. స్వామి అని డింగరి అన్నారు. ప్రముఖ కవి, కథకుడు జూకంటి జగన్నాథం మాట్లాడుతూ వర్తమానం చాలా స్పీడ్‌గా మరియు ఒత్తిడులతో కూడి ఉన్నదని, వీటన్నిటిని ఆకళింపు చేసుకొని రాయాల్సిన భారం కథకులపై ఉన్నదని అన్నారు. సభాధ్యక్షులు వారాల ఆనంద్ మాట్లాడుతూ గత కాలపు కరీంనగర్ కథా సాహిత్యాన్ని మరియు వర్తమాన కథా సాహిత్యాన్ని బేరీజు వేశారు. స్థానీయతను ప్రధానంగా చేసుకున్న బి.వి.ఎన్. స్వామి గత కాలపు కథా సాహిత్యానికి కొనసాగింపు అని తెలిపారు. రచయిత బి.వి.ఎన్. స్వామి మాట్లాడుతూ అతలాకుతలమవుతున్న పరిసరాలు, పరిస్థితులు తనను కథకుడిగా నిలబెట్టాయని, ఈ సందర్భంలో తనకు సహకరించిన ప్రతి ఒక్కరికి కృతజ్ఞతలు తెలిపారు. బెజ్జారపు రవిందర్, పెద్దింటి అశోక్, అన్నవరం దేవేందర్, అనంతాచార్య, గోపులింగారెడ్డి తదితరులు రచయితను అభినందించారు. ఈ సభకు సాహితీ స్రవంతి కన్వీనర్ వేణుశ్రీ సమావేశ కర్తగా వ్యవహరించారు. ఉదయ సాహితి అధ్యక్షుడు దాస్యం లక్ష్మయ్య వందన సమర్పణ చేశారు.

-వేణుశ్రీ, కరీంనగర్



హైదరాబాద్‌లో ఆంధ్రజ్యోతి-ఎమెస్కో ఆధ్వర్యంలో పిల్లల కోసం బొమ్మలు, కథల పోటీలు, ఉపాధ్యాయుల కోసం బడినేర్పిన పాఠాలు అన్న అంశాలపై రాష్ట్రస్థాయి విజేతలకు బహుమతి ప్రదానోత్సవ సభలో పాఠశాల విద్యాశాఖ ముఖ్య కార్యదర్శి డా॥ ఎస్. చెల్లప్ప ప్రత్యేక సావనీర్‌ను ఆవిష్కరించి విద్యాశాఖ మంత్రి వేదికపై ప్రముఖులు

## బాల రచయితలకు భారీ పురస్కారం, పుస్తకాల విడుదల

ఎమెస్కో- ఆంధ్రజ్యోతి ఆధ్వర్యంలో బాల రచయితల సృజనాత్మతకు ప్రోత్సాహమిచ్చే భారీ కార్యక్రమం ముగింపు ఉత్సవం డిసెంబరు 6న హైదరాబాదు సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జరిగింది. జనవిజ్ఞాన వేదిక ప్రధాన పాత్రతో, ఎం.వి.ఫౌండేషన్ సహకారంతో జరిగిన ఈ కార్యక్రమంలో రాష్ట్ర వ్యాపితంగా 12 వేల మంది పిల్లలతో కథలు రాయించారు. వెయ్యి మంది పిల్లలతో వాటికి బొమ్మలు వేయించారు. 1200 మంది ఉపాధ్యాయులు కూడా తమ అనుభవాలు రాశారు. ఈ మొత్తం కార్యక్రమంలో ఎంపిక చేసిన రచనలను ప్రచురించి, ఆ రోజున విడుదల చేశారు. అంతేగాక బహుమతులు కూడా అందించారు. రచయిత ఐఎఎస్ అధికారి ఎ.విద్యాసాగర్ అద్యక్షత వహించిన ఈ సభలో విద్యామంత్రి నేదురుమల్లి రాజ్యలక్ష్మి ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. ఆంధ్రజ్యోతి అధినేత వేమూరి రాధాకృష్ణ, సంపాదకులు కె.రామచంద్రమూర్తి, విద్యాశాఖ ప్రధాన కార్యదర్శి డా.ఎస్.చెల్లప్ప, పాఠశాల విద్యా కమీషనర్ కె.రామకృష్ణారావు, బివిపట్టాభిరాం, వి.బాలసుబ్రహ్మణ్యం, శాంతాసిన్హా తదితరులు సభలో పాల్గొన్నారు. ఎమెస్కో విజయకుమార్ స్వాగతం పలికారు. ❖

RNI No : APTEL08350/01/1/2003-TC
Printed, Published and Owned by Sri **V. Krishnaiah**
1-1-187/1/2, Viveknagar, Chikkadapally, Hyderabad-500 020. Editor **T. Ravindranath**.
Printed at Prajasakti Daily Printing Press. 1-1-60/2, M.B. Bhavan, R.T.C. 'X' Road, Hyderabad.











65

ప్రస్థానం మిత్రుడు, చిత్రకారుడు అక్బర్ పెయింటింగ్స్ ప్రదర్శన
డిసెంబర్ 24-29 మధ్య హైదరాబాద్‌లో జరుగుతున్న సందర్భంగా...

## -ఎమెస్కో పోటీలో బహుమతిపొందిన రచనల జాబితా





1. బడినేర్పిన పాఠాలు - రూ. 50/-
2. గిరిజన పిల్లలు రాసిన కథలు - 1 - రూ. 25/-
3. గిరిజన పిల్లలు రాసిన కథలు - 2 - రూ. 25/-
4. ఉత్తరాంధ్ర పిల్లలు రాసిన కథలు - 1 - రూ. 25/-
5. ఉత్తరాంధ్ర పిల్లలు రాసిన కథలు - 2 - రూ. 25/-
6. కోస్తా పిల్లలు రాసిన కథలు - 1 - రూ. 25/-
7. కోస్తా పిల్లలు రాసిన కథలు - 2 - రూ. 25/-
8. రాయలసీమ పిల్లలు రాసిన కథలు - 1 - రూ. 25/-
9. రాయలసీమ పిల్లలు రాసిన కథలు - 2 - రూ. 25/-
10. తెలంగాణా పిల్లలు రాసిన కథలు - 1 - రూ. 25/-
11. తెలంగాణా పిల్లలు రాసిన కథలు - 2 - రూ. 25/-

## వాడ్రేవు చినవీరభద్రుడు రచనలు



1. మీరు బడిలో ఏమి నేర్చుకుంటారు? రూ. 30/-
2. మీరు ఇంటిలో ఏమి నేర్చుకుంటారు? రూ. 30/-
3. మీరు సమాజంనుంచి ఏమి నేర్చుకుంటారు? రూ. 30/-

## డా॥ బి.వి.పట్టాభిరామ్ రచనలు

### వెలుగుబాట

8 పుస్తకాల సెట్టు,
ఒక్కొక్క పుస్తకం రూ. 30/-



### ఎదగడానికి 7మెట్లు

7 పుస్తకాల సెట్టు
ఒక్కొక్క పుస్తకం రూ. 30/-





### చిట్టిపొట్టి కథలు

20 పుస్తకాల సెట్టు
ఒక్కొక్క పుస్తకం రూ. 15/-



## మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMO2A114 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యబడి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |